

'ఒక లైలా కోసం' అంటూ కుర్రకారుతో చిందులు వేయించి, 'ముకుంద'తో వారిని మురిపించి 'దువ్వాడ జగన్నాథం' అంటూ మరోసారి వారిని పలకరించింది కన్నడ బ్యూటీ పూజా హెగ్డె. ఉత్తరాదిలో పుట్టి పెరిగిన పూజ ముందుగా కోలీవుడ్‌లో పరిచయమై, ఆ తర్వాత టాలీవుడ్, బాలీవుడ్‌లను చుట్టేసి, తిరిగి 'దువ్వాడ జగన్నాథం'తో మరోసారి తెలుగు వారిని పలకరించింది. ఈ సందర్భంగా పూజా హెగ్డెతో....

# తనే నా హీరో



## -పూజా హెగ్డె

### అల్లు అర్జున్‌తో చేయడం ఎలా ఉంది?

సినిమాలు అందరూ ఇష్టపడతారు. అల్లు అర్జున్ గారు మాత్రం సినిమాలను ప్రేమిస్తారు. ప్రతి సినిమాను సొంత బిడ్డను చూసినట్లే చూస్తారు. ఆయనతో చేయడం మరిచిపోలేని అనుభూతి అంటే తక్కువ మాటే అవుతుంది. అంతటి మంచి అనుభూతి కలిగింది. సినిమాలో తన క్యారెక్టర్ వరకూ చూసుకోకుండా తోటి వారి నటన గురించి కూడా పట్టించుకుంటారు. అదంతా సినిమా బాగా రావడానికే తప్ప మరో ఉద్దేశం ఉండదు. సెట్‌లో ఎంత జోవియల్‌గా ఉంటారో, నటన విషయంలో అంత సీరియస్‌గా ఉంటారు. ఆయనను చూసి ఇప్పటికే చాలా నేర్చుకున్నాను. నేర్చుకోవలసింది చాలా ఉంది.

### అల్లు అర్జున్, హృతిక్ ఇద్దరిలో ఎవరు డ్యాన్స్ బాగా చేస్తారు?

'మొహెంజోదారో' స్లో సినిమా. అందులో డ్యాన్సులు కూడా అంతే స్లోగా ఉంటాయి. 'దువ్వాడ జగన్నాథం' అలా కాదు. ఇందులో డ్యాన్సులు స్పీడ్‌గా ఉంటాయి. అర్జున్‌గారి స్పీడు, ఎనర్జీ అందుకోవడానికి చాలా కష్టపడాల్సి వచ్చింది. ఎలాగో ఆయన స్పీడును అందుకోగలిగాను. ఇద్దరిలో ఎవరు స్పీడూ అంటే చెప్పడం కష్టమే!

### సినిమా షూటింగ్ సందర్భంగా మెచ్చుకోవలసి వస్తే ఎవరిని మెచ్చుకుంటారు?

కెమెరామెన్‌ని. షూటింగ్ అంతా ఎంతో ఓర్పుగా పనిచేసేవారు. ఎవరిమీదా ఎలాంటి ఫిర్యాదులు దర్శక నిర్మాతలకు చేసేవారు కాదు. నిజంగా చాలా మంచి వ్యక్తి. సినిమా ఇంత అందంగా రావడానికి కెమెరామెన్ పనితనం ఎంతో ముఖ్యం. అందుకే మొదటి క్రెడిట్ ఆయనకే దక్కాలి.

### ఈ సినిమా దర్శకనిర్మాతల గురించి....

నిర్మాత దిల్‌రాజుగారు ఎనర్జిటిక్ పర్సన్. ఎప్పుడూ నవ్వుతూ, చలాకీగా ఉంటారు. అలసిపోవడం, లేదా కోపం తెచ్చుకోవడం అరుదుగా కనిపిస్తాయి ఆయనలో. ఇక దర్శకుడు హరీష్ శంకర్‌గారయితే తను అనుకున్న అవుట్‌పుట్ వచ్చేంత వరకూ ఆర్టిస్టులతో చేయిస్తూనే ఉంటారు. కాంప్రమైజ్ కావడం అనేది ఆయనలో నాకు కనిపించలేదు. ముక్కుసూటి వ్యక్తి. ఏదన్నా అనాలన్నా ముఖం మీదే అనేస్తారు. తిట్టాలన్నా ఆయనది అదే పద్ధతి. ఇదంతా కొద్దిసేపే. తిరిగి మళ్ళీ నార్మల్ అయిపోతారు.

### మీమీద వచ్చే గాసిప్స్ గురించి...?

హీరో హీరోయిన్లపై గాసిప్పులు పుట్టించి నవ్వుకోవడం కొందరికి సరదా. అలాంటి వారి గురించి పట్టించుకుని నా టైం వేస్ట్ చేసుకోను. 'మొహెంజోదారో' షూటింగ్ సమయంలో హృతిక్‌తో నాకూ సంబంధం ఉందని అన్నారు. అలాంటివి విన్నప్పుడు నవ్వుకుంటానే తప్ప సీరియస్‌గా తీసుకోను.

### సినిమాల్లో చలాకీగా కనిపిస్తారు. బయట కూడా అలాగే ఉంటారా?

అస్సలు ఉండను. నేను ఇంట్రావర్ట్‌ని. ఎవ్వరితోనూ అంత త్వరగా కలవలేను. ఒకసారి స్నేహం చేశానా... జీవితాంతం వారితో స్నేహంగానే ఉంటాను. నాకు స్నేహితులు తక్కువే! షూటింగ్, ఇల్లు తప్ప మరో ప్రపంచం ఉండదు.

### మీ జీవితంలో నిజమైన హీరో?

మా మదర్. అన్ని విషయాల్లోనూ తను నాకు అండగా నిలుస్తుంది. ఏదైనా క్లిష్టమైన సమస్య ఎదురైతే ముందుగా తనకే చెబుతాను. ఏ విషయంలోనూ తొందరపడదు. ఆలోచించి నిర్ణయాలు తీసుకుంటుంది.

### తెరమీద ప్రేమలు సరే....నిజజీవితంలో ప్రేమ గురించి?

స్కూల్ రోజుల్లో మా డ్రాయింగ్ టీచర్ అంటే ఇష్టపడేదాన్ని. మిగత సబ్జెక్టుల్లో వందకి 97 మార్కులు వస్తే ఆయన సబ్జెక్టులో మాత్రం నూటికినూరు మార్కులు వచ్చేవి. ఆ ఇష్టాన్ని ప్రేమ అని కూడా అనుకున్నాను. అది ప్రేమ కాదు, ఇష్టం మాత్రమేనని తరువాత తెలుసుకున్నాను.

### ఇష్టానికీ, ప్రేమకూ తేడా ఏమిటి?

ఎవరినైనా ఇష్టపడవచ్చు. కొంతకాలం తరువాత వారి మీద ఇష్టం లేకపోవచ్చు. అది సందర్భానుసారం ఉంటుంది. ఎవరిమీదనైనా ప్రేమ పుడితే అది జీవితాంతం ఉంటుంది.

### ప్రేమ మారకపోతే ఇన్ని బ్రేకప్‌లు ఎందుకు అవుతున్నాయి?

బ్రేకప్ అనేది వ్యక్తుల మీద ఆధారపడి ఉంటుంది. సందర్భం తెలియకుండా ఒకరిది తప్పు, ఒకరిది ఒప్పు అనలేం కదా!

-కె.రామకృష్ణ

## సరదాగా....

### నేను కాదు

అతను బిల్డింగ్‌లోని నలభయ్యవ అంతస్తు మీద నిలబడి ఉన్నాడు.

జాణవులే..నెరజాణవులే... రింగ్‌టోన్‌తో అతని మొబైల్ రింగ్ అయింది.

అతను ఎత్తి మాట్లాడుతున్నాడు. ఇంతలో పక్క ఫ్లాట్‌లో నుంచి "శ్యామ్‌గారూ...ఇప్పుడే మీ భార్య అంకిత కార్ యాక్సిడెంట్‌లో చనిపోయింది" అని అరిచి మరీ చెప్పాడు పక్క ఫ్లాట్ అతను. ఒక్క సారిగా షాక్ తిన్న శ్యామ్ వెంటనే అక్కడ నుంచి కిందకు దూకుతాడు.

ముప్పయ్యవ అంతస్తుకు చేరుకునే సరికి అతను "అవునూ.. ఈ అంకిత ఎవరు? ఈ పేరు నేనెప్పుడూ వినలేదే?"

ఇరవయ్యో అంతస్తు దగ్గర "అరె.. ఇంతవరకు నాకు పెళ్లే అవలేదు!"

పదవ అంతస్తు దగ్గర "ఓరి నా బతుకు మీద బండపడా... నా పేరు శ్యామ్ కాదు.. రామ్ కదా!"

### ఒక ప్రశ్న?

అనగనగా ఓ రాజ్యం. పేరు సగర. చిత్రాంగదుడు ఆ రాజ్యాన్ని పాలిస్తున్నాడు. ఆ మహారాజుకు కళలంటే ప్రాణం. తాను స్వయంగా అన్ని కళలలోనూ ఆరితేరాడు. అంతేకాదు కళాకారులను ప్రోత్సహిస్తూ, వారికి మణిమాణిక్యాలతో, వజ్ర వైఢూర్యాలతో సత్కారాలు చేసేవాడు. ఆ రాజ్యంలోని వారే కాదు పక్క రాజ్యాలలోని వారు కూడా చిత్రాంగదుడి ఆస్థానంలో తమ కళను ప్రదర్శించి రాజుగారి మెప్పు, ఆదరాభిమానాలతోపాటు విశేషంగా బహుమతులు పొందేవారు. అయితే ఆ రాజ్యంలోనే తరతరాలుగా రాజాస్థానాన్నే నమ్ముకుని బతుకుతున్న కళాకారుల కుటుంబం ఒకటి ఉంది. ఆ కుటుంబ సభ్యులు మొత్తం ఆరుగురు. కళలకు నిలయమైన ఆ కుటుంబంలో వారి పేర్లు కూడా కళలకు సంబంధించినవే! ఆ కుటుంబంలోని వారు ఏఏ కళలలో ప్రసిద్ధులో ఆ కళ పేరు మీదే వారిని పిలుస్తారు. వారి పేర్లు తోలుబొమ్మలాట, జానపదం, నాట్యం, చిత్రలేఖనం, సంగీతం, కవిత్వం. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే కింద ఇచ్చిన సూచనల ఆధారంగా ఆ కుటుంబంలో ఎందరు మగవాళ్ళున్నారో, ఎవరెవరో కనిపెట్టాలి.

నాట్యం, కవిత్వం ఇద్దరూ అక్కాతమ్ముడు.

సంగీతం భర్తకి జానపదం తమ్ముడు.

తోలుబొమ్మలాట తండ్రి చిత్రలేఖనం. అతడే కవిత్వానికి తాతగారు కూడా.

**సమాధానం**

ఆ కుటుంబంలో నలుగురు మగవాళ్ళున్నారు. వారు చిత్రలేఖనం, తోలుబొమ్మలాట, జానపదం, కవిత్వం.

నాంచారి
రచయిత్రి

'పనిమనిషి' ఆధారంగా మీరో కథ రాసినా నాకు కూడా పారితోషికంలో వాటాయివ్వాలి అమ్మగారూ!!

ఆంటీ వాళ్ళింట్లో ఏదైనా పగలగొట్టావనుకో... రేపు పెద్దయ్యాక నువ్వే సంపాదించి కొనిపెట్టాలి.. గుర్తుంచుకో వెధవ!!

'హోటల్
అప్సర
★★★

పెళ్ళిరోజుని, తీసుకువచ్చారో బోడి 'హోటల్‌కి!?

ఈరోజు
స్పెషల్
చక్కెరపొంగలి
దద్దోజనం

WELCOME



38

## 'సెక్స్' ఈజ్ ఆల్

యవ్వనంగా కనిపించాలా? ఒత్తిడి తగ్గిపోవాలా? సుఖనిద్ర కావాలా? అయితే వారంలో రెండు మూడు సార్లు సెక్స్‌లో పాల్గొనండి. యాక్టివ్ సెక్స్ లైఫ్ మీకెన్నో ఆరోగ్యలాభాలు తెచ్చిపెడుతుంది. స్త్రీల మానసిక శారీరక సమస్యలకు కూడా సెక్స్ ఒక పరిష్కారం అంటున్నారు పరిశోధకులు.

16

### స్టార్ ఫైటర్

(కొత్త సీరియల్ ప్రారంభం)

గాలి తగిలితే భగ్గున మండే భాస్వరంలాంటివాడు షాడో. అతను కార్చిచ్చు అయితే దాన్ని ఎగదోసే ఈదురుగాలి గంగారాం. ఇప్పుడు వాళ్ళెక్కడున్నారు? ఏం చేస్తున్నారు? వాళ్ళ పయనం ఎటు?

30

### నిధి

(కొత్త సీరియల్ ప్రారంభం)

సుభిక్ష సామ్రాజ్య క్రీడాంగణం జనంతో కిక్కిరిసింది. క్షత్రియకుమారుడితో ఖడ్గ, గదాయుద్ధ స్పర్ధకు దిగాడో సామాన్యుడు. గెలిచిందెవరు? ఓడిందెవరు? ఆ సామాన్యుడు అసామాన్యుడయ్యాడా?

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: కాజల్ అగర్వాల్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### తేడా

బ్రహ్మచారికీ, పెళ్ళి అయిన వ్యక్తికీ తేడా ఏమిటి? తేడా ఏమిటంటే...బ్రహ్మచారి ఇంటికి రాగానే ముందు ఫ్రిడ్జ్‌లో ఏమున్నదీ చెక్ చేసుకుని, తర్వాత బెడ్ మీదికి వెళ్తాడు. అదే పెళ్ళయినవ్యక్తి ఇంటికి రాగానే ముందు బెడ్‌ని చెక్ చేసుకుని, తర్వాత ఫ్రిడ్జ్ దగ్గరకు వెళ్తాడు.

### పని ముందు

**ఆఫీసర్:** చాలా ఆశ్చర్యంగా ఉంది రావు. అక్కడ శ్మశానంలో మీ అత్తగారి దహనం జరుగుతోంటే ఇక్కడ ఆఫీసులో పని చేస్తూ నువ్వు....?!

**రావు:** మీరే అంటారు కద్సార్, పని ముందు, ఆనందం తర్వాత అని. అందుకే...

### దేనికి?

**తండ్రి:** పడుకునేటప్పుడు కళ్ళద్దాలు దేనికిరా?

**కొడుకు:** కలల్ని క్లియర్‌గా కందామని.

### పోదు

**భార్య:** కాణీ పరకా పోపులడబ్బాలో పెడితే పిల్లాడు పట్టుకుపోతున్నాడండీ, ఏం చెయ్యను? ఎక్కడ దాచను?

**భర్త:** వాడి టెక్స్ట్ బుక్స్‌లో దాచిపెట్టు. పైసా కూడాపోదు.

### ఏడాదికోసారి

రోజుకి ఒకసారి సెక్స్‌లో పాల్గొన్న భార్యాభర్తలు ఆనందంగా ఉంటారని ఓ థెరపిస్ట్ ఓ థియరీ చేశాడు. సెమినార్ కండక్ట్ చేసి, హాజరైన వారిని అడిగాడిలా.

"మీలో ఎంతమంది రోజుకి ఒకసారి సెక్స్‌లో పాల్గొంటారో చేతులెత్తండి."

సగానికిసగంమంది చేతులెత్తి పెద్దగా నవ్వారు.

"మరి వారానికి ఒకసారి పాల్గొనేదెంతమందో?" అడిగాడు థెరపిస్ట్.

మూడోవంతుమంది చేతులెత్తి ముసిముసిగా నవ్వారు.

"నెలకొకసారి ఎంతమంది పాల్గొంటారు?"

సిగ్గుపడుతూ ఉన్న కొద్దిమందీ చేతులెత్తారు.

"సంవత్సరానికి ఒకసారి పాల్గొనేవారెవరైనా ఉన్నారా?" అడిగాడు థెరపిస్ట్. అతను అడగడమే ఆలస్యం వెనుక కూర్చొన్న ఓ వ్యక్తి ఆనందంగా నవ్వుతూ ఉత్సాహంగా చేతులూపాడు. డాన్స్ చేయసాగాడు. దిగ్భ్రాంతికి గురయ్యాడు థెరపిస్ట్. తన థియరీ తప్పని భావించాడు. ఆ వ్యక్తిని అడిగాడిలా.

"మీరు సంవత్సరానికి ఒక్కసారే సెక్స్‌లో పాల్గొంటారు, అవునా?"

"అవున్సార్"

"దానికి ఎందుకంత ఆనందం?"

"ఆ రోజు ఈ రోజేసార్" చెప్పాడు ఆ వ్యక్తి.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 18

5-7-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## బామ్మకథ

ఆమెనంతా బామ్మ అంటారు. చిన్నాపెద్దా కూడా ఆమెను అలాగే పిలుస్తారు. బామ్మకి డెబ్బయి ఏళ్ళు. సన్నగా పొడుగ్గా ఉండేది. భర్తా, పిల్లలూ లేరేమో! ఒంటరిగా ఉండేది. అగ్రహారంలో ఓమూల ఓ చిన్న ఇంట్లో ఉండేది. ఇంటినిండా పుస్తకాలే! చందమామ, బాలమిత్ర, బొమ్మరిల్లులాంటి కథలపుస్తకాలూ, పిల్లలపుస్తకాలూ అనేకం ఉండేవి. వాటిని పదేపదే చదువుతూ ఉండేది బామ్మ. కంఠతః పడుతున్నట్టుగా ఉండేది. శనివారం వస్తే చాలు! నాలుగు పచ్చడిమెతుకులు నోట్లో వేసుకుని పరుగుదీసేది బామ్మ. ఆ పరుగు ఎక్కడికి అంటే?

అగ్రహారంలో నాలుగు ప్రాథమికపాఠశాలలు ఉన్నాయి. ఆడబడి, అమ్మతల్లిబడి, రాయుడుగారిబడి, రమణమ్మబడి అని. ఆ బడుల్లో పిల్లలకి కథలు చెప్పేది బామ్మ. ఇక్కడో గంటా, అక్కడో గంటా కథలు చెప్పి, పిల్లల ఊసుల్నీ, ఊహల్నీ, నవ్వుల్నీ పలకరించేది. పలకరించి వాటిని అంచనా వేసేది. ఈ పిల్లాడు కలెక్టరౌతాడు. వీడు పోలీసాఫీసర్ అవుతాడు. ఈ పిల్ల టీచరౌతుంది. ఇది డాక్టరౌతుంది అనేది. గడచిన యాభైఏళ్ళలో బామ్మ అంచనాలు తారుమారైన దాఖలాలు లేవు. ఆమె చెప్పినట్టుగానే అంతా స్థిరపడ్డారు. అందుకే బామ్మను సంప్రదించాకే పిల్లలను పెద్దచదువుల్లో పెట్టడం జరిగేదక్కడ. ఇప్పుడు పట్నంలో కలెక్టర్‌గారు ఉన్నారా? ఆయన బామ్మకథలు వినే ఇంత పెద్దవాడయ్యాడు. అలాగే డాక్టర్ సుహాసినిగారు లేరూ, ఆమె కూడా బామ్మకథలు వినే అంత పెద్దదైంది. బామ్మకథలంటే వాళ్ళంతా చెవికోసుకునేవారు.

బామ్మకు ఈ కథలపిచ్చి ఏమిటి? ఎందుకు ఇలా కథలు చెప్పేది అంటే...ఆ రోజుల్లో బామ్మ తండ్రిగారు పెద్ద హరికథారాధకులు. వారు కథ చెబుతుంటే అంతా కళ్ళ ముందు జరుగుతున్నట్టుండేది. భక్తప్రహ్లాద కథ చెబుతూ శ్రీమహావిష్ణువు, నృసింహావతారంలో స్తంభాన్ని పగలగొట్టుకుని వస్తున్నాడంటే, స్తంభం పగులుతున్న ధ్వని, సింహగర్జన, వాతావరణ బీభత్సం అంతా కళ్ళకు కట్టినట్టుగా ఉండేది. ఆయన వర్షం గురించి చెబితే శ్రోతలకి వర్షంలో తడుస్తున్నట్టుగా ఉండేది. చలి గురించి చెబితే చలికి వజవజా వణకుతున్నట్టుండేది. ఆ పళంగా ఆయనకి పెద్దపేరూ, గౌరవమూ ఉండేవి. గొంతునిండా కథలుతప్ప, గూడా, గొడుగా? ఆయనకి ఏమీ లేవు. అగ్రహారీకులే ఆయనకి అన్నీ సమకూర్చారు. బామ్మకి అప్పుడు పదేళ్ళుంటాయేమో! తల్లిపోయిన బామ్మను వెంటబెట్టుకుని వస్తే అగ్రహారం ఆయన్ని అక్కున చేర్చుకుంది. తండ్రి హరికథలు విని, బామ్మకి కూడా కథలు చెప్పాలనిపించింది. తండ్రిలా పెద్దలముందు హరికథలు చెప్పడం ఇష్టంలేక, పిల్లలముందు పిట్టకథలు చెప్పడం అలవాటు చేసుకుంది. ఇరవైఏళ్ళ వయసులో కథలు చెప్పడం మొదలు పెట్టింది బామ్మ. అదే పనిగా పెట్టుకుంది.



రాయుడుగారిబడి ఉందా? ఆ బళ్ళో ఓ గంటసేపు పిల్లలకి పిట్టకథలు చెబితే బాగుంటుందన్నారు రాయుడుగారు. మౌఖిక కథాసంప్రదాయం గొప్పదంటూ, పిల్లల్లో నైతికవిలువలూ, కుటుంబవిలువలూ బలోపేతం అయ్యేందుకు కథలు చెప్పడం చాలా అవసరం అన్నారాయన. పిల్లల్లో ఊహాశక్తి పెంచేందుకు, వారి వ్యక్తిత్వం రూపుదిద్దుకునేందుకు కథలు కావాలంటూ, పిల్లలు కొత్తగా ఆలోచించేందుకే కాదు, పిల్లలకీ పెద్దలకీ మధ్య ఆత్మీయతానురాగాలు పెంచేందుకు కూడా కథలు అవసరం అన్నారు. చెప్పేవారు ఎవరు ఉన్నారని రాయుడుగారు వెదుకుతోంటే...వెదకాల్సిన తీగె వేలికే చుట్టుకుని కనిపించింది అన్నట్టుగా బామ్మ దొరికింది. నాటి నుంచి కథలు చెప్పడం బామ్మ వృత్తి అయింది. పంచతంత్రం కథలు, భట్టివిక్రమార్క కథలు, కథాసరిత్సాగరం, పేదరాసిపెద్దమ్మకథలు, రామాయణ, భారత, భాగవతకథలు బామ్మ చెబుతుంటే సినిమా చూస్తున్నట్టుగా ఉండేది. కథల్లో పడి ప్రేమా, పెళ్ళీ వద్దనుకున్నది బామ్మ. బడిపిల్లలే లోకం అనుకున్నది. ఆ లోకంలోనే అందాలూ ఆనందాలూ వెతుక్కుంది. పెళ్ళీగిళ్ళీ మానుకుని, బడిపిల్లల కోసమే బతుకుతున్న బామ్మకు పద్మశ్రీ ఇవ్వాలని పట్టుబట్టింది అగ్రహారం. ప్రభుత్వానికి అర్జీపెట్టింది. ఆ పురస్కారం ఆమెకు వస్తుందో రాదో తెలియదుగాని, అసలు సంగతి ఏమిటంటే...మొన్నామధ్య ఆడబడిలో పిల్లలకి కథలు చెబుతూ చెబుతూ పాపం! బామ్మ తలవాల్చేసింది. చనిపోయింది. అదీ కథ. కథల బామ్మ అలా కథగా మిగిలిపోయింది.

నవ్య




## సంకల్పతరు

మారిన కాలంతోపాటు పెరిగిన సాంకేతికతతో పట్టణాల్లోనే కాదు పల్లెల్లో కూడా మొక్కలు నాటేవారే కరువయ్యారు. పారిశ్రామిక అభివృద్ధి పేరిట చెట్ల నరికివేతతో పర్యావరణ సమతుల్యత దెబ్బతింటోంది. అందుకే మొక్కలు నాటండి అనే ప్రచారం, హరితహారం వంటి కార్యక్రమాలు. అయితే మొక్కలను నాటడం వరకూ ఓకే కానీ వాటికి సంరక్షణ ఎలా? అని ప్రశ్నిస్తోంది సంకల్పతరు. మీరు మొక్కను ఎంచుకోండి... నాటడం, దాని సంరక్షణ బాధ్యతా అంతామాదే అని చెబుతోంది. ఇంతకీ ఏమిటీ సంకల్పతరు!

మొక్కలను నాటడానికి, వాటిని వటవృక్షాలుగా తీర్చిదిద్దడానికి ఏర్పడిన ఆన్‌లైన్ ప్లాట్‌ఫాం సంకల్పతరు! 2013లో అపూర్వ భండారి దీన్ని స్థాపించాడు. ఉత్తరాఖండ్‌కి చెందినవాడు. చెట్ల నరికివేతతో వాతావరణంలో వస్తున్న మార్పులను గురించి ఆలోచించి, చివరికి సంకల్పతరు దిశగా అడుగులు వేశాడు. మొండిగా పెరిగే కొన్ని చెట్లను మినహాయిస్తే, చాలా వాటికి ఓ దశ వరకు పరిరక్షణ అవసరం. సంకల్పతరు ఈ సమస్యకు సాంకేతికత సహాయంతో ఓ సృజనాత్మక పరిష్కారాన్ని కనిపెట్టింది. మొక్కల పెంపకానికి అనువైన భూమిని ఎంచుకోవటం దగ్గరనుంచి మొక్కలను నాటి, అవి ఎదిగేవరకు సంరక్షణ బాధ్యతంతా సంకల్పతరుదే. వీరి లక్ష్యం కేవలం పర్యావరణానికి మేలు చేయటమే కాదు సామాజికంగా కూడా ప్రభావం చూపటం. అంటే మొక్కలు పెరిగి పచ్చదనం విస్తరించటం మాత్రమే కాదు వాటి ద్వారా కొన్ని జీవితాలు కూడా బాగుపడాలి.



మొక్కలను పెంచాలనే ఆసక్తి ఉన్న వ్యక్తులు, సంస్థలు సంకల్పతరుని సంప్రదిస్తే చాలు, వారి ఆకాంక్షను నెరవేరుస్తారు. స్థానికంగా ఉన్న పంచాయతీలు, రైతులతో కలసి పనిచేస్తోందీ సంస్థ. ఈ సంస్థ వెబ్‌సైట్‌లో మొక్కను కొనుగోలు చేసి ఏ ప్రాంతంలో పెంచాలో చెప్పవచ్చు. గూగుల్ ఎర్త్ మ్యాపింగ్ ద్వారా ఆ మొక్క ఎదుగుదలను ఎప్పటికప్పుడు మానిటర్ కూడా చేయవచ్చు.

ఈ ఎన్‌జీవో ఇప్పటికి 12 రాష్ట్రాల్లోని వివిధ ప్రాంతాల్లో పచ్చదనాన్ని విస్తరిస్తోంది. కార్పొరేట్ కంపెనీలతో భాగస్వామిగా ఉంటూ పచ్చదనాన్ని పెంచటంలో కృషి చేస్తోంది. యునైటెడ్ నేషన్స్ డికేడ్ ఆన్ బయోడైవర్సిటీ లాంటి అనేక ఇతర పర్యావరణ పరిరక్షణ సంస్థలతో కూడా కలిసి పని చేస్తోంది. ఈ సంస్థద్వారా మొదటి చెట్టుని భారత్ మాజీ రాష్ట్రపతి అబ్దుల్ కలామ్ నాటారు. ఆయన అందించిన స్ఫూర్తితో ముందుకు సాగుతున్నామని సంకల్పతరు అంటోంది.

నవ్య

## మెయిల్ బాక్స్

### అద్భుత 'ప్రయాణం'

బాలి అనువదిస్తున్న 'ప్రయాణం' సీరియల్ ఒక స్త్రీ జీవితాన్ని ఎంతో బాగా ఆవిష్కరిస్తోంది. పాత కాలంనాటి మన స్త్రీల జీవితాలను ప్రతిబింబిస్తోంది. యూదు సంప్రదాయాలు, యూదు స్త్రీల మూఢనమ్మకాలు, పాతకాలంనాటి ఆమెరికా పరిస్థితులను కళ్ళకు కడుతోంది. రచయితకు ధన్యవాదాలు.

—వల్లీపద్మావతి, హైదరాబాద్

### కథలు ఆసక్తికరం

కొత్తచిగురు, పరిపూర్ణం కథలు చాలా ఆసక్తికరంగా ఉన్నాయి. ఆరోగ్యమే మహాభాగ్యంలో బొప్పాయితో మతిమరుపు ఎలా మాయమవుతుందో వివరించారు. సరసి కార్టూను కడుపుబ్బ నవ్వించింది. 'తీన్'మార్ కార్టూన్లు బాగున్నాయి.

—చిన్న, ఖమ్మం

### కోట నిండునూరేళ్ళూ జీవించాలి

కోట శ్రీనివాసరావు జీవిత విశేషాలు తెలుసుకున్నాం. మంచి మనసున్న వ్యక్తిని ఇంటర్వ్యూ చేసిన భాగ్యలక్ష్మిగారికి వందనం. అందరి ఆశీర్వాదాలు నాకుండాలని 73 ఏళ్ళ వయసులో కోరడం కోటగారి గొప్పతనం. నిండునూరేళ్ళు వారు జీవించాలి. కొత్త చిగురు కథా రచయిత డా.నీరజ అమరవాదికి థాంక్స్.

—కోలిపాక శ్రీనివాస్, బెల్లంపల్లి

### కృష్ణుని వర్ణన బాగుంది

హరివంశంలో చిన్నికృష్ణుని చిలిపి చేష్టలు చదివి యశోదతోపాటు మేమూ ఆనందించాం. ఎంతో బాగుంది అరణిగారి వర్ణన. పైథాన్‌ను మెడకు చుట్టి మసాజ్ చేయడం ఒక కొత్త వింత. బాహుబలి–2వి ఒక వసూళ్ళేనా అని అనిల్‌శర్మ విమర్శించడంలో లాజిక్ ఉంది! సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు లాంటి మంచి సీరియల్ అందించిన నవ్యకు అభినందనలు. మామిడిపళ్ళు తినడం వల్ల వచ్చే సమస్యలు ఆశ్చర్యానికి గురిచేశాయి.

—జె.జ్ఞానబుద్ధ, సిద్ధార్థ నగర్, తూ.గో.జిల్లా

### ఆద్యంతం అలరించే వీక్లి

నవ్య వీక్లీ ముఖచిత్రం మొదలు చివరిపేజీ వరకు చదవడానికి ఎంతో ఆనందదాయకంగా ఉంటున్నది. హరివంశం ఇప్పుడు బాగా అర్థం అవుతున్నది. మొదటిపేజీ 'జంతికల జానకమ్మ' నన్ను ఎన్నో సంవత్సరాలు వెనక్కి తీసుకెళ్ళింది. జీవితమే ఒక ప్రతి ఘటన కోట శ్రీనివాసరావుగారి కథనం నడిపించిన చల్లా భాగ్యలక్ష్మిగారికి అభినందనలు. కైకాల సత్యనారాయణ గురించి రాయండి. మనసుగతి ఇంతే సీరియల్ కొత్త పంథాలో ఉంది.

గత ఏడాది నుండి రెగ్యులర్‌గా నవ్య వీక్లీ చదువుతున్నాను. సినీవాలి వంటి యదార్థ సీరియల్స్ ఇంకా ప్రచురించండి. జోకులు మరిన్ని పెంచండి.

—కె.ఎల్.బి.రావు, ఎర్రుపాలెం

### వినోద విజ్ఞానాల వీక్లి

నవ్యవీక్లీలో నేను మొదటగా చదివేది మార్నింగ్ కాఫీ. వినోదంతోపాటు విజ్ఞానం కూడా అందిస్తోంది వీక్లీ. బహుమతి కథ 'నిర్గుణుడు' చాలా చక్కగా ఉంది. బహుమతికి అర్హమైన కథ. రచయితకు అభినందనలు. మిగతా కథలన్నీ బాగున్నాయి. 'ప్రతి ఫ్రెండూ అవసరమేరా' కథ చివరివరకూ ఆసక్తికరంగా చదివించింది. స్నేహం అంటే ఏమిటో ఆ కథ చదివితే తెలుస్తుంది. కొత్తగా ప్రారంభమైన విజయ విలాసం–2 ప్రతిఒక్కరూ చదవాల్సిన అంశం. ఆరోగ్యం గురించి చాలా విషయాలు తెలియజేశారు. కార్టూన్లు నవ్విస్తున్నాయి. శివారెడ్డిగారి కవిత చాలా బాగుంది. మృత్యుంజయులు వ్యాసం ఆశ్చర్యం కలిగించింది.

—కాళ్ల గోవిందరావు, ఆముదాలవలస. శ్రీకాకుళంజిల్లా

### జంతికల జానకమ్మ

మొదటిపేజీ జంతికల జానకమ్మ హృద్యంగా ఉంది. 47 భాగాల మధుబాబు వెట్టి సీరియల్ సినిమా కథనంలా నడిచింది. 'పరిపూర్ణ' కథాకర్త తటవర్తి నాగేశ్వరికి అభినందనలు. సురేంద్ర రొడ్డ గారి కవిత ఆడవాళ్ళ సాధకబాధకాల క్రమాన్ని అక్షరబద్ధం చేసింది. ప్రయాణం సీరియల్ ఒక తెలుగు కథ చదువుతున్నంత అద్భుతంగా ఉంటోంది.

—నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

### వీక్లీకి తలమానికం 'హరివంశం'

నవ్య వీక్లీలో నేను మొదట చదివేది హరివంశం. అరణి రాస్తున్న 'హరివంశం' మొదటినుండీ చదువుతున్నాను. కొన్ని వారాలపాటు వంశవృక్షాలు, వారి నామధేయాలు వివరించుకుంటూ వచ్చారు. అవన్నీ




తెలుసుకోదగినవే. మొదట కొద్దిగా 'ఇదేమిటి ఇలా ఉంది' అనిపించింది. అయినప్పటికీ భీష్ముడు, శంతనుడి పూర్వీకుల చరిత్ర, భూదేవి ఆక్రందన, కురుక్షేత్ర యుద్ధం ఆవశ్యకత, దేవతల సమాలోచనలు, కృష్ణుడి పుట్టుక వంటివన్నీ ఎంతో వివరంగా తెలిసిన తర్వాత ఈ కథ వెనుక సైంటిఫిక్ అంశాలు కూడా ఉన్నాయనిపించింది.

మెల్లిగా కృష్ణుడికథ ప్రారంభమై శరవేగంగా పుంజుకుని ఇప్పుడు ఎంతో బాగా చదివిస్తోంది. కృష్ణుడి బాల్యం, ఆటపాటలు, వర్ణనలు ఎంతో రక్తి కడుతూ వారం వారం మమ్మల్ని అలరిస్తోంది. ప్రపంచ సాహిత్యానికే తలమానికం మన పురాణేతిహాసగాథలని హరివంశం మరోసారి నిరూపించింది.

భాగవతంలో దశమస్కంధం, హరివంశం పూర్వభాగం రెండూ ఒకేలా అనిపిస్తున్నాయి. అయినా అటు భాగవతాన్ని ఇటు హరివంశాన్ని రాస్తున్న శర్మగారు రెండింటిలోనూ తేడా చూపిస్తున్నారు. పాఠకులను అలరిస్తున్నారు.

—శేషాచార్యులు, పెంటపాడు. ప.గో.జిల్లా

## మానవ శరీర వింతలు

ప్రపంచంలో ఎన్నో గొప్పగొప్ప వింతలు ఉన్నాయి. అవన్నీ మానవ నిర్మితాలు. అవన్నీ ఒకెత్తయితే మానవ శరీరం ఒకెత్తు. మానవ శరీరంలో ఎన్నో విచిత్రమైన నిర్మాణాలు ఉన్నాయి. వాటి గురించి తెలుసుకుంటే ఔరా! అనక తప్పదు. మరి మన శరీరంలోనే ఉన్న ఆ వింతలేంటో తెలుసుకోండి!

1. ఒక నిమిషం గుండెకొట్టుకోవడం ఆపేస్తే ఇక అంతే సంగతులు. ఈ కండరం ప్రతిరోజూ ఒక చిన్నపాటి ట్రక్కును 18 మైళ్లు నడపగలిగేంత శక్తిని (ఎనర్జిని) మన శరీరంలో ఉత్పత్తి చేస్తుంది. ఒక జీవితకాలంలో మన గుండె ఉత్పత్తి చేసే శక్తితో చంద్రుడి పైకి వెళ్లి రావచ్చు. గుండెను దేహం నుండి వేరు చేసిన తర్వాత కూడా అందులో ఉండే స్వయంచోదక విద్యుత్‌శక్తి కారణంగా గుండె కొంతసేపు కొట్టుకుంటూనే ఉంటుంది.
2. ఇక మెదడు విషయానికి వస్తే, మెదడులో 60 శాతం వరకూ కొవ్వు ఉంటుంది. ఏ సమయంలోనైనా మన మెదడు 25 వాట్‌ల విద్యుత్తు ఉత్పత్తి చేయగలుగుతుంది. అంటే ఒక బల్బు వెలగడానికి సమానమైన విద్యుత్తు అన్న మాట. అంతేకాదు, 50 వేల రకాల వాసనలను మెదడు పసికట్టగలదు. ఏ వయసులోనూ ఉండనన్ని మెదడు కణాలు అత్యధికంగా రెండేళ్ల వయసులో ఉంటాయి. అయినా సరే మెదడు పూర్తిగా పరిణతి చెందడానికి 20ఏళ్ల సమయం పడుతుంది. మనం మేల్కొని ఉన్నప్పటి కంటే నిద్రపోతున్నప్పుడే మెదడు చురుగ్గా పనిచేస్తుంది. ఏమీ ఆలోచించని మనిషి చేత కూడా రోజుకు 70వేల ఆలోచనలు చేయిస్తుంది. మెదడు వల్లనే శరీరంలో ఎక్కడ నొప్పి అనిపించి మనం గుర్తించగలం. కానీ మెదడుకు నొప్పి వస్తే మాత్రం గుర్తించలేం.



3. ఎన్నిసార్లు తొలగించినా సరే పెరిగే అవయవం మన శరీరంలోనే ఉంది. అదే కాలేయం. అనారోగ్య కారణాల వల్ల కాలేయాన్ని కొంత తొలగించాల్సి వచ్చినా ఏ బాధా లేదు. అది ఎప్పుడు తొలగించినా సరే మనిషి శరీరానికి అవసరమయినంతమేరకు దానికదే పెరిగి ఆగిపోతుంది.
4. రక్తాన్ని శుద్ధి చేసే మూత్రపిండాలు నిమిషానికి 1.3 లీటర్ల రక్తం శుద్ధి చేస్తాయి. రోజుకు 1.4 లీటర్ల మూత్రం విసర్జిస్తాయి.
5. మానవ దేహాన్ని మొత్తాన్ని కప్పి ఉంచే భాగం చర్మం. ఎప్పటికప్పుడు కొత్త చర్మం రావడం, పోవడం దానంతట అదే జరిగే ప్రక్రియ. మనశరీరంలో ప్రతి నిమిషానికి 50 వేల చర్మకణాలు రాలిపోతుంటాయి. ఇలా జీవితకాలం మొత్తం రాలిన కణాల బరువు 18 కిలోలు ఉంటుంది.
6. వెంట్రుకలు, జుట్టు, గోళ్లు మనిషి చనిపోయిన తర్వాత కూడా పెరుగుతూ ఉంటాయి. ముక్కు, చెవులు కూడా జీవితాంతం పెరుగుతూనే ఉంటాయి. వీటి పెరుగుదల కొందరిలో కనిపిస్తే, మరికొందరిలో పైకి కనిపించదు.
7. శిశువు మాతృగర్భంలో ఉన్నప్పుడు శిశువు మెదడు ప్రతి సెకనుకు 8 వేల కొత్త కణాలతో వృద్ధి చెందుతుంటుంది. శిశువు పుట్టిన కొన్ని గంటలకే తల్లిని గుర్తుపడుతుంది.
8. మానవ నేత్రం 576 మెగాపిక్సెల్ సామర్థ్యం గల డిజిటల్ కెమెరా వంటిది! అది కోటి రకాల వేర్వేరు రంగుల ఛాయల్ని గుర్తించగలదు.
9. ఇకపోతే మన శరీరంలో ఉండే ఇనుము మొత్తాన్ని కలిపితే మూడంగుళాల పొడవైన మేకు తయారు చేయొచ్చట. మనిషి తన జీవితకాలంలో 75వేల గ్యాలన్ల నీరు తాగుతాడు.







**తెల్లారి లేస్తే అంతా ఇప్పుడు జోకుల కాలమే. 'పంచ్ డైలాగ్స్' కాలం. అంత్యప్రాసల కాలం. శ్రమ, ఒత్తిడి ఒకవైపు బాధపెడుతుంటే, పంచ్ డైలాగ్స్ వింటూ, జోకులు వింటూ రిలాక్స్ కావడం, తిరిగి పనిలోకెళ్ళిపోవడం షరా మామూలైంది.**

**మానవ జీవితంలో నవ్వుకి, ఆహ్లాదకరమైన హాస్యానికి ప్రాధాన్యం పెరిగింది. ఒత్తిడిని తగ్గించి మనసును ప్రశాంతంగా**

# నవ్వు.. నవ్వించు...




జూలై 1 ఇంటర్నేషనల్ జోక్ డే సందర్భంగా

**ఉంచే పరమ ఔషధమే నవ్వు. మరి నవ్వాలంటే ఎన్నో మార్గాలున్నాయి. అలా నవ్వు రప్పించడంలో ముందుండేవి జోక్స్. మనసును, మైండ్‌ని మార్చేసి కాసేపు కడుపారా నవ్వుకోవాలంటే జోక్స్ చూసినా, చదివినా సరిపోతుంది.**

జోక్స్ అనగానే కేవలం రాసినవీ, చూసినవీ అనుకుంటే పొరబాటే. ఒకరిపై ఒకరు వేసుకునే ఛలోక్తులు, స్పాంటేనియస్‌గా వచ్చే కొన్ని కొన్ని పదాలు కూడా నవ్వు రప్పిస్తాయి. వాటిని కూడా జోక్స్ అనే అనుకోవచ్చు. తెల్లారగానే మనకెన్నో దినోత్సవాలున్నాయి. అసలు ఈ 'డే'లన్నీ ఎందుకు? అవసరమా? అనే అనుమానం కూడా కొందరికి వస్తుంది. కానీ సమాజానికి ఒక నిర్దేశిత సందేశం ఇవ్వడం కోసమే ఈ ప్రత్యేక దినోత్సవాలు ఏర్పడ్డాయి. ఏది చేసినా ఎక్కడ చేసినా ప్రపంచ మానవాళి శ్రేయస్సు కోసమే. నవ్వుల డే కూడా అందుకే వచ్చింది. నవ్వు రప్పించడంలో జోకుల ప్రాధాన్యం గుర్తిస్తూ ఏటా జూలై 1న అంతర్జాతీయ 'జోక్ డే' (International Joke Day)గా పాటిస్తున్నాం. అంటే ఆరోజు మరింత బాగా నవ్వుకుని ప్రతిరోజూ ఆహ్లాదంగా, హాయిగా గడపాలని మరోసారి గుర్తు చేసుకుని, మరింత ఆరోగ్యం పెంచుకుంటామన్న మాట.

### పెరుగుతున్న కామెడీ 'షో'లు

పొద్దున లేచింది మొదలు రాత్రి పడుకునే వరకు రకరకాల టెన్షన్లు. ఈ టెన్షన్లన్నింటినీ మరచిపోయి హాయిగా నవ్వుకునేందుకే మనిషి ఎదురుచూస్తాడు. ఆ ఎదురు చూపుల్లో దొరికిన బలమైన సాధనమే ఈ కామెడీ షో. ఇంతకుముందు కామెడీ సినిమాలకున్న ప్రాధాన్యం క్రమంగా టీ.వీలకు కూడా పాకింది. ఇంతకుముందు టీ.వీ సీరియల్స్, షోలు అంటే డ్యాన్సులు, ఏడుపులు లాంటివే ఉండేవి. హాస్యాన్ని అందించే షోలు చాలా తక్కువ ఉండేవి. కానీ ఇప్పుడా పరిస్థితిలేదు. జనాలందరూ హాస్యం కోసం ఎదురు చూస్తున్నారు. జనం ఇప్పుడు కాస్త హాయిగా నవ్వుకోవడానికే ప్రాముఖ్యం ఇస్తున్నారు. చిన్న కామెడీ సీన్ కనపడినా చాలు కళ్ళప్పగించి మరీ చూస్తున్నారు. ప్రేక్షకుల నాడి పట్టేసుకున్న టీవీ చానళ్ళు కూడా వీలైనన్ని కామెడీ షోలు, స్కిట్‌లు ప్రదర్శిస్తున్నాయి. అనుకున్నట్లుగానే అలాంటి షోలకు టీఆర్‌పీ రేట్ కూడా పెరుగుతుండడంతో కామెడీ కోసం ప్రత్యేక చానల్స్ ఏర్పాటుచేసే స్థాయికి బుల్లి తెర ఎదిగిందంటే వీక్షకులు హాస్యం కోసం ఎంతగా ఎదురుచూస్తున్నారో, దానికి ఏ స్థాయిలో డిమాండ్ పెరిగిందో అర్థమవుతుంది.

### స్టాండప్ కామెడీ

స్టాండప్ కామెడీ అంటే ఒక స్టేజీపైన నిలుచుని రకరకాల జోకులు చెప్తూ ప్రేక్షకులను నవ్వించడం. అక్కడ అంతా స్క్రిప్ట్ ప్రకారమే జరుగుతుంది. హావభావాల ద్వారా మాటలద్వారా మాత్రమే జోకు చెప్పాలి. ఎలాంటి యాక్షన్‌కు అవకాశం ఉండదు. సాధారణంగా నవ్వించే ప్రక్రియలతో పోలిస్తే ఈ విధానం ద్వారా కామెడీ పండించడం కాస్త కష్టమైన పనే. ఈ స్టాండప్ కామెడీ పాశ్చాత్య దేశాల్లో బాగా ప్రాచుర్యంలో ఉన్న పద్ధతి. ఇప్పటికీ అమెరికాలాంటి దేశాలలో స్టాండప్ కామెడీ షోలన్నీ హౌస్ ఫుల్ షోలే. పెద్ద పెద్ద కార్పొరేట్ సంస్థల్లో ప్రతి వీకెండ్‌కి ఇలాంటి షోలు జరుగుతుంటాయి. అంతలా అక్కడివారు ఈ స్టాండప్ కామెడీ షోలను ఆదరిస్తారు. కమెడియన్లను గుర్తించి వారికి తగిన ప్రోత్సాహం ఇవ్వడమే ఈ షోల ముఖ్య ఉద్దేశం. స్టాండప్ కామెడీతో జరిగే టీవీ షోలు అత్యంత రేటింగ్ ఉన్న షోలుగా నడుస్తున్నాయి. మనదేశంలో ఇలాంటి షోలకు ఇంతకుముందు తక్కువ డిమాండ్ ఉండేది. కానీ ఇప్పుడిప్పుడే ఈ పరిస్థితి మెరుగుపడిందని చెప్పవచ్చు. మనదేశంలో ఇలాంటి షోను మొట్టమొదట ముంబైలో నిర్వహించారు. అక్కడ ఉన్న థియేటర్ ఆర్ట్స్ ఆడిటోరియంలోనే స్టాండప్ కామెడీషోలు జరిగాయి. తర్వాత వీటి పరిమితి పెరుగుతూ వచ్చింది. ముంబయి కేంద్రంగా స్టాండప్ కామెడీ

# లాఫింగ్ గ్యాస్ నవ్వడానికేనా?

నవ్వు రావడానికి లాఫింగ్ గ్యాస్ కారణం అని సైంటిఫిక్‌గా చెబుతుంటారు. అయితే ఈ లాఫింగ్ గ్యాస్ నిజంగానే నవ్వు రప్పిస్తుందా? అంటే దానికి వైద్యులు చెప్పిన సమాధానం, లాఫింగ్ గ్యాస్‌ను నైట్రస్ ఆక్సైడ్ అనే పేరుతో పిలుస్తారు. ఎప్పుడైనా మీరు పంటి వైద్యుల దగ్గరికి ఏదైనా సర్జరీ కోసం వెళితే దీర్ఘశ్వాస తీసుకుని ఒకటి నుంచి వంద అంకెలు లెక్కపెట్టమని చెబుతుంటారు. దీనివల్ల మీకు తెలియకుండానే మీరు లాఫింగ్‌గ్యాస్‌ను లోపలికి తీసుకుంటారు. కానీ మీ సర్జరీలో ఎక్కడా మీకు నవ్వు రాదు. అదేంటి నవ్వు రప్పించే గ్యాస్ నవ్వు రప్పించకపోవడం ఏంటి అనే అనుమానం వస్తుందా? అది కేవలం నవ్వును మాత్రమే కాదు, పేషెంట్‌ని చికిత్స సమయంలో కాన్షియస్‌గా ఉంచడానికి, నొప్పి తగ్గించడానికి సహాయపడుతుంది. ఇలా లాఫింగ్ గ్యాస్ కేవలం నవ్వడానికే కాదు చికిత్సలో కూడా ఉపయోగపడుతుంది.



చేసే ఎంతోమంది ఆర్టిస్ట్‌లకు దేశవ్యాప్తంగా పాపులారిటీ ఉంది. అలా కేవలం ముంబయి నగరంలోనే కాకుండా ఇప్పుడిప్పుడే ఢిల్లీ, బెంగళూరు, హైదరాబాద్ లాంటి నగరాల్లో కూడా స్టాండప్ కామెడీ నైట్స్‌కి డిమాండ్ పెరుగుతూ వస్తోంది.

### హాస్యం అపహాస్యం!

రేలంగి, జంధ్యాలనాటి కామెడీకి, ఇప్పుడొస్తున్న కామెడీకి చాలా తేడా ఉంది. వారి సినిమాలు ఇప్పుడు చూసినా కూడా కడుపుబ్బా నవ్వుకోగలం. కానీ ఇప్పుడొస్తున్న కొన్ని కొన్ని కామెడీ సినిమాలు, టీవీ షోలలో కామెడీ వికృతరూపం దాలుస్తోందన్నది మాత్రం నిజం. జోకుల్లో చాలా రకాల జోక్స్ ఉంటాయి. రొమాంటిక్, సస్పెన్స్, విషాదం ఉన్నా నవ్వించే జోకులు ఇలాంటివన్నమాట. కానీ కొన్ని జోకులు జుగుప్సాకరంగా ఉంటున్నాయి. వీటిని కూడా జోకులు అంటారా అన్నట్లుగా తయారయ్యాయి. ఒక జోకు విన్నా, లేదా చూసినా, చదివినా మనసులోంచి నవ్వు రావాలి. కానీ ఇప్పుడు అలాంటి కామెడీ దొరకట్లేదు. కామెడీ అందించే కార్యక్రమాల జాబితా పెరిగినాగానీ దురదృష్టవశాత్తు హాస్యం అపహాస్యంగా మారుతోంది. హాస్యం తగ్గడం, ద్వంద్వార్థాలు పెరగడం, వినోదం తగ్గడం వల్ల చాలామంది ప్రేక్షకులు హాస్యాన్ని ఆస్వాదించలేక అసహ్యించుకుంటున్నారు. అలాకాకుండా కడుపుబ్బా నవ్వించే హాస్యానికే ప్రేక్షకులు పెద్దపీట వేస్తున్నారు.

### ఆనందానికీ కొలమానం

గీతలో శ్రీకృష్ణుడు ఇలా చెబుతాడు. "జీవిత యుద్ధం నుంచి, సమస్యల నుంచి పారిపోవడానికి ఎందుకు ప్రయత్నిస్తావు? వాటిని తప్పించుకోలేవు. జీవితం అంటే అదే. వాటిని ఎదుర్కోవడమే సుఖం. వాటిని పరిష్కరించుకోవడమే సంతోషం. ఏమాత్రం సంబంధంలేని వ్యక్తిగా ప్రేక్షకుడిలా వాటిని చూడడంలోనే ఆనందం ఉంది"

హ్యాపీనెస్‌కి కూడా కొలమానం ఉంటుందా? అని ప్రశ్నిస్తే, అవును ఉంటుందనేదే సమాధానం. ఈ కొలమానం ఒక్కోదేశంలో ఒక్కోలా ఉంటుంది. ప్రపంచవ్యాప్తంగా ప్రజలు ఏ యే దేశాల్లో సంతోషంతో వర్ధిల్లుతున్నారో కూడా లెక్కకట్టారు. ఆ జాబితాను 2017 సంవత్సరంలో ఐక్యరాజ్య సమితి ప్రకటించింది. ఆ నివేదిక ప్రకారం నార్వే దేశం ప్రథమ స్థానం సంపాదించుకుంది. ప్రపంచంలోని మిగతా దేశస్థులకంటే ఆ దేశ ప్రజలే ఎక్కువ ఆనందంగా ఉంటున్నారట.

### హ్యాపీనెస్‌లో రకాలు

సుఖం, సంతోషం, ఆనందం ఈ మూడు ఒకటే కదా! ఈ మూడు హ్యాపీనెస్‌కి పర్యాయపదాలేగా అనుకునేరు. కానీ హ్యాపీనెస్ అంటే ఇది కాదు. వీటికి మూడు అర్థాలున్నాయి. అనుకూలత ద్వారా కలిగేది సుఖం, సంఘటనల ఆధారంగా కలిగేది సంతోషం. ఇక ఆనందం అంటే అది హృదయానికి సంబంధించినది. ఈ మూడూ హ్యాపీనెస్‌తోనే ముడిపడి ఉన్నప్పటికీ అసలైన ఆనందమంటే మానసికంగా కలిగే ఆనందమే.



సమస్యలు తక్కువగా ఉన్న దేశాల్లో ప్రజలే సంతోషంగా ఉంటున్నారట. అంతేకానీ ఆర్థికంగా బలంగా ఉండి, ఆయుధబలంతో ధైర్యంగా ఉన్న దేశాలు సంతోషంగా లేవని ఇటీవలే ఐ.రా.స ప్రకటించింది. ప్రభుత్వాలు, ప్రజలు అందరూ తమ పని తాము సక్రమంగా చేసే దేశాల్లోనే సంతోషం వెల్లివిరుస్తోందని ఐక్యరాజ్య సమితి సంతోష సూచీ చెబుతున్నది. ప్రపంచంలో అత్యంత ఆనందంగా ఉన్న నార్వేలో ఇలాంటి పరిస్థితులే ఉన్నాయి. గత ఏడాది సర్వేలో నార్వే నాలుగో స్థానంలో ఉంది. దాని పొరుగు దేశం డెన్మార్క్‌ను దాటేసి హ్యాపీనెస్‌లో ఇప్పుడది అగ్రస్థానంలో నిలిచింది.

ఇక గత ఏడాది ఈ సంతోష జాబితాలో మన దేశం 118వ స్థానంలో ఉంటే, ఈసారి నాలుగు స్థానాలకు వెనకబడిపోయింది. మన పొరుగు దేశాలైన చైనా 79వ స్థానంలో, పాకిస్థాన్ 80, నేపాల్ 99, బంగ్లాదేశ్ 110, శ్రీలంక 120వ స్థానాలలో ఉన్నాయి. అంటే వీటన్నింటికంటే మనం వెనుకంజలోనే ఉన్నాం. ఉగ్రవాద దేశం పాకిస్తాన్, పేద దేశం నేపాల్ కూడా మనకంటే సంతోషంలో ముందువరుసలో ఉన్నాయి. కాబట్టి మనంకూడా ఆనందంగా జీవించడానికి ప్రయత్నం చేద్దాం!

**– సంతోషిలక్ష్మి దహగాం**

### హాయిగా నవ్వుకోండి!

- పక్కింటి రాణి చెప్పింది 'మీరు మన పనిమనిషితో ఏదో సినిమాకి వెళ్ళారట. మీ జేబులో ఇవి దొరికాయి అంటూ రెండు టికెట్స్ చూపిస్తూ అగ్గిమీద గుగ్గిలమైంది భార్య.

ఇక చేసేది లేక 'సారీ, ఇంకెప్పుడూ అలా చేయను. నన్ను నమ్ము' అన్నాడు భర్త.

అదేం కుదరదు. ఈమధ్య మీకు దుబారా బాగా ఎక్కువైంది. "ఆ టికెట్ డబ్బులు దాని జీతం నుంచే కట్ చేస్తానుగానీ, ఈసారి సినిమాకెళ్తే మాత్రం టికెట్లు దాన్నే కొనమనండి" అంది భార్య.

- "ఏవండీ మనింటికి చుట్టాలొచ్చారు. నిమ్మరసం చేద్దామంటే నిమ్మకాయలు లేవు, బజారుకెళ్ళి తీసుకురండీ" చెప్పింది భార్య

బజారుకెందుకే పిచ్చిదానా..విమ్‌బార్ ఉంది కదా దాన్ని కలిపిచ్చేయ్ అందులో వంద నిమ్మకాయలున్నాయి, చెప్పాడు భర్త.

***

- "వెంకయ్యగారు ఈ జబ్బు మీకు వంశపారం పర్యంగా వచ్చింది. ఆపరేషన్ చేస్తే పోతుంది" చెప్పాడు డాక్టర్

"హమ్మయ్య బతికించారు. అయితే ఆ ఆపరేషనేదో మా తాతయ్యకు చేయండి" చెప్పాడు వెంకయ్య..

# ఘటన

**తులసి బాలకృష్ణ**

**రైలు కదులుతూ ఉండగా ఎక్కి, వీడ్కోలు చెప్పడానికి వచ్చిన అందరివైపు చిరునవ్వుతో చూస్తూ చెయ్యి ఊపి, తాపీగా లోపలికి వెళ్ళి సీట్లో కూర్చున్నాడు శర్మ.**

**జేబులోంచి మొబైల్ తీసి, హైదరాబాద్‌లో ఉన్న భార్యకు కనెక్టయి "సభ అయిపోయింది, ట్రైన్ ఎక్కాను, బయలు దేరింది, వచ్చేస్తున్నా" పొడిపొడిగా చెప్పాడు.**

"ఓ కాయో పండో ఇచ్చి, ఓ శాలువాగుడ్డకప్పి పంపేశారా లేక ఏవన్నా సంభావన ముట్టజెప్పి చచ్చారా?" పాతికేళ్ళక్రితం తాళికట్టిన అతడి ధర్మపత్ని గొంతు ఖంగుమంది. 'ఎదుటివాళ్ళు చూపించే ఆత్మీయ అనురాగ గౌరవ ప్రపత్తుల ముందు, లోటు లేకుండా రోజు గడిచిపోయే తనలాంటి వాళ్ళకు ఆ ముట్టచెప్పే డబ్బు ఏపాటిది' అనిపించింది శర్మకి. అయినా ఆమె స్వభావం తెలిసినవాడు కనుక తేలిగ్గా నవ్వేసి "ఇచ్చార్లే" అని, మాట మార్చేందుకు "తెల్లారాక ఆరు, ఆరున్నరకి హైదరాబాద్ వచ్చేస్తుంది ట్రైను" అన్నాడు.

"లేదండీ, ఆ ట్రైను ఎప్పుడూ లేటే. ఎనిమిదిన్నర తొమ్మిదిలోపు వెళితే గొప్పే" తియ్యని వీణానాదం లాంటి స్వరం వినిపించడంతో చటుక్కున తలెత్తి చూశాడు.

ఎదురుగా ఉన్న సీట్లో, తన కవిత్వంలోని ఊహా సుందరిని మించిన ముగ్ధమోహనరూపం! కమ్మెచ్చు తీసినట్టున్న చక్కటి శరీరశిల్పం, జిగిబిగి కలిగిన సువర్ణ శరీరఛాయతో పాతిక కంటే ఒకటీరెండేళ్ళు తక్కువ వయసున్న సుందరి. సంప్రదాయ వస్త్రధారణ, ముఖంలో నిర్మలత్వం, చూపులో సంస్కారం...రెప్ప వాల్చడానికి కష్టపడ్డాడు శర్మ. అవతల లైన్లో ఉన్న భార్యతో, "సరే, మళ్ళీ ఫోన్ చేస్తాలే, రైలు శబ్దాల్లో వినిపించడం లేదు" అని, ఫోన్ కట్‌చేశాడు. గొంతు సవరించుకుని "హైదరాబాద్ చేరేసరికి అంతలేటవుతుందా?" అన్నాడు ఆ సుందరితో.

"ఔనండీ, ఈమధ్య మూడు నాలుగుసార్లు ఇదే ట్రైన్లో హైదరాబాద్ వెళ్ళాను. ఎప్పుడూ లేటే. ఓసారి మరీ పదిన్నరకెళ్ళింది" తనకు తెలిసిన విషయం చెప్పడానికి ఎంతో ఉత్సాహం, తనపట్ల ఎంతో శ్రద్ధ చూపిస్తున్న ధోరణి ఆమె మాటల్లో కనిపించింది శర్మకి. ఇంకా ప్రశ్నించి ఆమెచేత ఏదైనా మాట్లాడించాలని లోలోపల కుతూహలం చెలరేగింది. ఏమడగాలో గబుక్కున తోచలేదు. దాంతో మౌనంగా చూపుమరల్చి బ్యాగ్‌లోంచి ఈరోజు జరిగిన సభ తాలూకు సమాజంవారు విడుదల చేసిన సావనీర్ పేజీలు యాంత్రికంగా తిరగెయ్యసాగాడు.

"మీరు ఈ ట్రైన్‌లో ఫస్ట్ టైం జర్నీ చేస్తున్నారాండీ?"

ఆమె ప్రశ్నకు చటుక్కున తలెత్తాడు శర్మ. అంటే తనతో మాట్లాడడానికి ఆమె బాగా కుతూహలం చూపిస్తోందన్నమాట, అయితే తనూ మొహమాట పడకుండా మాట్లాడొచ్చు అనుకుని, తల నిలువునా ఆడిస్తూ "అవును" అన్నాడు. ఆమెని "అండీ" అనాలా, "అమ్మా" అనాలా? చిన్న సందేహం పొటమరించింది. తన వయసులో సగం ఉంటుందామెకు. యాభైకి అతి దగ్గరలో ఉన్నాడు తను. "అండీ" అనాల్సిన వయసు కాదనిపిస్తోంది, "అమ్మా" అని పిలిస్తే, బాగా పెద్ద వయస్కుణ్ణనుకుంటుంది. ఇక మాటలు పొడిగించడానికి ఆమె ఉత్సాహం చూపించకపోవచ్చునంటోంది శర్మ మనసు.

"మీరు ఈ ఊరువారా? లేక హైదరాబాద్ నుంచి ఏపని మీదన్నా వచ్చి వెనక్కు వెళుతున్నారా?"

ఆమె సంభాషణ పొడిగించేసరికి శర్మ ఛాతీ పొంగింది. తనతో మాటలు పొడిగించడానికి ఆమె ఎందుకు ఉత్సాహం చూపిస్తున్నట్లు?! యాభైకి దగ్గర పడుతున్నా తనలో తగ్గని అందమే కారణమా? మొన్నీమధ్య కవులు కొందరు 'భువన విజయం' పెట్టి తనచేత శ్రీకృష్ణ దేవరాయలు వేషం వేయించారు. "ఈ వేషం మీకు అద్భుతంగా నప్పింది శర్మగారూ" అని ఎంతో పొగిడారు కూడా. ఆమెకు తనను పరిచయం చేసుకునే అవకాశం పోగొట్టుకోదలుచుకోలేదు శర్మ.

"నేను హైదరాబాద్‌లోనే ఉంటాను. రాజమండ్రిలోని ఓ ప్రముఖ సాహితీసభ నా కవితా



పఠనం ఏర్పాటుచేసి, సన్మానిస్తామని బలవంత పెడితే వచ్చాను, ఇప్పుడు తిరుగు ప్రయాణంలో ఉన్నానన్నమాట" అంటూ..ఆమె కళ్ళల్లో తనపట్ల ఎదుగుతున్న ఆరాధనా భావాన్ని గమనించసాగాడు.

"అయితే మీరు పెద్ద కవులన్న మాట!" ఆమె కళ్ళు మెరిశాయి.

మొహమాటం కనబరుస్తూ సన్నగా నవ్వాడు శర్మ.

రైలు గోదావరి బ్రిడ్జి దాటుతుండగా సైడ్‌మిర్రర్‌కి ముఖాన్ని అదిమిపెట్టి కళ్ళు పొడుచుకుంటూ బయటకు చూస్తున్న శర్మతో 'గోదావరిని చూద్దామనాండీ?' అడిగిందామె. "అవును" అన్నట్టు తలూపాడు చూపు మరల్చకుండా.

"నాకూ గోదావరంటే చాలా ఇష్టం. మీలాంటి కవులకి ఇక చెప్పనక్కర్లేదనుకుంటాను. కవిత్వంలో గోదావరిని అద్భుతంగా వర్ణిస్తారుగా!"

అందుకు ప్రతిస్పందనగా నవ్వాడు శర్మ.

"ఈ ఏసీ కంపార్ట్‌మెంట్‌లతో ఇదే ప్రాబ్లమండీ. రాత్రి అయితే బయటవేవీ కనబడవు." అని ఓక్షణం ఆగి మళ్ళీ అంది, "అఫ్కోర్స్, 'రవిగాంచనిచో కవి గాంచును కదా' అన్నారు గదండీ. చూపులకు అందకుండా దాక్కున్న అందమైన వాటినన్నింటినీ మీ మనోనేత్రంతో చూసేసి వర్ణించేయగలరు." చటుక్కున తలతిప్పి ఆమె ముఖంలోకి చూశాడు శర్మ. మాటల్లో ఏదో ద్వంద్వార్థం స్ఫురింపజెయ్యాలన్న ఉద్దేశమేదీ ఆమెకి ఉన్నట్లుగా లేదు. ఆమె ముఖంలో భావాలు, ప్రయాణంతోబాటు ఆమెతో మాట్లాడాలనే కోరిక అధికమవసాగింది శర్మలో. కానీ అంతటి కవికీ మాటలు ఎలా పొడిగించాలో తోచడం లేదు. ఆమె మాత్రం చక్కగా ఏదో మిషతో పలకరిస్తూనే ఉంది.

ఏదో స్టేషన్‌లో ఆగింది రైలు. ఇద్దరు మగవాళ్లు ఎక్కారు. ఒకతను వస్తూనే శర్మ సైడున్న అప్పర్ బెర్త్‌తో తన టికెట్ సరిచూసుకుని పైకిఎక్కేసి పడుకున్నాడు. రెండో అతను పక్కనే కూర్చుంటూ, శర్మతో "నాది ఈ మిడిల్ బెర్త్. పడుకోవడానికి మీకు ఇంకా టైముందాండీ?" అనడిగాడు. 'ఆ..ఇంకా కొంత టైముంది' అన్నాడు ముక్తసరిగా. ఆవ్యక్తి ఇబ్బందిగా మొహంపెట్టి, ఓసారి వాచీ చూసుకుని ఆపుకోలేక గట్టిగా ఆవులించి, వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాడు. "ఆయన నిద్రకి ఆగలేకపోతున్నాడేమో, పోనీ పడుకోన్వ్వండి" అంది యువతి. ఖంగుతిని ఆమెవైపు చూశాడు శర్మ. "మిడిల్ బెర్త్ ఎత్తేసి అతన్ని పడుకోనిస్తే, తనూ కంపల్సరీగా తన లోయర్ బెర్త్ మీద వాలాలి. ఆమెతో మాటలు పొడిగించడానికి వీలుండదు. సడన్‌గా ఇలా అందేమిటి?!" శర్మలో కొద్దిగా నీరసం ఆవహించింది.

"మీరిటు వచ్చి కూచోండి" అంది ఉన్నట్టుండి తన పక్కసీటు చూపిస్తూ. ఒక్కసారిగా శర్మ ఒళ్లు ఝల్లుమంది. వెంటనే పక్కన జోగుతున్న అతన్ని తట్టి, "లేవండి పడుకుందురుగానీ, బెర్త్ ఎత్తేద్దాం" అన్నాడు. లేచాడతను. ఇద్దరూ కలిసి మిడిల్ బెర్త్ ఎత్తేశాక, పుట్టినప్పటి నుంచీ నిద్రకు దూరమైనవాడిలా అమాంతం ఎగిరి దానిమీద వాలిపోయాడా వ్యక్తి. పంటి బిగువున నవ్వాపుకుంటూ చూసింది యువతి. ఆమె పక్కసీట్లో కూర్చున్నాడు శర్మ నవ్వుతూ.

మళ్లీ ఏదో స్టేషన్‌లో ఆగింది రైలు. ఓ జంట బెర్త్ నెంబర్లు వెతుక్కుంటూ వచ్చింది. యువతి పక్కనున్న మిడిల్, అప్పర్ బెర్త్ నంబర్లు చూసుకుని, ఆ సీటుకింద సామాను సర్దుకుని, కూర్చునే ఉద్దేశంతో శర్మ ముఖంలోకి చూశారు ఆ భార్యాభర్తలు. ఇబ్బందిపడ్డాడు శర్మ. ఇక తన సీట్లోకి పోవాల్సి వస్తుందేమోనని. ఇంతలో యువతి కిటికీవైపు మరింతగా జరిగి, శర్మ ముఖంలోకి చూసింది, వెంటనే శర్మ ఆమెవైపు జరిగాడు. ఆ జంటకి సరిపోయేంత జాగా కల్పించడానికి మరింత జరగాల్సి వచ్చింది. ఇప్పుడు ఆ యువతికి తగిలీ తగలనంత దూరంలో ఉన్నాడతను.

యువతి బ్యాగ్‌లోంచి టిఫిన్ బాక్స్ తీసింది. రెండుగిన్నెలున్న ఆ హాట్‌ప్యాక్ బాక్స్ మూత తెరవగానే నేతి ఉప్మా వాసన గుప్పుమంది. నోట్లో లాలాజలం ఊరిన శర్మకి గుటకపడడం కష్టమైంది. మర్యాద కోసం తల తిప్పుకున్నాడుగానీ, విప్పార్చుకున్న ముక్కుపుటాలు తమ ధర్మం తాము నెరవేరుస్తూ గుండెల్ని గుమ్మనిపిస్తున్నాయి.

"మీ..డిన్నరూ..?" అడిగింది ఆమె.

"అయిపోయింది.. రైలెక్కేముందే."

తిన్నది నిజమే అయినా ఈ సువాసన మళ్ళీ జఠరాగ్నిని రెచ్చగొడుతోంది.

**చూపుమరల్చలేని గొప్ప అందగత్తె ఆమె. సన్మానాలు పొందే గొప్ప కవి అతను. ఏసీ బోగీలో, ఎదురెదురు బెర్తుల్లో వారి ప్రయాణం. అతడితో మాట కలిపేందుకు తహతహలాడిందామె. ముగ్ధుడయ్యాడతను. చిరునవ్వులూ, ఉప్మా షేరింగులూ, భుజాలు, చేతివేళ్ళ టచ్చింగులూ, పక్కనే ఆనుకుని కూర్చునే అదృష్టం...ఓహ్! ఆమెవైపు నుంచి అన్నీ డబలోకే. ఇక టాప్ గేర్ పడటమే ఆలస్యం! వాళ్ళిద్దరి ప్రయాణం కలిసి ముందుకు సాగిందా?**

గ్రహించినట్లు చూస్తూ, "తినండి" అందామె ఓ గిన్నె చెంచా అందిస్తూ.

"నిజం నేను తిన్నాను, ఒట్టు."

"అయినా తినొచ్చు, తప్పులేదు ఉప్మా ఇట్టే అరిగిపోతుంది." అంటూ స్వతంత్రంగా చెయ్యిలాగి గిన్నె చేతిలో పెట్టేసింది. బిత్తరపోయాడు శర్మ. అంతలోనే ఎగిసి వచ్చిన ఆనందం వ్యక్తం చెయ్యకుండా దాచేసుకున్నాడు. తొందరపడ్డానన్న కంగారేమీ ఆమెలో లేదు.

మొహమాట పడుతూనే మొత్తం తినేశాడు. గిన్నె కడిగి ఇవ్వడానికి లేవబోయాడు. "ఏం కడగక్కర్లేదు, ఇటివ్వండి" అంటూ శర్మ చేతుల్లోంచి చనువుగా గిన్నె లాక్కుని లేచి బయటకు నడిచింది. చెయ్యి కడుక్కోవడానికి ఆమెను అనుసరించాడు శర్మ. వాష్ బేసిన్‌లో కుళాయి హ్యాండిల్ తిప్పిపట్టుకుని "చెయ్యి వాష్ చేసుకోండి" అందామె. "థాంక్యూ" అని, హ్యాండ్ వాష్ చేసుకుని తిరిగి సీట్ దగ్గరకు వచ్చాడు శర్మ.

గిన్నెలు వాష్ చేసుకొచ్చిన ఆమెని, ఆ భార్యాభర్తల జంటలోని మగాయన "నిద్ర వస్తోంది, ఈ బెర్త్‌లు ఎత్తేద్దామా అమ్మా?" అనడిగాడు. 'అలాగేనండీ' అంటూ తలూపింది ఆమె. తప్పనిసరై శర్మ లేచి నిలబడ్డాడు. టాప్ బెర్త్ మీదున్న బెడ్‌రోల్స్ అందుకుని యువతికి ఇస్తుండగా ఆమె చేతివేళ్ళు తగిలాయి.

పక్క పరుచుకుంటున్న శర్మను చూసి, "అదేమిటీ పక్క అలా వేసుకుంటున్నారు" అంటూ నవ్వి, 'మీరు పక్కకి జరగండి' అంటూ వచ్చి ఆమె పక్క సర్దుతూంటే రైలు కుదుపుకి ఇద్దరి జబ్బలూ గుద్దుకున్నాయి. ఆమె చూపిస్తున్న చొరవకి శర్మ గుండెల్లో జిల్లుమందికానీ ఆమెలో ప్రత్యేక భావాలేవీ ప్రదర్శితం కావడం లేదు. పక్కమీద వాలాడు శర్మ. ఆమె పరిచిన పక్క చాలా సౌకర్యంగా ఉంది. ఆమె



కూడా తన పక్క పరుచుకుని, దానిమీద వాలుతూ, "గుడ్‌నైట్ అండీ" అంది. "గుడ్‌నైట్" అన్నాడు శర్మ నీరసంగా.

లైట్లు ఆరాయి. ఏవేవో ఆలోచనలు, గుండెల్లో పులకరింత, అలవోకగా లోలోన జాలువారుతున్న భావ కవితా ధారలతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న శర్మకి చాలాసేపటివరకు నిద్ర పట్టలేదు.

***

తెల్లవారుతుండగా మెలకువ వచ్చింది శర్మకి. చటుక్కున ఎదుటిబెర్త్‌వైపు చూశాడు. తెల్లటి దుప్పటి పాదాల నుంచి తలదాకా కప్పుకుని బోర్లా పడుకుని ఉందామె. మంచుతో కప్పబడ్డ హిమాలయాలు స్ఫురణకి వచ్చాయి శర్మకి. ఒక్క క్షణం ఆ నిమ్నోన్నత తాల మీదుగా అరచేతిని రాస్తూ, పోనివ్వాలనే చిలిపి కోరిక కలిగింది ఆయనలో. గుంభనంగా నవ్వుకున్నాడు.

ఆమె సైడు పై బెర్త్‌లు రెండూ ఖాళీ అయిపోయాయి. బహుశా ఆ భార్యాభర్తలు వరంగల్‌లో




దిగిపోయినట్టున్నారు.

బ్రష్ చేసుకోవడానికి లేచాడు శర్మ. ఆయన తిరిగొచ్చేసరికి ఆ యువతి మిడిల్ బెర్త్ ఎత్తేసి, చెదిరిన దట్టమైన తన సిగపాయల్ని రెండు చేతుల్తో పట్టుకుని ముడివేసుకుంటూ తాజా చిరునవ్వుతో "గుడ్ మాణింగ్" అంది. 'గుడ్ మాణింగ్' అంటూ వంగి తన బెర్త్‌మీద కూర్చోవడానికి ఇబ్బంది పడుతుంటే, "మీకోసమే ఈ బెర్త్ ఎత్తేశాను. ఇటు కూర్చోండి" అంది. ఆమె బెర్త్‌వైపు చూశాడు శర్మ. ఆమె పక్కన పరిచి ఉన్న ఆమె పక్క మీద! ఓ క్షణం తటపటాయించి, తెగించి లేచి కూర్చున్నాడు. "ఇప్పుడే వస్తాను" అని ఆమె బ్రష్ చేసుకోవడానికి వెళ్ళింది.

కిటికీ అద్దంలోంచి స్టేషను, 'బీబీ నగర్' అన్న బోర్డూ కనిపిస్తున్నాయి. 'కొంపదీసి ఈ రైలు ఇవాళ రైట్ టైమ్‌కి వెళ్ళిపోతుందేమో' అనిపించింది. శర్మ గుండెల్లో ఏదో తెలియని దిగులు! ఆ అమ్మాయితో మాట్లాడాల్సినవేవో చాలా చాలా మిగిలిపోయాయి అన్నట్లుగా అర్థంకాని వేదనగా ఉంది లోలోన. ఆమె వచ్చేలోగా ఆమె కూర్చునే సీటువైపు మరికొంత జరిగాడు.

ఆమె వచ్చింది. నీళ్ళతో కడిగిన ఆమె ముఖం చిన్న చిన్న నీటి బిందువులతో మంచులో తడిసిన బ్రహ్మ కమలంలా ఉంది. శర్మ పక్కనే కూర్చుని నేప్కిన్ చేతుల్లోకి తీసుకుని ముఖం తుడుచుకోబోతుంటే, చటుక్కున "తుడుచుకోకపోతే ఇంకా బాగుంటుంది" అన్నాడు శర్మ అప్రయత్నంగా. ప్రశ్నార్థకంగా చూసింది శర్మ ముఖంలోకి. సిగ్గుపడ్డ శర్మ తమాయించుకుని, "అంటే వేసవి కాలం కదా, కంపార్ట్మెంట్‌లో ఏసీ కూడా బాగా తక్కువగా ఉంది. చల్లగా బాగుంటుంది" అన్నాడు చిన్న గొంతుతో. సన్నగా నవ్వి, నేప్కిన్ పక్కన పడేసింది ఆమె. శర్మకి చాలా ఆనందం అనిపించింది ఆమె తన మాటలకు విలువిచ్చినందుకు.

"ఎక్కడిదాకా వచ్చినట్లు మనం.." దీర్ఘం తీస్తూ కిటికీ అద్దంలోంచి ఆమె బయటకు చూస్తుంటే, "బీబీనగర్ దాటేశాం" అన్నాడు శర్మ నీరసంగా. "అలాగా" అందామె సాలోచనగా. అప్పుడే ప్రయాణం ముగిసిపోతోందే అన్న భావన తనలోనే ఉందా లేక ఆమెలోనూ ఉందా? మీమాంసలోపడి శర్మ మథన పడుతుండగా, "మనం ఒక్కరిమే జర్నీ చేస్తూ బోరు కొట్టి చస్తున్నప్పుడు ఈ రైలు లేటుగా వెళుతుంది. అదే చక్కగా హాయిగా మంచి కంపెనీ ఉన్నప్పుడు సమయానికి చేరిపోయి చస్తుంది." అంది బయటకు చూస్తూనే. శర్మకు ఆపాద మస్తకం పులకించింది.

రైలు వేగంగా వెళుతోంది. 'ఇక తొందరపడాలి. ఈ సుందరి పేరు తెలుసుకోవాలి. ఫోన్ నంబర్ తీసుకోవాలి. మళ్లీ ఎప్పుడు కలవగలం అని అడగాలి. ఇంక కొద్ది నిముషాల్లో ఈ ప్రయాణం ముగిసిపోతుంది. మరి ఆ తర్వాత?! ఎవరిదారి వారిదేనా? మళ్లీ కలుసుకునే అవకాశం ఉందా? తను ఇంకొంచెం చొరవ చూపించాలని ఆమె ఆశిస్తోందేమో?! తనే మొహమాట పడుతున్నాడేమో?!' కానీ ఏదో బిడియం, ఏదో మొహమాటం..ఏదో చిరు భయం.

మొట్టమొదటిసారిగా ఆమె పాదాలవైపు మళ్ళాయి శర్మ చూపులు. ఆమె వేళ్ళకు మెట్టెలున్నాయి. తన భార్య గయ్యాళితనం కారణంగా తను స్త్రీ పురుషుల బంధంలోని ఆనందాన్ని పూర్తిగా ఆస్వాదించే అదృష్టం కోల్పోయినట్టే ఆమె కూడా ఆమె భర్త అరసికత్వం కారణంగా తన అందానికి తగ్గ ఆనందం పొందలేకపోతోందేమో, అందుకే తనవైపు ఆకర్షితురాలై...

సడన్‌గా ఆమె తల తిప్పింది. శర్మవైపు చూసింది. ఆమె కళ్లలో సన్నటి కన్నీటి పొర! శర్మ ఆశ్చర్యానికి గురవుతూండగానే "సాధారణంగా మౌలాలి స్టేషన్‌లో ఆపేసి పడేస్తాడు. ఇప్పుడు ఆపలేదు" అంది చిరు బాధ ధ్వనించే జీరస్వరంతో. శర్మ తత్తరపడి సర్దుకుంటూండగానే ఆమె చెయ్యి ముందుకు చాపింది షేక్ హ్యాండ్‌కి. ఆనందంతో కూడిన అలజడికి గురయ్యాడు శర్మ. ఆమె చేయి అందుకుని షేక్ చేశాడు. ఇక ఆమె వివరాలు, మళ్లీ కలయిక, భవిష్యత్తులో బంధాన్ని ఏవిధంగా కొనసాగించడం అనే విషయాలు అడిగేయడానికి త్వరపడాలి అనుకుంటూండగానే, "జీవితంలో కొన్ని వింత సంఘటనలు జరుగుతూంటాయి కదండీ! నా బాల్య స్నేహితుడొకతను అచ్చు మీ పోలికలతోనే ఉంటాడు. ఒక్కటే తేడా. అతనికి కొద్దిగా ఏజ్డ్ మేకప్ చేస్తే డిటో మీరే. మా చదువులయ్యేవరకు మేం కలవని రోజులేదు. గంటలు గంటలు ఏవేవో మాట్లాడుకునే వాళ్ళం. జోకులేసుకునేవాళ్ళం, దెబ్బలాడుకునేవాళ్ళం కూడా. కాని ఇద్దరం కలవని రోజున నరకం అనుభవించే వాళ్ళం. అయితే వింత ఏంటంటే మేం ఒకరికొకరం ప్రాణ స్నేహితులుగానే భావించాంగానీ, ప్రేమ గీమ లాంటి భావాలు గానీ, జీవిత భాగస్వాములం కావాలనిగానీ కోరుకోలేదు. ఇద్దర్లోనూ ఏ ఇతర వికారాలూ వింత కోరికలూ ఉండేవి కావు. అతనిప్పుడు మిలటరీలో ఉన్నాడు. అతన్ని చూసి రెండేళ్ళు గడిచింది. మీతో జర్నీ చేస్తుంటే మళ్లీ ఆరోజుల్లోకి వెళ్ళిపోయాను" అంది. తనను తాను నిభాయించుకుని, చిరునవ్వుతో కూడిన కృతజ్ఞతతో "థాంక్యూ అంకుల్, నా బాల్యస్నేహితుణ్ణి గుర్తుకు తెచ్చారు" అంది.

స్తంభీభూతుడై చూస్తున్నాడు శర్మ.

తిరిగి తేరుకునేలోగా ఆమె సెల్‌ఫోన్ మోగింది. "హలో హనీ, మీరు స్టేషన్‌కి వచ్చేశారా; నైట్ డ్యూటీ చేసి ఉంటారు కదా, పాపం పడుకుని ఉంటారు, శ్రమపెట్టడం ఎందుకూ క్యాబ్ తెప్పించుకుని నేనే వచ్చేద్దాం అనుకుంటున్నానన్నమాట. ఎందుకు శ్రమ తీసుకున్నారూ?" అంటూ బయటకు చూసి సరే సిక్స్ నెంబర్ ప్లాట్‌ఫాంకి ఇచ్చాడు రండి' అంటున్న ఆమె కళ్ళల్లో వింత వెలుగు. ఫోన్ కట్ చేసి, శర్మతో "మావారు స్టేషన్‌కి వచ్చారు" అంది ఎరుపెక్కుతున్న చెంపలతో, ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతున్న గొంతుతో.

శర్మకి ఒక్కసారిగా ఒళ్ళు తెలిసింది. చూపు కిందకు వాలిపోయింది.

చటుక్కున ఆమె తలపైన చేయుంచి, "దీర్ఘాయుష్మాన్‌భవ, దీర్ఘసుమంగళీ భవ" అంటూ వాత్సల్యం నిండిన తడి గొంతుతో ఆశీర్వదించి వెంటనే లగేజ్ తీసుకుని ప్లాట్‌ఫాం మీదకు దిగి గబగబా నాలుగు అడుగులు వేశాడు. ఆమె తన వెనకనే దిగడానికి గుమ్మం దగ్గరకు వచ్చిందేమో చివరిగా ఒక్కసారిగా ఆమెవైపు చూడాలనిపించి కూడా మళ్లీ ఎందుకో ఆ ప్రయత్నం విరమించి వడివడిగా ముందుకే సాగిపోయాడు.

*సెల్: 87901 15544*

## సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

## హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

**ఏ** పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

## ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.

ADVT






## బర్గర్లు, పిజ్జాలతో మతిమరపు?

ప్రస్తుతం చాలా మంది తీసుకుంటున్న బర్గర్, పిజ్జా, ఎరుపు మాంసం కారణంగా మతిమరపు వచ్చే అవకాశం ఉందని అమెరికా పరిశోధకులు చెబుతున్నారు. కొన్ని ఎలుకల మీద వీరు ఆరు నెలల పాటు పరిశోధన నిర్వహించారు. వీటికి ప్రతి రోజూ బర్గర్లు, పిజ్జాలతో పాటు ఎర్రమాంసంతో తయారు చేసిన ఆహారాన్ని ఇచ్చారు. ఆరు నెలల తరువాత వీటిని పరిశీలించగా, వీటి బరువులో అనూహ్యమైన మార్పులు రావడంతో పాటు వాటి కదలికలలో, రుచి వాసన కనిపెట్టడం లాంటి విషయాలలో మార్పు గమనించారు. అధిక కేలరీలు కలిగిన ఆహారాన్ని తీసుకోవడం వలన ఎలుకల్లో చురుకుదనం నశించిందని వారు చెబుతున్నారు. ప్రస్తుతం చాలా మంది బర్గర్లు, పిజ్జాలు తినడానికే ఇష్టపడుతున్నారనీ, వీటిని తీసుకోవడం వలన ఇప్పటికిప్పుడు వచ్చే ప్రమాదం అధికబరువు ఒక్కటేననీ, అయితే దీర్ఘకాలంలో వీరిలో జ్ఞాపకశక్తి నశించే అవకాశాలు ఎక్కువని వారు అంటున్నారు. ఈ విషయం మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని వారు చెబుతున్నారు.

## కొద్దిగా కష్టపడితే ఒత్తిడి మాయం!



క్రమం తప్పని వ్యాయామంతో ఒత్తిడి, ఆందోళన తగ్గించుకోవచ్చన్న సంగతి తెలిసిందే! అయితే ప్రతిరోజూ గంటల తరబడి కాకుండా కొంత సమయం వ్యాయామం చేసినా ఒత్తిడిని అధిగమించి జ్ఞాపకశక్తి పెంచుకోవచ్చు అంటున్నారు న్యూయార్క్ పరిశోధకులు. వయస్సులో పెద్ద వారైన కొంత మంది మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిలో కొందరిని ప్రతిరోజూ నడక లేదా పరుగు తీయమన్నారు. మరికొందరిని వారంలో మూడు లేదా నాలుగు రోజుల పాటు ఎక్కువసేపు నడక లేదా పరుగు తీయమన్నారు. అనంతరం వీరి మెదడు తీరును పరిశీలించారు. ఎక్కువ సేపు వ్యాయామం చేసిన వారిలోనూ, కొద్దిసేపు వ్యాయామం చేసిన వారిలోనూ ఒత్తిడి తగ్గిన విషయాన్ని గమనించారు. అంతే కాకుండా వీరిలో జ్ఞాపకశక్తి మెరుగుపడడాన్ని గుర్తించారు. పెద్ద వయస్సులో ఉన్నవారు రోజులో కొద్దిసేపు తమకిష్టమైన నడక, లేదా పరుగు లాంటి వ్యాయామం చేసినట్టయితే ఆ వయస్సులో తలెత్తే ఒత్తిడి, మతిమరుపు వంటి సమస్యలకు దూరంగా ఉండవచ్చని అధ్యయనవేత్తలు చెబుతున్నారు.

## నిద్రపోతే విజయం సొంతం



నిద్రకీ, విజయానికీ లింకు ఉందంటున్నారు పరిశోధకులు. కంటినిండా నిద్రపోయే వారు ప్రతి పనిలోనూ విజయం సాధిస్తారు అని బ్రిగ్హం (Brigham) యూనివర్సిటీ పరిశోధకులు స్పష్టం చేస్తున్నారు. కొంతమంది విద్యార్థుల నిద్రపోయే వేళల మీద సుమారు నెల రోజులపాటు అధ్యయనం నిర్వహించారు. రాత్రి సమయంలో త్వరగా పడుకొని, ఉదయం త్వరగా నిద్ర లేచే విద్యార్థులు అన్ని విషయాలలోనూ చురుకుగా వ్యవహరించడాన్ని వీరు గుర్తించారు. వీరు చదువు విషయంలో ముందంజలో ఉన్నారని అధ్యయనవేత్తలు చెబుతున్నారు. నిద్రపోయే సమయాల్ని పాటించని వారు చాలా విషయాలలో వెనుకబడి ఉండడాన్ని గుర్తించారు. నిద్రలేమితో బాధపడేవారిలో హార్మోన్ల అసమానతలు తలెత్తుతాయనీ, పలు విషయాలలో వారు వెనుకబడి ఉండడానికి హార్మోన్ల అసమానత కారణం కావచ్చని అంటున్నారు. ఆరుబయట ఎక్కువగా తిరగకపోవడం, చీకటిలోనూ, కంప్యూటర్ల ముందూ కూర్చుని గంటల తరబడి పనిచేసే వారిలో నిద్రలేమి ఎక్కువ అవుతుందనీ, ఇదే వారి విజయావకాశాలను దెబ్బతీస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు.

## ఆత్మహత్య ఆలోచనలు అందుకేనట?

నిద్ర తక్కువైతే ఆత్మహత్య ఆలోచనలు వచ్చే ప్రమాదం ఉందంటున్నారు మిచిగాన్ (Michigan) యూనివర్సిటీ పరిశోధకులు. మామూలు వ్యాధుల కన్నా కూడా మెదడు సంబంధ వ్యాధులతో బాధపడేవారిలో ఆత్యహత్యా ఆలోచనలు తొమ్మిది రెట్లు ఎక్కువగా ఉంటాయన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. దాదాపు మూడు లక్షల మంది మీద పదమూడు సంవత్సరాల పాటు సుదీర్ఘ అధ్యయనం నిర్వహించారు. ఈ కాలంలో సుమారు మూడు వేల మంది ఆత్మహత్య చేసుకుని చనిపోయారు. వీరిలో 19 శాతం మంది మాత్రమే అనారోగ్య కారణాల వలన ఆత్మహత్య చేసుకోగా 20 శాతం మంది మానసిక రుగ్మతల కారణంగా ఆత్మహత్య చేసుకున్నారు. మిగతా వారిలో పదిశాతం మంది నిద్రలేమితో ఆత్మహత్యలకు పాల్పడగా, మరికొందరు ఆత్మహత్యాయత్నానికి పాల్పడ్డారు. నిద్రలేమి కారణంగా ఒత్తిడి, ఆందోళన ఎక్కువై ఆత్మహత్య ఆలోచనలు కలిగి ఉండవచ్చని అధ్యయనవేత్తలు అభిప్రాయ పడుతున్నారు.



—అవినాష్

# మూలాల్నించి తీసేయనిదే సొరియాసిస్ నుంచి ముక్తి లేదు

సొరియాసిస్ ఇలా ఒళ్లంతా పాకేదాకా ఏ ట్రీట్‌మెంట్ తీసుకోకుండా ఎలా ఉన్నారండీ! అంటే ట్రీట్‌మెంట్ తీసుకోకుండా ఎలా ఉంటాం సార్! ఇదేమైనా నిద్రపోనిస్తుందా? నీళ్లు తాగనిస్తుందా? దురదా మంటలతో పగలూ రేయీ నరకాన్ని చూడటమే కదా! కాకపోతే వాళ్లిచ్చిన మందులన్నీ పై పూతలకు పరిమితమైనవే. మాత్రలేవో ఇచ్చినా అవి స్టెరాయిడ్స్ కలిపినవని తెలిసి వాటిని పక్కకు పెట్టేశాను. నా బాధ నాకుంటే చుట్టుపక్కల వాళ్లంతానేమో పురుగును చూసినట్టు చూస్తారాయే. ఈ జబ్బును మేమేతో ఆహ్వానించినట్టు? వాళ్లు అలా చూడటమేనా? ఈ వ్యాధికి అసలు మందే లేదు. జీవితమంతా మీరిలా బాధపడాల్సిందే! అంటూ ఇలా శాపనార్థాలు పెట్టిపోతుంటారు కదా! ఇన్నాళ్లకు మీ గురించి ఏదో తెలుసుకుని ఇలా వచ్చాం." అంటూ తమ వ్యథను వెళ్లకక్కుతుంటారు.

వాస్తవానికి సొరియాసిస్ శరీరం లోలోతుల్లోకి విస్తరించే వ్యాధి. ఈ క్రమంలో శరీరంలోని సప్తధాతువులూ ఒక్కొక్కటిగా క్షీణిస్తూ వెళతాయి. ధాతువులు క్షీణిస్తూపోయే కొద్దీ శరీరంలో వాత ప్రకోపం పెరుగుతుంది. ఇది నరాల వ్యవస్థను దారుణంగా దెబ్బ తీస్తుంది. గుండెపోటు, పక్షవాతం వంటి సమస్యలకు మూలం కావడమే కాదు దేహక్రియలన్నీ కుంటుపడేలా చేస్తుంది. సొరియాసిస్‌తో ఎముకలకు సంబంధించిన అస్థిధాతువు కూడా క్షీణించడంతో వెన్నెముక సమస్యలు, కీళ్ల సమస్యలు మొదలవుతాయి. బాహ్యంగా చేసే పంచకర్మ చికిత్సలతో పాటు అంతర చికిత్సలు కూడా ఇక్కడ ఎంతో కీలకం. అందుకే సొరియాసిస్ నుంచి శాశ్వతంగా విముక్తి పొందాలంటే, పంచకర్మ చికిత్సలూ, ఔషధ చికిత్సలూ సమాంతరంగా సాగాలి.

**మూలాల్లోకి చొచ్చుకుపోతుంది**

చర్మం మీదే కనిపించే సొరియాసిస్‌కు ధాతువులను దెబ్బ తీసేంత శక్తి ఉంటుందా అని కూడా కొందరు అనుకుంటారు. నిజానికి సొరియాసిస్‌కు సప్తధాతువులనే కాదు, సమస్త శరీర వ్యవస్థలనూ ధ్వంసం చేసే తత్వం ఉంటుంది. అలా ధాతువులు క్షీణిస్తూ వెళ్లే కొద్దీ శరీరంలో వాతం పెరిగిపోతుంది. ఒక్క వాతం సంతులనం (బ్యాలెన్స్) కోల్పోతే ఆ ప్రభావంతో మిగతా పిత్తం, కఫం కూడా సంతులనం కోల్పోతాయి. అయితే, చికిత్సా విధానాలతో ఒక్క వాతాన్ని తిరిగి సాధారణ స్థితికి తెస్తే, పిత్త కఫాలు కూడా సాధారణ స్థితికి వస్తాయి. అందుకే ఆయుర్వేదం వాత నియంత్రణకు ప్రాధాన్యతనిస్తుంది.

**ఆయుర్వేదమే అసలైన వైద్యం**

సొరియాసిస్ మచ్చలు చర్మం మీదే కనిపిస్తున్నాయని, పైపై వైద్యాలకే పరిమితమైతే సొరియాసిస్ రోజురోజుకూ పెరుగుతూనే వెళుతుంది. అందుకే, కేవలం బాహ్య చికిత్సలకో లేదా ఔషధాలకో పరిమితమైతే సొరియాసిస్‌కు అది పరిపూర్ణ వైద్యం కాదు. సొరియాసిస్‌కి కారణమైన ఆమాన్ని అంటే విషపదార్థాలను ముందు పంచకర్మ చికిత్సల ద్వారా తొలగించాలి. ఆ తరువాత ధాతుక్షయాన్ని నివారించే ఔషధాలు కూడా ఇవ్వాలి. వమనం, విరేచన కర్మల ద్వారా శరీరంలోని మలినాలన్నీ తొలగిస్తే వాతం అప్పుడు నియంత్రణలోకి వస్తుంది. వాతం నియంత్రణలోకి రాగానే మిగతా పిత్త, కఫాలు కూడా అదుపులోకి వస్తాయి. అప్పుడే సొరియాసిస్ సమూలంగా తొలగిపోతుంది. ఆ తరువాత వ్యాధిని సమూలంగా తొలగించడానికి మరో మూడు నాలుగు మాసాల పాటు కడుపులోకి ఇచ్చే ఔషధాలు తీసుకోవాలి. అన్నీ కలిసి, సొరియాసిస్‌తో పాటే వచ్చిన నరాల సమస్యలు, వెన్ను, కీళ్ల సమస్యలు తొలగిపోతాయి. ఒకవేళ లైంగిక సమస్యలు కూడా మొదలైతే, అవి పూర్తిగా తొలగిపోయి శరీరం శక్తివంతంగా మారుతుంది. వైద్య చికిత్సలు పూర్తి అయిపోయిన తర్వాత శరీరం మీద సొరియాసిస్ ఛాయలే కనిపించవు.




డాక్టర్ ఎస్. రామకృష్ణారెడ్డి
ఆర్.కె ఆయుర్వేదిక్ అండ్
సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్
కూకట్‌పల్లి 8886922245
నాంపల్లి 8886922247
హన్మకొండ 8886922248
విజయవాడ 8886922249
వైజాగ్ 8886922250
కర్నూలు 8886922251
తిరుపతి 8886922252


## లూకోకిట్ వాడితే తెల్ల మచ్చలు పారిపోవాల్సిందే

తెలుపు రంగు అంటే అందరికీ ఇష్టమే కదా! మరి ఒంటి మీద నాలుగు తెల్ల మచ్చలు కనపడితే ఎందుకలా వింతగా చూస్తారు? కొందరు అలా కాసేపు చూస్తూ వెళ్లిపోతారు గానీ, మరి కొందరేమో గుచ్చి గుచ్చి అడుగుతారు. మన ఒంటి మీద మనకసలు స్పృహే లేనట్లు, ఏమిటా మచ్చలు? ఏ డాక్టర్‌కూ చూపించలేదా? పోనుపోను ఒళ్లంతా పాకిపోతుంది అప్పుడేం చేస్తారు? ఇలాంటి ప్రశ్నలు కూడా నిర్మొహమాటంగా అనేస్తారు. మేమేదో చెట్టుకు నీళ్లు పోసి పెంచినట్లు, ఈ మచ్చలకు మేమేదో ఎరువు వేసి సాకుతున్నట్లు మాట్లాడతారు. అంతటితో ఆగితే మహా భాగ్యమే. కొందరైతే మేము గత జన్మలో చేసిన పాపాల ఫలితమని కూడా అనేస్తారు. ఇంక కాస్త గిట్టని వాళ్లయితే, వాళ్ల నోటికి హద్దూ పద్దూ ఉండదు. మా బాధ మాకుంటే వీళ్ల వేదింపులేమిటి? అసలు తెల్ల మచ్చల వ్యాధికి ఎక్కడా శాశ్వత చికిత్సే లేదంటూ వాళ్లు అదేపనిగా ఊదర గొడుతూ ఉంటే వాళ్ల మాటల్ని మా లాంటి వాళ్లు నమ్మే పరిస్థితే ఏర్పడింది.

**అసత్య ప్రచారమే ఎక్కువ**

సమస్య ఏమిటంటే, ఏవ్యాధి పైనా సమగ్రమైన పరిశీలన గానీ, పరిశోధన గానీ, చేయకుండానే ఈ వ్యాధికి మందే లేదని చెప్పే వైద్య వ్యవస్థలు సమాజంలో పెద్ద సంఖ్యలోనే ఉన్నాయి. వాళ్ల మాటల్నే ప్రమాణం తీసుకుని మరికొంత మంది వారి ఏజంట్లలా వ్యవహరిస్తూ ఉంటారు. బతికినంత కాలం మందులు వాడుతూనే ఉండాలి తప్ప ఈ సమస్య శాశ్వతంగా తగ్గిపోయే అవకాశమే లేదంటూ వాళ్లు కూడా ప్రచారం మొదలెడతారు. ఇవన్నీ కలిసి అంతిమంగా తెల్లమచ్చలతో బాధ పడేవారంతా వైద్య విధానాల మీద ఆశలు వదులుకునే పరిస్థితి ఏర్పడుతుంది.

వాస్తవానికి, ఎంతటి దీర్ఘకాలిక వ్యాధినైనా సమూలంగా నయం చేసే అద్భుతమైన ఔషధాలు మనం ఆయుర్వేదంలో ఉన్నాయి. తెల్ల మచ్చలకు అలాంటి శక్తివంతమైన ఔషధాలే ఉన్నాయి. ఆధునిక వైద్యులు తెల్ల మచ్చలకు ఈ రోజున కూడా మందే లేదని చెబుతున్నారు గానీ, 5 వేల ఏళ్ల క్రితమే ఆయుర్వేద శాస్త్రం ఈ వ్యాధిని సమూలంగా తొలగించే ఔషధ మూలికలను సూచించింది. ఆ మూలికల కలయికలతోనే శ్రీ దన్వసాయి ఆయుర్వేదిక్ ఫార్మసీ తెల్ల మచ్చలను సమూలంగా నిర్మూలించే లూకోకిట్ అనే ఔషధాన్ని తయారు చేసింది.

**ఎలాంటి కారణాలు....**

తెల్ల మచ్చలు రావడానికి గల కారణాల్లోకి వెళితే.... ఇవి కూడా అనేకం. వాటిలో ప్రధానంగా, శరీరంలో వ్యర్థ విష పదార్థాలు పేరుకుపోయి, వ్యాధినిరోధక శక్తి తగ్గిపోవడం ఒక కీలకాంశం. ఈ విషపదార్థాలు రక్తంలోకి ప్రసరించినపుడు రక్తంలోని హీమోగ్లోబిన్ పరిమాణం పడిపోతుంది. ఫలితంగా, శరీరంలోని మెలినిన్ తగ్గిపోయి చర్మం తన సహజ వర్ణాన్ని కోల్పోతుంది. ఇది తెల్ల మచ్చలు రావడానికి కారణమవుతుంది. ఆహారంలో ఫెర్రస్, కాపర్ లోపించడం కూడా ఇందుకు కారణమే. నానాటికి ప్రకృతికి దూరమైపోతున్న కారణంగా మానవ శరీరాల్లో విటమిన్ - డి తగ్గిపోతోంది. ఫలితంగా శరీరానికి వర్ణాన్నిచ్చే మెలనోసైట్స్ తగ్గిపోతాయి. ఫలితంగా తెల్లమచ్చలు ఏర్పడతాయి.

**లూకోకిట్ గురించి...**

ఈ లూకోకిట్‌లో మూడు రకాల ట్యాబ్లెట్లు ఉంటాయి. వీటిని ఉదయం సాయంత్రం భోజనం తర్వాత వేసుకోవాలి. వీటితో పాటు చర్మం మీద పూసుకునే కలర్‌కాట్ ఎల్, కలర్‌కాట్- ఎల్ మిక్స్ ద్రావణం కలయికలతో చర్మానికి సహజ వర్ణాన్నిచ్చే ఔషధం తయారు చేయబడింది. సహజ వర్ణం పోయి తెల్ల మచ్చలు ఏర్పడిన చోట ఈ ద్రావణాన్ని అప్లై చేసి 10 నుంచి 15 నిమిషాల పాటు ఎండలో కూర్చోవాలి. రోజూ ఉదయం, సాయంత్రం ఇలా చేస్తే మంచి ఫలితాలు వస్తాయి. ఇది జీవిత కాలపు శిక్ష అనుకున్న మచ్చలు మాయమైపోతాయి.




## నాంది

**షాడోని చాలామంది సూపర్‌మేన్ అంటారు. అది నిజం కాదు. షాడో ఒక హ్యూమన్ బీయింగ్. అయితే అతని గుండె మాత్రం ఆర్డినరీ హ్యూమన్ బీయింగ్స్ కంటే కొంచెం పెద్దది.**

**తోటిమనిషి బాధపడుతుంటే చూడలేడతను. అన్యాయం జరుగుతుంటే సహించలేడు. ఉపన్యాసాలతో సంఘసేవ, దేశ సేవ చేయటం చేతకాని మనిషి. ప్రాణాలుపోయినా సరే అప్పటికప్పుడు అటో ఇటో తేల్చుకోవాలన్నది అతని నైజం.**

**బయట గాలి తగిలితే భగ్గుమనే భాస్వరం వంటి ఆ అలవాటు అతనికి ఎంతోమంది శత్రువుల్ని తెచ్చిపెట్టింది. ఎదుటివారి కళ్ళల్లో చిన్న-పాటి నీటిబొట్టు కనపడినా భరించలేని అతని ఆ అలవాటు చాలామంది స్నేహితుల్నికూడా సంపాదించిపెట్టింది.**

**సూటిగా, సాఫీగా సాగిపోవాల్సిన అతని జీవితం కొందరి స్వార్థపూరిత అభియోగాల మూలకంగా పక్కదారి పట్టింది. దొంగని చేసింది. నిలబడిన చోట కూర్చోకుండా, కూర్చున్నచోట నిద్రపోకుండా, ఒక్కనిమిషం కూడా కుదురుగా లేకుండా దేశం నలుమూలలకు పరుగులు పెట్టవలసి వచ్చింది.**

కాకలుతీరిన పోలీస్ అధికారులు ఎందరో అతన్ని పట్టుకుని ఊచల వెనక్కి నెట్టడానికి చాలాచాలా ప్రయత్నాలు చేశారు. చిక్కినట్టే చిక్కి చిటికెలో చేజారి పోతున్న అతనికి వాళ్ళే ముద్దుపేరు పెట్టారు. నీడనైనా పట్టుకోవచ్చుగాని, షాడోని పట్టుకోవటం అసాధ్యమని.

అలా ఎందుకు జరుగుతున్నదని అంతర్మథనం చేసుకుంటున్న సమయంలో అందరికీ తెలిసి వచ్చింది అసలు విషయం.

షాడో ఒంటరివాడు కాదు. అతడివెంట ఒక స్నేహితుడు ఉన్నాడు. పొట్టిగా, లావుగా పిచ్చి వాడిలా కనిపించే ఆ స్నేహితుడి పేరు గంగారాం. ఎటువంటి ఇబ్బందికరమైన పరిస్థితిలోనైనా చాలా చురుకుగా కదులుతాయి అతని ఆలోచనలు.

**కొత్త సీరియల్ ప్రారంభం**



ఆ ఇబ్బందివల్ల షాడోకి ఏదైనా ఆపద ముంచుకు వస్తుందని తెలిస్తే అగ్గిరాముడే అయిపోతాడు. అప్పటికప్పుడు ఏదోఒక మెలికపెట్టి తన జతగాడిని కాపాడుకుంటాడు. తనుకూడా తప్పించుకుంటాడు.

నీడ అనబడే షాడోకి అతనే పెద్దనీడ. షాడో ఒక కార్చిచ్చు అయితే దాన్ని ఎగదోసే ఈదురు గాలి గంగారాం.

ఈ ఇద్దరూకలిసి కాశ్మీరు నుంచి కన్యాకుమారి వరకూ పోలీసులతో పరుగు పందేలు వేస్తూ ఉన్న సమయంలో రంగంలోకి దిగింది సి.బి.ఐ.

భారతదేశ సార్వభౌమాధికారాన్ని ప్రశ్నించే అసాంఘిక శక్తుల్ని నిర్మొహమాటంగా ఏరి పారేయటానికి ప్రభుత్వం తయారుచేసిన ఒక క్రైమ్ ఇన్వెస్టిగేషన్ బ్యూరో అది.

ముల్లును ముల్లుతోనే తీయాలిగాని, ఇతర పద్ధతులు పనికిరావని ప్రగాఢంగా విశ్వసించే కులకర్ణిగారు దానికి హెడ్.

తన మనసులోని భావాలను అందిపుచ్చుకుని, తను అనుకున్న విధంగానే ఆ దుష్టశక్తులను అంతం చేయగల సత్తా షాడోకి ఉన్నదని గమనించి, అతన్ని తమ ఆర్గనైజేషన్‌లోకి లాక్కునేందుకు చాలా చాలా ప్రయత్నాలు చేశారు ఆయన.

సి.బి.ఐ.లో చేరటానికి షాడోకి ఇష్టం లేకపోయింది. కులకర్ణిగారికి దొరకకుండా ఉండటంకోసం దేశం వదిలి జపాన్ పారిపోయాడు. అక్కడ కుంగ్‌ఫూ విద్యాపీఠంలో విద్యార్థిగా చేరి కుంగ్‌ఫూ సాధనతో తన మనస్సును పట్టిపీడిస్తున్న నైరాశ్య భావనల నుంచి బయటపడటానికి ప్రయత్నిస్తున్న తరుణంలో విధి అతన్ని మరోసారి వెక్కిరించింది.

పెద్దలను గౌరవించడం భారతీయ సంప్రదాయం. పెద్దలు వయసులోనే కాదు చదువులోనూ పెద్దవారైతే, తల వంచి నిలబడాలనేది కుంగ్‌ఫూ సంప్రదాయం.

షాడోకంటే చాలా ముందుగా విద్యాపీఠంలోచేరి దాదాపు విద్యాపీఠానికి అధినేతగా పేర్కొనే స్థాయికి చేరుకున్న ఫ్యూజీశాన్‌తో మాట తేడా వచ్చింది. అది కాస్తా పెరిగిపెద్దదై కక్షకట్టే పొజిషన్‌కి చేరుకున్నది.

విద్యలో తనకంటే అధికుడైన ఫ్యూజీశాన్‌మీద తిరగబడకూడదని కుంగ్‌ఫూ నియమాలు హెచ్చరిస్తున్నందున కామ్‌గా పక్కకు తప్పుకున్నాడు షాడో. తనదారి ఏదో తను చూసుకోవటానికి ప్రయత్నించాడు.

వదిలిపెట్టలేదు ఫ్యూజీశాన్. విద్యాపీఠం పెద్దల మీద ఒత్తిడితెచ్చి షాడో ఎక్కడ కనిపించినా వెంటనే



పట్టుకుని తమకు అప్పగించే విధంగా శ్రీముఖాలు తయారుచేయించాడు.

ప్రపంచంలో ఏ ప్రాంతంలో ఉన్న కుంగ్‌ఫూ వస్తాదులకైనా ఆ శ్రీముఖం వర్తిస్తుంది. తాము చేస్తున్న పనులు వదిలిపెట్టయినాసరే, షాడోని వెతికిపట్టుకోవాల్సిన పరిస్థితుల్ని క్రియేట్ చేస్తుంది.

తనను కార్నర్ చేయబోయిన టకమారా అనే వస్తాదును ఏమార్చి తప్పించుకునేక్రమంలో ఫ్యుజీశాన్ దృష్టిలోపడతాడు షాడో. అతన్ని వదిలించుకోవటానికి ప్రయత్నం చేస్తూ జపాన్ దేశం వదిలి పారిపోవాలనుకుంటూ ఉండగా విధి అతన్ని ఒక విచిత్రమైన మాయలోకి నెడుతుంది.

పటోలా బౌద్ధమతపీఠం ఒకటి ఉన్నది చైనా దేశంలో. అత్యంత విచిత్రమైనశక్తులు కలిగిన ఒక ఉల్కాదండం ఆ పీఠంలో పూజలు అందుకుంటోంది.

అచికూ డెమన్స్ అని పిలువబడే అచికూ జాతి దుర్మార్గుల సాయంతో ఆ ఉల్కాదండాన్ని అపహరించి, దేశంలో అల్లర్లు ఆందోళనలు రేకెత్తించటానికి పథకంవేసి, ఆ దండం స్వాధీనం చేసుకుంటాడు ఒక పెద్దమనిషి.

బౌద్ధమతపీఠంలో ఉండాల్సిన ఉల్కాదండం అపహరించబడిన సంగతి బయటికిపొక్కితే, అశాంతి ఆందోళనలు అప్పటికప్పుడే ప్రజ్వరిల్లుతాయన్న భయంతో జపాన్ కుంగ్‌ఫూ విద్యాపీఠం సహాయం అర్థించేందుకు తన ప్రతినిధుల్ని పంపిస్తుంది పటోలా బౌద్ధపీఠం.

అలా అర్థించేందుకు జపాన్‌దేశంలోకి వచ్చిన బౌద్ధపీఠం సన్యాసులను అచికూ డెమన్స్ హతమారుస్తారు. ఆవిధంగా ఆ విషయం కుంగ్‌ఫూ విద్యాపీఠానికి తెలియకుండా అడ్డుకుంటారు.

ఫ్యుజీశాన్‌ని, అతనికి సహకరిస్తున్న పోలీసు అధికారుల్ని తప్పించుకోవటానికి పరుగులు తీస్తున్న షాడో, గంగారాంల కళ్ళపడుతుంది ఆ దృశ్యం. అచికూ డెమన్స్ అంటే అపరిమిత బల సంపన్నులు. నొప్పి అనేమాటకి అర్థం తెలియని వజ్ర శరీరాలు వారివి.

ప్రాణాలకుతెగించి వారిని ఎదుర్కొంటాడు షాడో. తన మొండితనంతో, తన భుజబలంతో వారిని దూరంగా తరిమేస్తాడు. కానీ అప్పటికే సన్యాసులు అందరూ కాలగతి పొందుతారు. తాము వచ్చినపని పూర్తికాక ముందే తమప్రాణాలు గాలిలో కలిసిపోయిన సంగతి పటోలా పీఠాధిపతులకు తెలియచేయవలసిన బాధ్య తను షాడో తలమీద పెట్టడం జరుగుతుంది.

తరుముకుంటూ వస్తున్న ఫ్యుజీశాన్‌ని తప్పించుకునేందుకు ఎలాగో జపాన్‌దేశం వదిలేయదల్చుకున్నాడు కాబట్టి, వెంటనే చైనావైపు ప్రయాణం మొదలుపెడతాడు షాడో.

పటోలాపీఠం చేరుకుంటారు షాడో, గంగారాం. పీఠాధిపతులకు జరిగింది చెపుతారు. ఆపద సమయంలోవచ్చి ఆదుకుంటామని వాగ్దానం చేసిన కుంగ్‌ఫూ వస్తాదులకు బదులు ఒక సామాన్యుడు తమదగ్గరికి వచ్చినందుకు కించిత్ కూడా బాధపడకుండా అస్మీ పానీయం ఇచ్చి షాడోని ఆదరిస్తారు పీఠాధిపతులు.

మహా శక్తి కలిగిన సారాయి అది. ఒకటి రెండు గుక్కలు పుచ్చుకున్న వెంటనే కళ్ళు తిరిగి క్రింద పడిపోవాల్సిందే ఎటువంటివారైనా. మూడుపాత్రలు తాగి కూడా నిబ్బరంగా కూర్చున్న షాడోకి అచికూ డెమన్స్ గురించి, వారిని గతంలో ఎదిరించిన ఋషిడో వస్తాదును గురించి చెపుతారు వాళ్ళు. తమ ఉల్కాదండాన్ని తమకు తిరిగి తెచ్చి ఇచ్చే బాధ్యత స్వీకరించవలసిందిగా షాడోని వేడుకుంటారు. అందుకు అంగీకరించి తన స్నేహితుడు గంగారాంతో అచికూ రాక్షసులను ఎదుర్కోవటానికి బయలుదేరతాడు షాడో.

అతన్ని వెంటాడుతూ ఫ్యుజీశాన్ కూడా చైనాలో అడుగుపెట్టి, ముందుగా తనే అచికూ రాక్షసులను ఎదిరించి, అవమానాల పాలవుతాడు.

అఖరిక్షణంలో తనకుతోచిన ఒక పోరాటపద్ధతి ఉపయోగించి అచికూ డెమన్స్ ఆట కట్టిస్తాడు షాడో. మాయమైపోయిన ఉల్కాదండం చేజిక్కించుకుని, పటోలా పీఠాధిపతుల దగ్గరకు పంపిస్తాడు.

అవమానాలపాలైన ఫ్యుజీశాన్, మరింత కచ్చగట్టి తనను తరుముకుంటూ వచ్చితీరతాడని షాడోకి తెలుసు. ఆ పని జరిగేంతవరకూ ఆ దేశంలోనే ఉండిపోవటం చాలా ప్రమాదకరమని కూడా తెలుసు. అందుకే ఒక పడవలో తిరిగి తన ప్రయాణం మొదలుపెడతాడు..

ఇది ఇంతకుముందు జరిగిన కథ.

చిటికె వేస్తేచాలు అన్యాయాలను ఎదిరించటానికి వెనుకాముందూ చూసుకోకుండా తన పిడికిళ్ళకు పని కల్పించే షాడో, ఇప్పుడు ఎటు పోతున్నాడో, ఏం చేయబోతున్నాడో..... ఇక చదవండి.

## ప్రస్తావన

గాజుపెంకులు నమిలినట్టు చీరుకుపోయిన తన నోరు తిరిగి మామూలుగా తయారవటానికి మూడు నెలలు పట్టింది ఫ్యుజీశాన్‌కి.

గట్టిగా ఉండే ఆహారపదార్థాలు ఆరగించలేకపోయాడు. పలుచగా ఉండే పులుసువంటి ద్రవాలు కూడా నోటిలోకి వంపుకోలేక పోయాడు. బొగ్గుల మీద వేడిచేసిన ఉప్పులేని ఒట్టి బార్లీ జావ మాత్రం తీసుకోగలిగాడు.

ప్రాణాలు నిలబెట్టిందిగాని, అప్పటికప్పుడు బయలుదేరి తన ప్రయాణం కొనసాగించటానికి అవసరమైన శక్తినిమాత్రం ఇవ్వలేకపోయింది బార్లీ జావ.

రోజురోజుకీ అధికం అయిపోతోంది అతని కక్ష. 'తప్పించుకోలేవు రాజుశావ్. నా నుంచి నిన్ను ఆ దేవుడు కూడా కాపాడలేడు. గోటితో పోయేపనికి గొడ్డళ్ళు ఉపయోగించటం దేనికని ఉపేక్షించాను. ఇక అటువంటి తప్పిదం చేయను. నిన్ను పాతాళలోకానికి పంపందే నేను విశ్రమించను' తనలోతను గొణుక్కుంటూ అతిభారంగా రోజులు గడిపాడు.

నోటికి తగిలిన గాయాలు నయమై, బలవర్థకమైన ఆహారం నోటిలో పెట్టుకున్న వెంటనే, ఒక మూలగా పడవేసిన తన ఉత్తరీయం భుజంమీద వేసుకుని, అప్పటివరకూ తను తలదాచుకున్న కుటీ



## బాలీవుడ్ బాటలో
# రకూల్

రకూల్ ఇప్పుడేమీ కొత్తగా బాలీవుడ్ బాట పట్టలేదు. అసలు అక్కడి నుంచే ఇక్కడకు వచ్చింది. మొదటి సినిమా అక్కడ క్లిక్ కాకపోయేసరికి దక్షిణాదిబాట పట్టింది. ఇక్కడ రకూల్ పంట పండింది. స్టార్ హీరోయిన్ అయింది. రకూల్ ఉంటే ఆ సినిమా విజయం ఖాయం అన్న మాటను మూట కట్టుకుంది. ఈ మాట బాలీవుడ్ చెవిన పడినట్టు ఉంది. అందుకే రకూల్ హీరోయిన్‌గా అక్కడ ఓ సినిమా త్వరలోనే ప్రారంభం కాబోతోంది. బాలీవుడ్‌లో రకూల్ చేస్తోంది అన్న మాట వినిపిస్తున్నా ఆమె వైపు నుంచి సరైన క్లారిటీ రావడం లేదు అంటున్నారు సినీ జనాలు.

రంలో నుంచి బయటికి వచ్చాడు.

వెంటనే అతనిముందు ప్రత్యక్షం అయ్యాడు ఒక వృద్ధుడు. చిన్నతనంలో కుంగ్‌ఫూ విద్యాపీఠంలో పెంచబడే పూపాదులకు నీళ్ళుపోస్తూ, వంటశాలలో చిన్నాచితకా పనులు చేసిపెడుతూ పెరిగి పెద్ద వాడైన మనిషి అతను.

అతని సేవాతత్పరతకు మెచ్చి, అతను కోరు కున్నట్టు చైనా దేశపు నాన్‌కింగ్ ఏరియాలో మూడు కుంటల భూమి కొనిపెట్టాడు కుంగ్‌ఫూ విద్యాపీఠం అధిపతి చింగ్‌లీ. ఆ కుటీరం నిర్మించు కోవటానికి అవసరమైన ధనం కూడా ఇచ్చి పంపిం చాడు.

తను ఉద్యోగ విరమణ చేసే సమయంలో కుంగ్‌ఫూ నేర్చుకోవటానికి వచ్చిన ఫ్యుజీశాన్‌ని ఇప్పుడు గుర్తు పట్టి తన కుటీరంలో తలదాచుకోవటానికి అంగీక రించాడు అతను.

వయసులో చాలా పెద్దవాడవటంవల్ల, ఫ్యుజీ శాన్ ఎదురుచూసినట్లు అమితమైన గౌరవం మాత్రం చూపించలేదు.

'నీకు తగిలిన దెబ్బ సామాన్యమైనది కాదు. నువ్వు ఇంకో పదిసంవత్సరాలపాటు సాధన చేస్తే తప్ప అటువంటి దెబ్బనుంచి రక్షించుకోవడం సాధ్యపడదు' కండలు తరిగిపోయి ఎముకలు మాత్రమే కనిపించే టట్లున్న తన కుడిచేతిని ముందుకుజాచి, అతని బుగ్గ తడుముతూ మృదువుగా అన్నాడు వృద్ధుడు.

మండిపోయింది ఫ్యుజీశాన్‌కి. ఎందుకూపనికి రాని ఒక సామాన్యమైన తోటమాలి. తన బుగ్గని తడమటమా? కుంగ్‌ఫూ సాధనలో ఆరితేరిన తను, అందుకు అంగీకరించటమా?

కంటికి కనిపించనంత వేగంతో కదిలింది అతని ఎడమచేయి. బిగ్గరగా అరిచేందుకు కూడా వ్యవధి లేకపోయిందా వృద్ధుడికి. రాక్షసహస్తం ఏదో తనను ఎత్తి అవతలకు విసిరేసినట్లు, గాలిలోకి లేచి పది అడుగుల దూరంలో పడిపోయాడు.

ఒంటిమీద కండలు వృద్ధాప్యంవల్ల హరించుకు పోయి వట్టి ఎముకలు మాత్రమే మిగిలున్నాయి అతని శరీరంలో. కలుక్కుమన్నాయి అవి. కళ్ళవెంట అతనికి తెలియకుండానే జర్రున జారాయి కన్నీళ్ళు.

'నన్ను ఆదరించి ఎంతో సహాయం చేసిన పీఠా నికి చెందినవాడివని భావించి, నీకు ఇటువంటి గతి పట్టటానికి కారణం ఏమిటో కూడా అడగకుండా నీకు సేవలు చేశాను. అందుకు ప్రతిఫలమా ఇది?' ఎంతో ప్రయత్నం మీద పైకి లేస్తూ అడిగాడు వృద్ధుడు.

**సి.ఐ.ఏలో చేరడం ఇష్టంలేక కులకర్ణిని తప్పించుకునేందుకు జపాన్ పారిపోతాడు షాడో. కుంగ్‌ఫూ విద్యాపీఠంలో చేరతాడు. అక్కడ కుంగ్‌ఫూ నేర్చుకుంటుంటే షాడోపై కక్షకడతాడు ఫ్యుజీశాన్. అతనితో గొడవ తారాస్థాయికి చేరడంతో అక్కడినుంచి కూడా బైటపడతాడు షాడో. అతన్ని వేటాడుతూ బయల్దేరతాడు ఫ్యుజీశాన్. షాడో అతనికి దొరికాడా? షాడో ఇప్పుడు ఎక్కడ తలదాచుకున్నాడు?**

'నువ్వు ఏ పీఠం గురించి మాట్లాడుతున్నావో, అదే పీఠానికి నేను కాబోయే అధిపతిని. మర్యాద ఇచ్చుకోవటం నీకు చాలా మంచిది' క్రిందికి జారి పోబోతున్న ఉత్తరీయం తిరిగి భుజంమీదికి లాక్కుంటూ హుందాగా అన్నాడు ఫ్యుజీశాన్.

'కుంగ్‌ఫూ పీఠం అంటే ఒట్టి పోరాటాలు నేర్పే ప్రదేశం మాత్రమే కాదు. మంచితనం, మానవత్వం, కష్టంలో ఉన్నవారిని ఆదుకోవటం మొదలైన లక్ష్యాలు నేర్పి పంపించే మహత్తర పుణ్యక్షేత్రం' దెబ్బ తగిలిన ప్రదేశాన్ని చేతులతో తడుముకుంటూ అన్నాడు వృద్ధుడు.

'నీకు వాగుడు చాలా అధికమైంది. ఇంకొక్క మాట నీ నోటినుంచి బయటికి వచ్చిందంటే ఏం చేస్తానో నాకే తెలియదు' తర్జని పైకెత్తి గట్టిగా ఊపుతూ హెచ్చరించాడు ఫ్యుజీశాన్.

ఏదో రెట్టించటానికి నోరు తెరచి, వెంటనే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు వృద్ధుడు.

క్రిందపడినప్పుడు దుస్తులకు అంటిన మట్టి దులుపుకుంటూ, వెనుతిరిగి దూరంలో కనిపిస్తున్న ఒక కాలిబాటవైపు బయలుదేరాడు.

'ఏయ్ ఆగు, ఎక్కడికి పోతున్నావ్?' ఉరుము ఉరిమినట్టు ధ్వనించింది ఫ్యుజీశాన్ కంఠం.

బార్లీగింజలు నిండుకున్నాయి. గోధుమలు ఖాళీ అయినాయి. కాబోయే పీఠాధిపతులకు ఆహారం ఇవ్వ టానికి అవసరమైనవేవీ కుటీరంలో లేవు. గ్రామం లోకిపోయి తీసుకువస్తాను' చెప్పాడు వృద్ధుడు.

'నువ్వు ఎక్కడికీ పోనవసరం లేదు, నేను నా ప్రయాణం కొనసాగించటానికి సిద్ధంగా ఉన్నాను' గంభీరంగా చెప్పాడు ఫ్యుజీశాన్.

తన వదనంలో ప్రతిఫలించబోయిన సంతో షాన్ని అతి ప్రయత్నం మీద అదుముకుంటూ, ముందుకువంగి కుంగ్‌ఫూ వస్తాదులకు సామా న్యులు ఎలా నమస్కరిస్తారో అలా నమస్కారం చేశాడు వృద్ధుడు.

'ఏ పని చేయటానికైనా మీరు సర్వసమర్థులు. మీరు ఏంచెపితే అది చేయటానికి ఈ సామాన్యుడు సిద్ధంగా ఉన్నాడు' అని మాత్రం అన్నాడు.

'నేను వెంటనే సముద్రం దాటి హాంకాంగ్ వెళ్ళాలి. దారి ఎటుందో త్వరగా చెప్పు' డిమాండ్ చేశాడు ఫ్యుజీశాన్.

'రెండురోజులు ప్రయాణం చేయాలి. ముందుగా కాంటో పట్టణానికి పోయి అక్కడి నుంచి కాంటన్ చేరుకోవాలి. పూటన్నర ప్రయాణం. రెండున్నర గంటలు మరబోటులో కూర్చుంటే నువ్వు హాంకాంగ్



## సంఘమిత్రగా నయన?

ఏ క్షణాన ఈ సినిమా మొదలుపెట్టారో కానీ, అన్నీ అడ్డంకులే! అన్నీ అపశకునాలే! మొదట శ్రుతిహాసన్‌ను అనుకుని ఆమె మీద బోలె డంత ఖర్చు పెట్టారు కూడా! ఎన్నో ఆశలతో ఈ సినిమా పోస్టర్‌ను కేన్స్ ఫిలిం ఫెస్టివల్‌లో ప్రదర్శిస్తే విమర్శలు తప్ప ప్రశంసలు రాలేదు. కట్ చేస్తే....ఈ సినిమా నుంచి శ్రుతి తప్పుకుంది. ఆ తరువాత నుంచి సంఘమిత్ర ఎవరన్నది ఇంతవరకూ తేలలేదు. ఇప్పుడు నయన పేరు తెర మీదకు వచ్చింది. నయన పెట్టిన కండీషన్లకి యూనిట్ ఓకే అన్నట్టే యూనిట్ చెప్పిన వాటికి నయన తల ఊపిందట! హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాలను ఒంటి చేత్తో లాక్కొ చ్చిన ఘనత నయన సొంతం. అయితే ఈ ఘనత అంతా కోలీవుడ్‌కే పరిమితం అయింది. టాలీ వుడ్‌లో ఆమె పప్పులు ఉడకలేదు. ఇక్కడ అనుష్క ఉంది. ఇప్పుడు నయనతో తీయబోతున్న సినిమా తెలుగు, తమిళం, హిందీ భాషలలో ఉంటుంది. కోలీవుడ్ వరకూ అయితే నయన ఓకే కానీ, తెలుగు, హిందీలలో నయనకు అంత మార్కెట్ లేదు. మరి అన్ని కోట్లు పెట్టి నయనను తీసుకుంటే వర్కవుట్ అవుతుందా? అని కొందరు అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు.

చేరుకుంటావు' తడుముకోకుండా చెప్పాడు వృద్ధుడు.

'అక్కడ నీకు తెలిసిన నీ బంధువులు ఎవరైనా ఉన్నారా?' అడిగాడు ఫ్యుజీశాన్.

కింద ఉన్న మట్టిలో నుంచి తళతళ మెరుస్తున్న రెండు గులకరాళ్ళు తీసి అతని మొఖంమీదికి విస రాలన్న కోరికను చాలా బలవంతంగా అదుము కున్నాడు వృద్ధుడు.

ఆ రాళ్ళు తన చేతిలోనుంచి గాలిలోకి పోయిన వెంటనే అడ్డుకోగలడు ఆ వస్తాదు. మెరుపు కంటే వేగంగావచ్చి తన తల రెండుచెక్కలు అయిపోయే టట్లు భయంకరంగా కొట్టగలడు.

'నేను అడిగిన మాటకు సమాధానం చెప్పవేమిటి?' కనులు చిట్లిస్తూ కోరగా అడిగాడు ఫ్యుజీశాన్.

'ఆలోచిస్తున్నాను. ముసలితనం మీదపడిన దగ్గర్నించీ నా మతి మందగించిపోయింది. జ్ఞాపక శక్తి తగ్గిపోయింది' అన్నాడు వృద్ధుడు.

మరోసారి మండిపోయింది ఫ్యుజీశాన్‌కి. కుంగ్‌ఫూ విద్యాపీఠంలో అడుగుపెట్టిన ప్రతిమనిషికీ, వాళ్ళు విద్య నేర్చుకోవడానికి వచ్చినా, చిన్నాచితకా పనులు చేసి పొట్టలు పోషించుకోవటానికి వచ్చినా, కొన్ని కొన్ని అలవాట్లు తప్పనిసరిగా నేర్పించబడతాయి.

ధ్యానం వాటిలో ఒకటి. ఒకసారి ఎటువంటి విషయమైనా మనసులోకి ప్రవేశించటం జరిగితే, ఆఖరిశ్వాస తీసుకునేంతవరకూ దానిని మర్చి పోకుండా ఉండేందుకు అవసరమైన శక్తిని పొందటం రెండవది.

కాంటన్‌సిటీలోనో, హాంకాంగ్‌లోనో ఎవరో తెలి సినవాళ్ళు ఉన్నారు అతనికి. ఆ మాట బయట పెట్టకుండా ఉండటంకోసం, నోటికివచ్చిన కాకమ్మ కథల్ని వినిపిస్తున్నాడు తనకి.

'హాంకాంగ్ చుట్టుపట్ల ఉన్న సముద్రమార్గా లన్నీ తెలిసిన మనిషి, అవసరం అయితే నాకు కావాల్సిన మనిషిని, సముద్రంలో ఉండగానే పట్టి బంధించి నాకు అప్పగించగల ధైర్యవంతుడు ఎవరో నాకు వెంటనేచెప్పు' అతని మాటల్ని తాను నమ్మటం లేదన్న విషయం అతనికి తెలిసేటట్లు విసురుగా అడిగాడు.

'కాంటన్‌సిటీలో హూహుశాన్ ఉన్నాడు. పెద్ద దొంగ. వాడికి వెయ్యికిపైగా మరబోట్లు ఉన్నాయ్. మూడు విమానాలున్నాయ్. రెండువేలమంది అతని దగ్గర పనిచేస్తూ ఉంటారు. పోలీసులు ప్రభుత్వాధి కారులు అందరూ అతి వినయంగా మాట్లాడతారు అతని పేరు వినబడిన వెంటనే' తడుముకోకుండా చెప్పి, తల ప్రక్కకు తిప్పుకున్నాడు వృద్ధుడు.

'తల వంచుకుని మాట్లాడాలి ఎవరువెళ్ళినా ఆ హుహుశాన్ ముందు. తలెత్తి చూస్తే అప్పటి కప్పుడు అక్కడికక్కడే తల తెగి నేలమీద పడి పోతుంది. మూడునెలలపాటు వెట్టి చాకిరీ చేసిన తనను విదిలించికొట్టినట్టు అక్కడ ప్రవర్తిస్తే అంతే సంగతులు అయిపోతాడు ఈ పెద్దమనిషి' తనలో తను అనుకున్నాడు.

భుజంమీది ఉత్తరీయాన్ని అవసరం లేక పోయినా మరోసారి గట్టిగా విదిలించి, వేగంగా నడక మొదలు పెట్టాడు ఫ్యుజీశాన్.

అతను కాలిబాట మీదినించి ఒక కంకరరోడ్డు మీదికి పోయేవరకూ ఆగి, తన కుటీరం వెనక్కి పరి గెత్తాడు వృద్ధుడు.

ఎత్తుగా ఉన్న వెదురుగడలమీద నీట్‌గా నిర్మించ బడి ఉన్నాయి పెద్ద పెద్ద చెక్కగూళ్ళు. కువ కువ లాడుతూ ఆ గూళ్ళ దగ్గర సందడి చేస్తున్నాయి రంగురంగుల పావురాలు.

వృద్ధుడు రావటం చూసిన వెంటనే రెక్కల్ని తపతపలాడిస్తూ క్రిందికి వచ్చేశాయి అవన్నీ. అతని భుజాలమీద, తలమీద వాలి తమ ఆపేక్ష ప్రదర్శించ టానికి పోటీలుపడటం మొదలుపెట్టాయి.

'ఆగండి... కొంచెం ఆగండి. మీతో మాకు పనేమీ లేదు. అత్యవసరంగా ఒక వర్తమానం కాంటన్ సిటీలో ఉన్న నా కూతురికి పంపించాలి. అందుకు మీరు ఎవరూ పనికిరారు...' అంటూ ఎడమచేతి వేళ్ళల్లో రెంటిని నోటిలో పెట్టుకుని పెద్దగా ఈలవేశాడు.

చెవులు గింగిర్లెత్తే శబ్దం వెలువడింది. అది వెలువడిన అయిదోక్షణంలో రాకెట్ మాదిరి దూసుకు




వచ్చాయి రెండు చిలకలు.

'రండి..రండి. ఈ పని మీవల్లనే అవుతుంది. కుదురుగా కూర్చుని వినండి' అక్కడికక్కడే నేల మీద చతికిలపడుతూ వాటికి చెప్పాడు అతను.

***

ఆకలి అధికం అయిపోయింది గంగారాంకి. కను చివరల నుంచి షాడో వైపు చూశాడు.

కాంటన్‌సిటీలో దొరికే కారుచౌక సిగరెట్లు కాల్చలేక కాలుస్తున్నాడు షాడో. వాటి టేస్ట్ తనకు నచ్చనట్టు మొఖం చిట్లిస్తున్నాడు.

'మనం ఈ దరిద్రపుగొట్టు సిటీలోకి వచ్చి మూడు రోజులు అయింది. దిక్కు దివాణం లేనట్టు వీధులు పట్టుకు తిరగటంతప్ప విరగబొడిచింది ఏమీ లేదు. కనీసం రుచిగా ఉండే చాయ్ నీళ్ళు కూడా ఎవరూ పోయటంలేదు మన మొఖాల మీద' కచ్చగా వెళ్ల డించాడు తన అభిప్రాయాన్ని.

'ఏంటి నీ గోల? ఏం చేద్దామని నీ ఉద్దేశం?' సగం కూడా కాలని కాంటన్‌సిటీ సిగరెట్ అవతలికి విసిరేస్తూ అడిగాడు షాడో.

'తాడూ బొంగరంలేని ఆవారాగాళ్ళ మాదిరి తిరగాల్సిన అవసరం మనకి ఉన్నదా?' అడిగాడు గంగారాం.

జేబులోనే ఉన్న ఇంకో సిగరెట్ వెలిగించుకోవా లని ఎంతగా అనిపిస్తున్నా, ఆ పని చేయటానికి తగిన ధైర్యం లేకపోవడంవల్ల చేతులు పాంటు జేబుల్లోనే ఉంచుకున్నాడు షాడో.

'నిన్న క్వాయ్‌ముయ్ రెస్టారెంట్ దగ్గర ఏం జరి గిందో మర్చిపోయావా?' తన ప్రశ్నకు సమాధానం రాకపోవటంతో మరింత చిరాకుగా అడిగాడు గంగారాం.

చైనా సముద్రంలో దొరికే షార్క్ చేపలతో కళ్ళు తిరిగిపోయే వంటకాలు చేయటంలో సిటీ మొత్తం మీద నెంబర్‌వన్ అని పేరుపొందిన రెస్టారెంట్ అది.

అదేపనిగా సముద్రంమీద ప్రయాణంచేసి రావ టంవల్ల, ఉప్పు వాసనతో దద్దరిల్లి పోతున్నాయి స్నేహితుల దుస్తులు. సిటీ వెలుపల కనిపించిన ఒక చిన్ననదిలో గంటసేపు స్నానం చేసినా, వారి కాళ్ళు చేతుల్ని వదిలిపెట్టి అవతలికి పోలేదు ఆ వాసన. దుస్తుల్ని అక్కడ ఉన్న బండలకేసి బాది బాది మాడి మసి అయిపోయేవరకూ ఎండలో ఆరబెట్టినాకూడా తొలగిపోలేదు వాటిని అలుముకున్న దుమ్ము.

అడుక్కుతినేవాళ్ళని అనుకున్నారు రెస్టారెంట్ నిర్వాహకులు. మర్యాదగా ఆ మాట చెప్పినట్లయితే హర్ట్ అయి ఉండేవాడు కాదు గంగారాం. తమ బౌన్సర్లు ఇద్దర్ని ఉసికొలిపి వీధిలో పడిపోయేటట్టు నెట్టించారు. ఇంకోసారి ఆ చుట్టు పట్ల కనిపిస్తే ఈసారి కాళ్ళు చేతులు విరగదీసి పంపించవలసి వస్తుందని కూడా హెచ్చరించాడు.

'ఇంతబతుకూ బతికి ఇంటివెనకాలపడి చచ్చి పోయాట్ట నాలాంటివాడు. సముద్రాలన్నిటినీ దాటు కుని, ఈ చిటోరినాయాళ్ళతో మాటలు పడటానికి

వచ్చామా? అనిపిస్తోంది' జరిగింది ఫ్రెష్‌గా గుర్తుకు రావటంతో కచ్చగా అన్నాడు గంగారాం.

అక్కడితో ఆగలేదు వాళ్ళు. ఆ చంచాగాళ్ళు నా జుట్టు పట్టుకుంటుంటే నువ్వు చూస్తూ ఊరుకున్నావు. ఏమైపోయింది నీ శౌర్యం?' అని కూడా అడిగాడు.

పాంటు జేబుల్లో పెట్టుకున్న చేతులు తీసి, బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు షాడో.

పటపటమని శబ్దం చేశాయి అతని భుజం కండరాలు. అప్పటివరకూ ఎంతో వదులుగా ఉన్న అతని షర్టు ఉన్నట్టుండి టైట్ అయినట్టు అనిపించింది గంగారాంకి.

వెంటనే ప్లేటు ఫిరాయించేశాడు. 'ఏదో ఒకటి మాట్లాడాలి కాబట్టి ఏదో వాగేశాను. నువ్వు పట్టించుకోకుండా ఉండటానికి ఏదో పెద్దకారణమే ఉండి ఉంటుందని నాకు తెలుసు. ఏదైనా గలాటా మొదలుపెడితే మళ్ళీ ఆ ఫ్యుజీశాన్‌గాడు వెనకాలే వచ్చేస్తాడని అనుకున్నావా?' అడిగాడు షాడోని.

తల అడ్డం తిప్పాడు షాడో.

'మరి ఎందుకు అనవసరంగా అవతలికి నెట్టించుకోవటం?' పట్టినపట్టు వదలకుండా రెట్టించి అడిగాడు గంగారాం.

'క్యాయ్‌ముయ్ రెస్టారెంట్ ఎవరిది?' సింపుల్‌గా అడిగాడు షాడో.

'ఇదో పెద్ద ప్రశ్న? అది హుహుశాన్‌ది' అంటూ అదిరిపడ్డాడు గంగారాం.

అది చూసి చిన్నగా నవ్వుతూ, జేబులో నుంచి సిగరెట్‌తీసి వెలిగించుకున్నాడు షాడో.

'నిజమే గురూ.. ఆ ఫ్యుజీశాన్‌గాడి గోలకి ఇప్పుడు ఈ హుహుగాడు కూడా తోడైతే మన పని భజగోవిందం అయిపోతుంది. నువ్వే రైటు' అన్నాడు గంగారాం. అంతలోనే అతనికి వచ్చింది ఒక ఆలోచన.

'మనం ఒకసారి వాడిని దగ్గర్నించి చూసి వస్తే ఎలా ఉంటుంది?' క్షణంకూడా ఆగకుండా అడిగేశాడు.

'నాకు బోర్ కొట్టేసింది గంగూ... ఈ తగాదాలకి తలపట్లకి దూరంగా ఎటైనా వెళ్ళిపోవాలని ఉంది' సిగరెట్‌పొగ గుండెలనిండా పీల్చుకుని బయటికి నెమ్మదిగా వదులుతూ అన్నాడు షాడో.

'నువ్వు ఏదంటే అదే కరెక్టు. అలాగే వెళ్ళిపోదాం. సముద్రం దగ్గరికిపోయి మొట్టమొదటగా కనిపించిన బోటు లాగేసుకుని...' అంటూ మాటలు ఆపేశాడు గంగారాం.

ఏమిటని మాటలతో అడగలేదు షాడో. ఊరికే తలతిప్పి కనుబొమలు ఎగరేశాడు.

'ఈ హుహుగాడికిచెందిన బోట్లే చాలాఎక్కువగా ఉంటాయట. పొరపాటున మనం పట్టుకున్న బోటుగనుక వాడిదే అయితే, మనం ఎంతవద్దనుకున్నా మన వెనకాలే ప్రత్యక్షం అయిపోతారు వాడి చంచాలు. దాదాపు రెండువేలమంది దాకా ఉన్నట్టే.' ఆ సిటీలోకి ఎంటర్ అయిన వెంటనే తను సేకరించిన సమాచారం గుర్తు చేసుకుంటూ చెప్పాడు గంగారాం.

కామ్‌గా తల ఊపి ముందుకు అడుగువేశాడు షాడో.

'ఎక్కడికి? ఎక్కడికి గురు?' అతని మనసులో ఏముందో తెలుసుకోవటానికి ప్రయత్నం చేస్తూ అడిగాడు గంగారాం.

నెమ్మదిగా కదిలిన షాడో, ఉన్నట్లుండి పెంచాడు తన అడుగులవేగం. రెండు క్షణాల్లో పరిగెత్తుతున్నట్టుగా తోచింది గంగారాంకి.

'ఆగు గురూ... ఆగు. నేను కూడా వస్తున్నా" అంటూ తానుకూడా పరుగు మొదలుపెట్టబోయి సడన్‌గా ఆగిపోయాడు.

వారిద్దరూ నిలబడిన ప్రదేశానికి వందగజాల దూరంలో ఉన్నాయి మార్కెట్‌యార్డ్‌లో కూలి పనులు చేసుకుని బ్రతికే వారి చెక్కల కట్టడాలు.

ఉన్నట్లుండి ఆ కట్టడాలముందు ప్రత్యక్షమయ్యారు పాతికమంది వ్యక్తులు. ఎరుపు నీలం రంగులు కలగలిసిన దుస్తులు ధరించి ఉన్నారు అందరూ. నడుములమీద చేతులు వేసుకుని పెద్ద పెద్ద కంఠాలతో ఎవరినో ఉద్దేశించి అరుస్తున్నారు.

ఆ అరుపులు మొదలుకాగానే కట్టడాల్లోనుంచి బయటికి వచ్చేశారు చాలామంది స్త్రీలు. భయం భయంగా చూస్తున్న తమ పిల్లల్ని తమ వెనుక దాచుకున్నారు కొందరు తల్లులు. పాలు తాగే తమ పసిబిడ్డలు ఆ వ్యక్తులకు కనిపించకుండా పక్కకు తిరిగి నిలబడ్డారు మరికొందరు.

వేగంగా వస్తున్న షాడోని గమనించారు ఆ స్త్రీలలో కొందరు వృద్ధ వనితలు. వెనక్కి వెళ్ళి పొమ్మన్నట్టు హడావుడిగా చేతులు ఊపారు. తలలు అడ్డం తిప్పారు.

శరీరంలో ఉన్న శక్తినంతా పాదాల్లోకి తెచ్చుకుని, వేగంగా పరిగెత్తే అలవాటు తప్పిపోయిందని అనిపించింది రెండుక్షణాల తరువాత కదిలిన గంగారాంకి.

'లాభం లేదు గురూ. మన మంత్రశక్తులన్నీ బూజుపట్టి పనికిరాకుండా పోతున్నాయి. వెంటనే ప్రాక్టీసు మొదలుపెట్టకపోతే చాలా ఇబ్బంది' అంటూ వచ్చి షాడో వెనక నిలబడ్డాడు.

'ఎవడ్రా నువ్వు?' శుద్ధమైన కాంటొనీస్‌లో చాలా రఫ్‌గా షాడోని అడిగాడు నడుములమీద చేతులు వేసుకుని రంకెలు పెడుతున్న వారిలో ఒక మనిషి.

సూటిగా సమాధానం చెప్పలేదు షాడో. అక్కడ జరుగుతున్నదేమిటో తెలుసుకోవటానికి వచ్చినట్టు తల ఊపాడు.

'వెళ్ళిపో, నీవాళ్ళు తిన్నగా ఉండాలన్న కోరిక గనుక ఉంటే అర్జంట్‌గా అవతలికి పారిపో' ఖంగుమంటున్న కంఠంతో హెచ్చరించాడు ఆ మనిషి.

షాడో రియాక్ట్ కాలేదు. చిటికెలో ముంచుకు వచ్చేసింది కోపం గంగారాంకి.

**(ఇంకా వుంది)**




నాకు తెలుసు
పాదరసం కుదురుగా ఒక చోట ఉండదని
నీటి బొట్టునై ఎంతగా అల్లాడుతున్నా
తామరాకు తనలో నిలుపుకోదని

## కెరలిన గాయం

*నేనొక తీరని దాహాన్నై*
*ఎండమావుల్లో అలమటిస్తూ*
*మండే గుండె చిరుదివ్వె సాయంతో*
*శిధిల నిశీథిలో నీ కోసం వెదకుతూ...*
*సుదీర్ఘ ప్రయాణంలో*
*జీవితాన్ని ఒక అన్వేషణగా ఎగరేసి*
*లేని మజిలీల కోసం ప్రయాసపడుతూ...*
*ఈ క్షణం రేపటిలోకి ప్రవహిస్తుందో లేదో*
*నిద్ర బహిష్కరించిన కనుపాపలలో*
*కలల కువకువలుంటాయో లేదో*
*నా శ్వాసకు శ్వాసవైన నువ్వు*
*ఇంకో శరీరానివన్న భ్రమలో*
*నాలోంచి నిన్ను నువ్వు చీల్చుకోవడం*

కనీసం చీల్చుకుంటున్నట్టు అనుకోవడం
నిన్ను ఉయ్యాల లూగిస్తున్న అసలైన భ్రమ
సమాజంలోకి బొట్లు బొట్లుగా
నిన్ను నువ్వు వొంపుకుంటూ
ప్రపంచ బాధగా విస్తరిస్తున్న నిన్ను
నా ఆదిమ వాంఛకు కట్టి పడేయలేను
నెత్తురోడుతున్న గతం క్షణాలలో



గాయాలతో అలమటించుకోవడం నేర్చుకున్నాక
ఇప్పుడు నువ్వో కొత్త గాయపు క్షణాన్ని
నా జీవితంలోకి విసిరేస్తే
క్షణంమీద క్షణాన్ని పేర్చుకుంటూ
కట్టుకుంటున్న రేపటి భవనం
కొత్తగా శిథిలమయ్యేదేముందని....?

**—డాక్టర్ దిలావర్**
**సెల్: 98669 23294**




**అగ్నిగోళాల్లాంటి కళ్ళతో చూస్తూ, వేసవిగాడ్పుల్లా నిట్టూరుస్తున్న, యోజనం మేర గల కొండ చిలువను గమనించి, గోపాలురు భయపడ్డారు. ధైర్యం కూడగట్టుకునేందుకు ఒకరినొకరు గట్టిగా పట్టుకున్నారు. ఎంతపెద్దపామో! చూడడానికే భయంగా ఉంది అనుకున్నారు. అంతలోనే మహామహా రాక్షసులనే మట్టుబెట్టిన కృష్ణుడు అండగా ఉండగా మనకి భయం దేనికి? తలచుకుంటే ఈ పామెంత? దీని బతుకెంత? కృష్ణుడు దీని అంతు చూస్తాడనుకున్నారు. అనుకోవడమే ఆలస్యం, కేకేసి కృష్ణుడికి అదిగదిగో అంటూ కొండచిలువను చూపించారు. కృష్ణుడు తోడుగా ఉండడంతో, ధైర్యసాహసాలు పుంజుకున్నారు. దొరికిన రాళ్ళను విసురుతూ, కొమ్మలతో మోదుతూ కొండచిలువను ఎదుర్కొన్నారు.**

కొండచిలువను అలా గోపాలురు ఎదుర్కొన్న డాన్ని కృష్ణుడు ఆనందించి, ఆలోచనలోపడ్డాడు. తను అండగా ఉన్నానన్న ధైర్యంతో పామును ఎదుర్కొంటు న్నారుగాని, అది పాముకాదని రాక్షసుడు అని

# శ్రీకృష్ణమాయ:బ్రహ్మదేవుని గర్వభంగం

తెలిస్తే స్నేహితులేం కావాలి? ప్రమాదం కోరి తెచ్చు కుంటున్నారు అనుకున్నాడు కృష్ణుడు. ఆగండాగండి అంటూ వారించబోయాడు. అంతలోనే సమయం మించిపోయింది. ఆ భయంకర సర్పం గోవులు, లేగలు సహా గోపాలురందరినీ ఒక్కగుక్కలో పొట్టన బెట్టు కుంది. అందరినీ మింగేసింది. ఆకాశంలోని దేవ తలు ఇది గమనించారు. హాహాకారాలు చేశారు. దేవ తల హాహాకారాలు విని, స్నేహితుల అదృశ్యాన్ని చూసి ఖిన్నుడయ్యాడు కృష్ణుడు. ఆవులు, లేగలుసహా స్నేహితులంతా కొండచిలువపాలయ్యారు. తోడెవరూ లేరు. ఒంటరిగా ఇప్పుడు బృందావనానికి చేరు కుంటే... తల్లులు తారసపడి, కృష్ణా! నీతో పాటుగా వచ్చిన మా పిల్లలు ఏమయ్యారయ్యా? నువ్వొక్క డివే వచ్చావేమిటి? వాళ్ళేరి అంటే...సమాధానం ఏం చెప్పాలి? అటు బృందావనానికి పోలేను. ఇటు ఇక్కడ ఒంటరిగా నిలువలేను అనుకున్నాడు కృష్ణుడు. అనుకుని గుండెలు నిండా ధైర్యం నింపుకుని, కొండచిలువ నోటిలోనికి ప్రవేశించాడు. కంఠద్వారం దగ్గర నిలిచాడు. కడుపులో కకావికలవుతున్న ఆల మందనీ, స్నేహితుల్నీ చూసి అధైర్యపడకండన్నట్టుగా కళ్ళతోనే సైగలు చేశాడు. చేసి, కళ్ళు మూసుకు న్నాడు. శరీరాన్ని విపరీతంగా పెంచాడు. కృష్ణుని శరీరం పెరుగుతున్న కొద్దీ కొండచిలువకు ఊపిరాడ కుండా పోయింది. చనిపోతానేమోనన్న భయం కలిగింది. ఆ భయం నిజమైంది. ప్రాణాలు పోయేం దుకు దారి లేకపోవడంతో, అవి చిలువ శరీరాన్ని చీల్చుకుని బయటపడ్డాయి. పెనుశబ్దంతో పాము పగిలిపోయింది. ఎప్పుడైతే పాము పగిలిపోయిందో

అప్పుడు స్వస్వరూపంతో రాక్షసుడు బయటపడ్డాడు. చీరుకుపోయిన శరీరాన్ని చూసుకుంటూ, బాధ తట్టుకోలేక పెద్దగా అరుస్తూ నేల మీద దొర్లిదొర్లి ప్రాణాలు విడిచాడు. ప్రాణాలు కోల్పోయిన రాక్ష సుని శరీరం నుంచి గోవులనూ, లేగలనూ, గోపాలు రనూ జాగ్రత్తగా బయటకు తీసుకుని వచ్చాడు కృష్ణుడు. రక్తం అంటిన శరీరాలను చెరువులో స్నానం చేసి శుద్ధి చేసుకోమన్నాడు. సరేనని పరిగెత్తారువారు. వారు అటు వెళ్ళగానే రాక్షసుని మృతశరీరం నుండి ఒక వెలుగు వెలువడింది. వెలువడి, అది తిన్నగా కృష్ణుని శరీరంలో ప్రవేశించింది. అదృశ్యమైంది.

కృష్ణా అని పిలిచినంతనే సాయుజ్యాన్ని కలి గించే దేవదేవుడు, కబళించేందుకు ప్రయత్నించిన

**కృష్ణుడు ఒకరోజు స్నేహితులతో ఆటపాటల్లో మునిగిపోయాడు. అడవిలోకి వెళ్ళిన లేగలు ఎంతకీ తిరిగిరాలేదు. మిత్రబృందాన్ని ఒకచోటనిలిపి ఆలమందల్ని వెతుకుతూ అడవిలో పరుగుదీస్తున్న కృష్ణుణ్ణి పైనుండి చూశాడు బ్రహ్మదేవుడు. కృష్ణుణ్ణి ఆటపట్టించాలను కుని లేగల్నీ, గోపాలురనూ అదృశ్యం చేశాడు. వారిని ఒక గుహలో బంధించి మాయాపాశబద్ధుల్ని చేశాడు. అలా ఏడాది గడిచిపోయింది. ఈ లోపు ఏం జరిగింది? కృష్ణుడేం చేశాడు?**

రాక్షసునికి మాత్రం ఆ అవకాశాన్ని ఎందుకు ఈయడు? ఇచ్చాడు. అది చూసి సిద్ధులు జయజయ ధ్వానాలు చేశారు. దేవతలు పుష్పవర్షం కురిపించారు. అప్సరసలు నాట్యం చేశారు.

కొద్దిరోజులు గడిచాయి.

ఒకరోజు పసిమిపచ్చికబీళ్ళలో ఆలమందలు, స్నేహితులసహా ఆడుకుని, కృష్ణుడు విశ్రాంతి తీసు కుంటున్న వేళ...కొన్ని లేగలు అటుగా ఒత్తుగా పెరి గిన పచ్చికబయళ్ళను చూసి, పరిగెత్తాయి. తిన్నగా అడవిలోనికి దారి తీశాయి. చూశాడది కృష్ణుడు. స్నేహితులు కూడా గమనించారది. అయినా పెద్దగా పట్టించుకోక ఆటపాటల్లో పడ్డారు. చాలాసేపు గడి పారలా. అప్పటికి లేగలింకా తిరిగి రాలేదు. అప్పుడు అన్నాడిలా కృష్ణుడు.

మేతకు అడవికి వెళ్ళి లేగలింకా రాలేదు. క్రూర మృగాలపాలబడ్డాయేమో అనుమానంగా ఉంది. వెళ్ళి చూసి వస్తాను, లేగల్ని వెంటబెట్టుకుని వస్తాను. మీరిక్కడే జాగ్రత్తగా ఉండండి. నేను వచ్చే వరకూ ఎవరూ ఎక్కడికీ కదలవద్దు.

సరేనన్నది మిత్రబృందం. వారికి దూరంగా అటు అడవిలోనికి కృష్ణుడు బయల్దేరాడు. నల్లనల్లని జుల పాలు ఎగురుతోంటే, మెడలో ముత్యాలహారాలు చిక్కుపడుతోంటే, శీర్షంపై నెమలిపింఛం తరలిపోతోంటే, బంగారుబెత్తాన్ని చేతితో గట్టిగా పట్టుకుని పరుగు పరుగున వచ్చి అరణ్యమధ్యంలో ఆగాడు కృష్ణుడు.

ఆలమందలజాడలు గుర్తించాడు. ఇదిగో ఇక్కడ లేగలు పచ్చిక మేశాయి. ఇదిగో ఇక్కడ ఈ సెల యేటిలో లేగలు నీళ్ళు తాగాయి. ఇదిగిదిగో ఇక్కడ విశ్రమించాయి అనుకుంటూ కృష్ణుడు మరింత ముందుకు సాగాడు. పరుగుదీశాడు.

పరుగుదీస్తున్న కృష్ణుణ్ణి చూశాడు పైనుండి బ్రహ్మదేవుడు. అనుకున్నాడిలా.

పసివాడు. అయినా అఘాసురుడు కబళించిన ఆలమందనీ, మిత్రబృందాన్నీ కాపాడాడు. కృష్ణుడికి ఎక్కడిదీ ధైర్యం? ఆశ్చర్యంగా ఉంది. ఈ బాలుణ్ణి ఆటపట్టించాలి. అంతుతేల్చాలి అనుకున్నాడు.

అనుకున్నదే తడవు అడవిలో ఓ మూల మేస్తున్న లేగలనీ, కృష్ణుడు తనకోసం వేచి ఉండమన్న చోట ఉన్న గోపాలురనీ అదృశ్యం చేశాడు బ్రహ్మదేవుడు. లేగలసహాగోపాలురందరినీ ఎవరూ గుర్తించనచోట దాచి ఉంచాడు. కృష్ణుడికి లేగలు దొరకవు. అలాగే మిత్రబృందం కూడా కనిపించదు. మిత్రులూ, లేగలూ లేని కృష్ణుడు ఒంటరిగా బృందావని ఎలా చేరుకుం టాడు? తమాషా చూడాల్సిందే అనుకున్నాడు బ్రహ్మ.

పరుగుదీసి వచ్చిన కృష్ణునికి లేగలు కనిపించ లేదు. తన ఆలోచన ప్రకారం లేగలు అక్కడ ఉండాలి. లేవు. ఏమై ఉంటాయి? వెనుతిరిగి వచ్చాడు. ఉండా ల్సిన చోట స్నేహితులు కూడా లేరు. ఏమయ్యారు? దీర్ఘంగా ఆలోచించాడు కృష్ణుడు. అప్పుడతనికి బ్రహ్మ దేవుని ఆలోచన అవగతం అయింది. తనని ఆటపట్టిం చాలని బ్రహ్మదేవునికి ఎందుకు అనిపించింది? ఎందుకు ఈ దుష్కృత్యానికి పాల్పడ్డాడు? అతడు అదృశ్యం చేసిన లేగలనూ, స్నేహితులనూ తాను



సాధించలేడా? నిమిషంలో సాధించగలడు. కాని, బ్రహ్మదేవునికి బ్రహ్మానందం కలిగించాలనుకున్నాడు కృష్ణుడు. అనుకుని, ఇలా ఆలోచించాడు. మాయమైన లేగలూ, స్నేహితులరూపంలో తానే బృందావనికి చేరుకుంటాడు. గోపికలను అలరిస్తాననుకున్నాడు. అనుకున్న మరుక్షణం కృష్ణుడు ఆయా లేగలుగానూ, గోపాలురుగానూ రూపొందాడు. లేగలను తోలుకుంటూ, గోపాలురుగా బృందావనానికి చేరుకున్నాడు. అదిగో ఇల్లంటే ఇదిగో ఇక్కడ ఆ ఇంటి లేగల్నీ, గోపాలుడునీ ఉంచి, తల్లిదండ్రులను పిలుస్తున్నట్టుగా పిల్లనగ్రోవిని ఊదసాగాడు.

పిల్లలు వచ్చారు. పిల్లంగ్రోవిని ఊదుతున్నారు. పిలుస్తున్నారు అనుకుని తల్లిదండ్రులంతా పరుగున ఇళ్ళల్లోంచి బయటికి వచ్చారు. ఎవరి పిల్లలనూ, లేగలనూ వారు తీసుకుని పోయారు. స్నానాలు చేయించారు. వెచ్చని దుస్తులు ధరింపజేశారు. ఎక్కడెక్కడ తిరిగారు? అడవిలో అనుభవాలు ఏమిటి? అని అడిగి తెలుసుకున్నారు. తన తల్లిదండ్రులదగ్గర ఏ పిల్లాడు ఎలా ప్రవర్తిస్తాడో అలాగే ఆ రూపంలో ఉన్న కృష్ణుడు ప్రవర్తించాడు. ఎవరికీ ఎలాంటి అనుమానాన్నీ కలుగనీయలేదు. అలాగే లేగల రూపంలో ఉన్న కృష్ణుడు, ఆయా గోవులముందు 'ఇది నా బిడ్డే' అన్నంతగా మసలి, ఆ గోవుల మురిపాలు అందుకున్నాడు. పాలిస్తే కడుపునిండా తాగాడు. ఎన్నడూ లేనిది ఇటు గోపికలకూ, అటు ఆవులకూ ఆనాడు తమతమ బిడ్డలపై ఎనలేని మక్కువ కలిగింది.

ఒకపక్క గోపాలురగానూ, మరోపక్క లేగలగానూ ఉండి, ఇంకో పక్క స్వస్వరూపంతో సాక్షాత్కరించి, అన్నిటినీ, అందరినీ కాపాడుకుంటూ రాసాగాడు కృష్ణుడు. అలా అయిదారుదినాలు తక్కువగా ఓ ఏడాది గడచిపోయింది. రోజురోజుకూ లేగలంటే ఆవులకీ, గోపాలురంటే తల్లులకీ విపరీతంగా అభిమానాలు పెరగసాగాయి. ఒకనాడు బలరాముడు లేగలు, స్నేహితులుసహా అరణ్యానికి బయల్దేరాడు. గోవర్ధన పర్వతశిఖర సమీపంలో లేగల్ని మేతకి వదలి, మిత్రులతో ఆటల్లోపడ్డాడు. అక్కడ ఆ సరికే ఉన్న ఆలమందలు లేగల్ని చూడగానే ఉప్పొంగుతున్న వాత్సల్యంతో తోకలను ఎత్తుకుని మరీ పరిగెత్తి వచ్చాయి. మధ్యలో ఉన్న సెలయేళ్ళను అవలీలగా లంఘించాయి. లేగలను చేరుకుని వాటికి కడుపునిండా పాలిచ్చి సంతోషించాయి. వారించేందుకు బలరాముడూ, అతని మిత్రబృందం ఎంతగానో ప్రయత్నించింది. వారి వల్ల కాలేదు. ఆశ్చర్యపోయారంతా. ఇంతలో అక్కడికి చేరుకున్న గోపాలుర తల్లిదండ్రులు పిల్లలను దగ్గరగా తీసుకుని, వారి ముఖానికి పట్టిన చెమటను తుడిచి, లేగలను మేపింది చాలు! ఇంటికి పదండంటూ పిల్లలనూ, లేగలనూ తీసుకుని ఇంటిదారిపట్టారు. ఎన్నడూ లేని విధంగా పిల్లలను పదేపదే ముద్దుచేయసాగారు. గమనించాడది బలరాముడు. ఆశ్చర్యపోయాడు. ఆలోచనలో మునిగిపోయాడు. లేగలన్నీ ఏనాడో పాలు మానివేశాయి. అయినా గోవులు వాటికి పాలిచ్చి, మురిసిపోయాయి. అదలించినా బెదిరించినా లేగలను వీడి పోలేదవి. అలాగే పిల్లలంటే గోపికలకి ఇంత ప్రేమ ఎక్కడిది? ప్రేమలేదని కాదు, పిల్లలంటే పిచ్చిప్రేమ కనబరుస్తున్నారు. అదే వింతగా ఉన్నది. గోపాలురను ఎవరిని చూసినా వారి ముఖంలో కృష్ణుడే కనిపిస్తున్నాడు. అలాగే లేగల్లో కూడా కృష్ణుడే కానవస్తున్నాడు. అంటే...ఇదంతా నల్లనయ్య మాయకాదుగదా? అనుకున్నాడు బలరాముడు. అనుకోవడమేకాదు, ఆ విషయాన్ని సాక్షాత్తు కృష్ణునిముందే వెలిబుచ్చాడు.

కృష్ణా! ఇంతకుముందు పల్లెలో గోపాలురను చూస్తే వారంతా దేవతలుగానూ, లేగలను చూస్తే అవన్నీ ఋషీశ్వరులుగానూ నాకు కనిపించేవి. ఇప్పుడు వారలా కనిపించడం లేదు. అన్నీ అందరూ నీలా కనిపిస్తున్నారు. ఏమిటి మాయ? అడిగాడు. సమాధానంగా ముందు నవ్వాడు కృష్ణుడు. తర్వాత జరిగిన వృత్తాంతం అంతా అన్నకి తెలిపాడు. బ్రహ్మదేవుడి ఆనందాన్ని అడ్డుకోకూడదని ఆగుతున్నాను అన్నాడు అంతలోనే!

ఏడాది గడచింది. అంటే బ్రహ్మదేవుడి కాలమానంలో ఒక్క త్రుటికాలం గడచింది. గడచిన కాలాన్ని దృష్టిలో పెట్టుకుని, బృందావనిలో నడయాడుతున్న లేగలనీ, గోపాలురనీ గమనించి విస్తుపోయాడు బ్రహ్మ. అనుకున్నాడిలా.

లేగల్నీ, గోపాలురనీ అదృశ్యం చేసి, అందరినీ గుహలో దాచిపెట్టాను. మాయాపాశబద్ధుల్ని చేశాను. అంతా గాఢనిద్రలో ఉన్నారు. వారలా ఉంటే ఇక్కడ వీరెవ్వరు? సృష్టికర్తను నేనే కదా? వీరెవరినీ నేను సృష్టించలేదు. మరి వీరంతా ఎక్కడివారు? ఏమిటిదంతా? అని అయోమయానికి గురయ్యాడు. నడయాడుతున్న గోపాలురను పట్టిపట్టి చూడసాగాడు. అలా చూస్తే వారంతా వెలిగిపోతూ కనిపించారు. నీలమేఘశ్యాములయినారు. హారాలతో, కిరీటాలతో, కుండలాలతో కనువిందు చేశారు. శంఖాలతో, చక్రాలతో, గదలతో, కమలాలతో ప్రకాశించారు. అపాదమస్తకం తులసీదళమాలికలతో నిండిపోయారు. పట్టువస్త్రాలతో, చిరునవ్వులతో సాక్షాత్తు శ్రీమన్నారాయణుల్లా కానవచ్చారు. కోటిసూర్యప్రభలతో తేజరిల్లారు. దిగ్భ్రాంతికి గురయ్యాడు బ్రహ్మదేవుడు. నిశ్చేష్టుడయ్యాడు.

అవాక్కయి ఉన్న బ్రహ్మను చూసి సన్నగా నవ్వుకున్నాడు కృష్ణుడు. తర్వాత అనుకున్నాడిలా.

చిన్నపిల్లాడిలా అమాయకంగా తానే స్రష్టననుకున్నాడు దేవుడు. మైమరచి, మదించి నా మహిమ తెలుసుకోవాలనుకున్నాడు. తెలుసుకోగలిగాడా? అసాధ్యం అనుకున్నాడు కృష్ణుడు. మాయావిజృంభణాన్ని విరమించాడు. తోటిగోపకుమారులసహా స్వకీయరూపం స్వీకరించాడు. ఆసరికి బ్రహ్మదేవుడు కూడా విభ్రాంతి నుండి తేరుకున్నాడు. తేరుకుని, గోపాలురతో ఆడుకుంటున్న కృష్ణుణ్ణి చూశాడు. వెన్నముద్దలు తింటూ, పెరుగుముద్దలు తినిపించుకుంటూ, లేగల వెనుక పరుగుదీస్తున్న కృష్ణుణ్ణి చూసి చేతులు జోడించి నమస్కరించాడు. వాహనాన్ని నేలకు దించి, కిందికి దిగి, పరుగున కృష్ణుణ్ణి చేరుకున్నాడు. అతని పాదాలపైబడి శరణువేడాడు.

—అరణి



# హారర్ సినిమాలు చూడండి..
# బరువు తగ్గండి!

**అధిక బరువు తగ్గడానికి చాలామంది చాలారకాల ప్రయత్నాలు చేస్తుంటారు. కొందరు తినే ఆహారం తగ్గించుకుంటారు. మరికొందరు వ్యాయామాలు చేస్తూ సన్నబడడానికి ప్రయత్నిస్తుంటారు. ఇంకొందరు రకరకాల మెడిసిన్స్ ఉపయోగిస్తుంటారు. డైటింగ్, వ్యాయామాలు వీటన్నింటి ద్వారా బరువు తగ్గుతారు కానీ ఇవన్నీ శ్రమతో కూడుకున్నవి. అలాకాకుండా, ఎంచక్కా ఇంట్లో టీవీముందు కూర్చుని సినిమాచూస్తూ బరువు తగ్గితే ఎలా ఉంటుంది! అబ్బ! ఎంత బాగుంటుందో కదా! అయినా సినిమా చూస్తూ కూర్చుంటే ఇంకా లావు అవుతాంగానీ బరువు ఎలా తగ్గుతాం అనుకుంటున్నారా?**

డైటింగ్, శారీరక వ్యాయామాలే కాదు హర్రర్ సినిమాలు కూడా బరువు తగ్గడానికి సహాయపడతాయని పరిశోధకులు తేల్చి చెబుతున్నారు.

అదేంటి! హర్రర్ సినిమాలుచూస్తే బరువు ఎలా తగ్గుతారు? అనుకోవద్దు. కూర్చుని తింటే కొండలైనా కరుగుతాయన్నట్లు జస్ట్ కూర్చుని హర్రర్ సినిమాలు చూస్తే చాలట, శరీరంలో కొండలా పేరుకుపోయిన కొవ్వు కొంచెం కొంచెం కరిగి పోతుందని పరిశోధకులు ఇటీవల నిర్ధారించారు. మరి ఏ ఏ హర్రర్ సినిమాలు చూడడం ద్వారా ఎన్ని కేలరీలు బరువు తగ్గవచ్చో, అసలు అలా ఎందుకు తగ్గుతామో తెలుసుకోండి మరి!

## హర్రర్ సినిమా చూస్తే అరగంట నడిచినట్టే!

హర్రర్ సినిమాలు చూడడంవల్ల శరీరం ఏవిధంగా ప్రభావితం అవుతుందనే అంశంపై యూనివర్సిటీ ఆఫ్ వెస్ట్‌మినిస్టర్ పరిశోధకులు కొందరు, డాక్టర్ రిచర్డ్ మెకన్జీ ఆధ్వర్యంలో దయ్యాల సినిమాలు అమితంగా ఇష్టపడే కొందరు వ్యక్తులపై పరిశోధనలు చేశారు. సినిమా సమయంలో వారు శ్వాస తీసుకునే స్థాయి, గుండె కొట్టుకునే వేగం, ఊపిరితిత్తుల ద్వారా వారు బయటకు విడుదల చేసే కార్బన్‌డయాక్సైడ్ పరిమాణం మొదలైన అంశాలను పరిశీలించారు. సగటున గంటన్నరపాటు హర్రర్ సినిమా వీక్షిస్తే 113 కేలరీలు ఖర్చవుతాయని ఈ పరిశోధనలో వెల్లడైంది. ఈ కేలరీల సంఖ్య రోజూ మనం అరగంట నడిస్తే ఎన్ని కేలరీలు ఖర్చవుతాయో దానితో సమానం.

## హర్రరంటే ఒబేసిటీకి టెర్రర్

హర్రర్ సినిమాలంటే ఒబేసిటీకి టెర్రర్ పుడుతుంది! అదెలాగంటే, దయ్యాల సినిమాలు చూడడం వల్ల ఊపిరితిత్తుల ద్వారా మనం ఆక్సిజన్ పీల్చుకునే స్థాయి పెరిగి గుండె వేగంగా కొట్టుకుంటుంది. ఎందుకంటే ఆ సినిమాల్లో కనిపించే దృశ్యాలు శరీరంలో ఉత్కంఠ రేపుతాయి కాబట్టి. ఈసమయంలో నాడీవేగం పెరిగి శరీరంలో రక్తం చాలా వేగంగా ప్రవహిస్తుంది. ఆ సమయంలో శరీరంలో కొవ్వును కరిగించే రకరకాల హార్మోన్లు ఉత్పత్తి అవుతాయి. దాని ద్వారా బిఎమ్ఎన్ (బేసల్ మెటబాలిక్ రేట్) పెరిగి శరీరంలో కొవ్వు కరిగిపోతూ ఉంటుంది. ఆ సమయంలోనే ఆకలి వేస్తున్న ఫీలింగ్ కలుగుతుంది. ఎందుకంటే ఆ సినిమాలో భయానక దృశ్యాలు చూడడంతో భయం వల్ల శరీరం ఒత్తిడికి గురవుతుంది. అందువల్లనే ఈ హార్మోన్లు ఉత్పత్తి అవుతాయి. మామూలుగా మనం చేసే రెగ్యులర్ వ్యాయామాల ద్వారా కూడా ఈరకమైన ఒత్తిడే కలిగి బాడీ టెంపరేచర్ పెరిగి హార్మోన్లు ఉత్పత్తి అవుతాయి. దయ్యాల సినిమాలు చూడడం ద్వారా కూడా అదే రకమైన ఒత్తిడి కలుగుతుంది.

## హర్రర్ ఎంత ఎక్కువుంటే అంత బెటర్

శరీరంలో కొవ్వును కరిగించే హార్మోన్లు ఉత్పత్తి అవడం అనేది ఆ సినిమాపై ఆధారపడి ఉంటుంది. అంటే ఎక్కువ భయానకంగా ఉండే సినిమాలు చూస్తే ఎక్కువ కేలరీలు, తక్కువ భయానకంగా



ఉండే సినిమాలు చూస్తే తక్కువ కేలరీలు ఖర్చవుతాయి. అయితే కేలరీలు ఖర్చవుతాయి కదా అని అదేపనిగా వాటిని చూడటం కూడా మంచిది కాదంటున్నారు పరిశోధకులు. వారంలో ఒకటి నుంచి మూడు సినిమాలు మాత్రమే చూడాలని, ఎక్కువ చూడడం వల్ల గుండె కొట్టుకునే వేగం మరీ ఎక్కువ పెరిగితే గుండెజబ్బులు వచ్చే అవకాశాలున్నాయని చెబుతున్నారు. వారంలో ఒకటి నుంచి మూడు సినిమాలు చూడడంవల్ల శరీరంలో 15శాతం వరకు కొవ్వును కరిగించుకోవచ్చని పరిశోధకులు చెబుతున్నారు. ఎవరికైతే వర్కవుట్స్ అంటే ఇష్టం ఉండదో వారికి ఈ పద్ధతి చాలా ఉపయోగకరం అని పరిశీలకులు చెబుతున్నారు.

### ఈ సినిమాలు చూడండి!

ఎలాంటి సినిమాలు చూస్తే ఎన్ని కేలరీలు తగ్గుతాయనే విషయంపై పరిశోధకులు ఒక పది సినిమాల పేర్లు కూడా సూచించారు. ఆ సినిమాలు చూస్తే ఎన్ని కేలరీలు ఖర్చయ్యాయనే విషయాలను కూడా వారు వెల్లడించారు. మరి ఆ పది సినిమాల లిస్ట్ ఏంటో తెలుసుకోండి. కుదిరితే మీరూ వాటిని చూడడానికి ప్రయత్నించి మీ బరువు తగ్గించుకోండి.

**ది షైనింగ్:** ఇది 1980లో విడుదలైన బ్రిటీష్ అమెరికన్ సైకలాజికల్ హర్రర్ మూవీ. ఈసినిమా దర్శకుడు స్టాన్లీ కుబ్రిక్. 1977లో విడుదలైన స్టీఫెన్ కింగ్ నవల 'ద షైనింగ్' ఆధారంగా ఈ సినిమా తీశారు. విడుదలైన కొద్ది రోజుల్లోనే ఘనవిజయం సాధించిన చిత్రం. అత్యంత భయానక సన్నివేశాలతో నిర్మించిన 144 నిమిషాల నిడివిగల చిత్రమిది. ఈ సినిమా చూడడంవల్ల మనకు 184 కేలరీలు కరుగుతాయి.

**జాస్:** 1975లో విడుదలైన ఈ చిత్ర దర్శకుడు స్టీవెన్ స్పీల్‌బర్గ్. 1974లో పీటర్ బెన్చలీ రాసిన జాస్ నవల ఆధారంగా ఈ సినిమా నిర్మించారు. ఆ నవల పేరునే ఈచిత్రానికి పెట్టడం జరిగింది. ఒళ్లు గగుర్పొడిచే సన్నివేశాలతో నిర్మించిన ఈ చిత్రం చూడడం వల్ల బాడీలో 161 కేలరీలను ఖర్చుపెట్టవచ్చు.

**ది ఎగ్జార్సిస్ట్:** ది ఎగ్జార్సిస్ట్ 1973వ సంవత్సరంలో విడుదలైన సూపర్ నాచురల్ హర్రర్ సినిమా. 1971లో విలియం పీటర్ బ్లాటీ రాసిన 'ది ఎగ్జార్సిస్ట్' నవల ఆధారంగా ఈ సినిమా నిర్మించారు. ఆ బుక్ రాసిన రచయిత 1949లో రోలాండ్ డోయ్ రాసిన ఎగ్జార్సిసమ్ నవల ఆధారంగా ది ఎగ్జార్సిస్ట్ నవలను బ్లాటీ రాశాడు. ఈసినిమాలో ఇద్దరు మతపెద్దల సహాయంతో ఒక తల్లి, పన్నెండేళ్ళ తన కూతురును ఆత్మలబాధ నుంచి ఏవిధంగా రక్షించుకుందనే అంశం చుట్టూ ఈ సినిమా కథ నడుస్తుంది. ఉత్కంఠ కలిగించే ఈ సినిమా చూడడం ద్వారా శరీరంలో 158 కేలరీల వరకు తగ్గించుకోవచ్చని పరిశోధనల్లో తేలింది.

**ఏలియన్:** ఇది బ్రిటీష్ – అమెరికన్ సైన్స్ ఫిక్షన్ హర్రర్ సినిమా. 1979లో విడుదలైన ఈ సినిమా ఘన విజయం సాధించింది. ఈ చిత్ర దర్శకుడు రిడ్లీ స్కాట్. ఓ గ్రహాంతరవాసి భూగ్రహవాసులను ఎలా చంపాడు, చివరికి అతన్ని భూగ్రహవాసులు ఏవిధంగా అంతం చేశారనే అంశంతో చిత్ర కథ నడుస్తుంది. సైన్స్, హర్రర్ రెండింటినీ మేళవించి తీసిన ఈ సినిమా చూస్తే మన శరీరంలో 152 కేలరీలను బర్న్ చేయవచ్చు.

**సా:** 2004లో విడుదలైన ఈ సినిమా దర్శకుడు జేమ్స్ వాన్. 2003లో అతనే ఈ సినిమా కాన్సెప్ట్‌తో షార్ట్‌ఫిల్మ్ కూడా తీశాడు. ఒక బాత్‌రూమ్‌లో ఇద్దరు వ్యక్తులు – ఒక ఆత్మ మధ్య జరిగిన కథే సా. ఒక వ్యక్తి మరో వ్యక్తిని చంపకపోతే వారి కుటుంబాన్ని నాశనం చేస్తానని ఆ ఆత్మ చెబుతుంది. ఆ సమయంలో ఆ ఇద్దరు వ్యక్తులు ఏం చేశారు, ఎలా ఆత్మ అంతం అయింది అనే అంశంపై కథ నడుస్తుంది. ఈసినిమాని సిరీస్ లాగా కూడా విడుదల చేశారు. బాక్సాఫీస్ వద్ద భారీ విజయం సాధించిన ఈ చిత్రాన్ని చూస్తే శరీరంలో 133 కేలరీలు తగ్గుతాయి.

**నైట్మేర్ ఆన్ ఎల్మ్ స్ట్రీట్ :** 2010లో విడుదలైన హర్రర్ చిత్రం నైట్మేర్ ఆన్ ఎల్మ్ స్ట్రీట్. శామ్యూల్ బేయర్ ఈ చిత్ర దర్శకుడు. 1984లో వెస్ క్రావెన్ నిర్మించిన ఈ చిత్రాన్ని 2010లో రీమేక్ చేశారు. తమ కలలను సాధించుకోవడానికి వెళ్ళిన కొందరు టీనేజర్స్‌ని ఒక వ్యక్తి ఏవిధంగా ఇబ్బందులపాలు చేశాడు, వారు అతన్ని ఏవిధంగా ఎదిరించారు అనే అంశంపై కథ నడుస్తుంది. ఈ చిత్రాన్ని చూస్తే శరీరంలో 118 కేలరీలు కరుగుతాయి.

**పారానార్మల్ ఆక్టివిటీ:** 2007లో విడుదలైన ఈ చిత్రానికి ఓరెన్ పెలి దర్శకత్వం వహించాడు. ఇద్దరు భాగస్వాములను ఒక ఆత్మ ఎలా హత్య చేసిందనే కథాంశమే ఈ చిత్రం. ఈ సినిమాలో కెమెరా పనితనం చాలా బాగుంటుంది. ఆ ఇంట్లో జరిగే దృశ్యాలు భయానకంగా ఉంటాయి. 86 నిమిషాల నిడివి గల ఈ చిత్రాన్ని చూస్తే 111 కేలరీలు ఖర్చవుతాయి.

**ది వెస్టీ బ్లెయిర్ విచ్ ప్రాజెక్ట్:** 1999లో విడుదలైన ఈ అమెరికన్ సైకలాజికల్ హర్రర్ సినిమాకి డేనియల్ మైరిక్, ఎడ్వార్డో సాన్చెజ్ అనే ఇద్దరు దర్శకత్వం, కథ సమకూర్చారు. ఫిల్మ్ మేకింగ్ కోర్స్ చదువుకుంటున్న ముగ్గురు విద్యార్థులు ఒక ప్రదేశంలో ఏవిధంగా అదృశ్యమయ్యారనే అంశంపై చిత్ర కథ నడుస్తుంది. క్షణక్షణానికి సస్పెన్స్‌ని కలిగించే ఈ సినిమా చూస్తే 105 కేలరీలు తగ్గుతాయని పరిశోధకులు తేల్చేశారు.

–విజేత

### మహిళలకే ఎక్కువ!

ఈ హర్రర్ మూవీస్ చూడడంవల్ల మగవారికి, ఆడవారికి ఖర్చయ్యే కాలరీల సంఖ్యలో



కూడా చాలా తేడా ఉంటుంది. ఎందుకంటే దయ్యాల సినిమాలు చూసే సమయంలో మగవారితో పోలిస్తే మహిళలు భిన్నంగా రియాక్ట్ అవుతారు. వారు మరింత భయాందోళన, ఉత్కంఠకు గురవుతుంటారు. అందువల్ల వారికి ఇంకా ఎక్కువ కేలరీలు తగ్గే అవకాశం ఉంది.

## బరువు తగ్గాలంటే?

1. బరువు తగ్గాలంటే త్వరగా జీర్ణమయ్యే ఆహారం, కొవ్వు తక్కువగా ఉండే ఆహారం తీసుకోవాలి. అన్ని పూటలా భోజనానికి బదులు ఏదో ఒక సమయంలో ఆకుకూరలతో, కూరగాయలతో చేసిన సలాడ్ తీసుకోవాలి. ఆహారాన్ని బాగా నమిలి మింగాలి.
2. నిద్రలేచిన గంటలోపే బ్రేక్‌ఫాస్ట్ పూర్తి చేయాలి. ఆలస్యంగా తింటే రెండు భోజనాల మధ్య సమయం తగ్గి కొవ్వు పెరుగుతుంది.
3. రోజూ పాల ఉత్పత్తులు ఎంతో కొంత పరిమాణంలో తీసుకోవాలి. వీటిలోని కాల్షియం కొవ్వుని కొంత మేరకు తగ్గించగలదు.
4. భోజనానికి ముందు నారింజ లాంటి నిమ్మజాతి పండు సగం తింటే బరువు తగ్గుతారని పరిశోధనల్లో తెలిసింది.
5. వ్యాయామం చేశాక 30 నుంచి 60 నిమిషాలలోపు భోజనం చేయడం అలవాటు చేసుకోవాలి. కొత్తగా చేరే కేలరీలను శరీరం అలసిపోయినప్పుడు వెంటనే ఉపయోగించుకుంటుంది.



# ఎదలోతుల్లో...

-కె.కె.భాగ్యశ్రీ

**వేధిస్తున్న అధికారిని చెప్పుతో సత్కరించిన మహిళ పదేపదే టీవీలో ప్రసారమవుతున్న వార్త చూసి ఒక్కసారిగా నవ్వింది హైందవి.**

**అక్కడే సోఫాలో కూర్చుని జాజిపూలమాల అల్లుతున్న జాహ్నవి "ఎందుకే ఆ నవ్వు?" అంటూ ఆసక్తిగా అడిగింది.**

గుత్తంగా కూర్చిన జాజిపూల మాలను చిన్న కత్తెరతో కత్తిరించి, ఓ ముక్క హైందవి తలలో తురిమి, తానూ అలంకరించుకుంది జాహ్నవి. అప్పుడప్పుడే సన్నసన్నగా విచ్చుకుంటున్న జాజుల సువాసన అందమైన ఆ సాయంసంధ్యను మరింత పరిమళభరితం చేస్తోంది.

జాహ్నవి కూడా తన దృష్టిని టీవీకేసి మళ్ళిస్తూ కిందన పదేపదే స్క్రోల్ అవుతున్న ఆ వార్త చూసి "ఇందులో నవ్వేందుకేముందే! స్త్రీలు సమాజంలో ఇంతటి హీనస్థితిలో ఉన్నందుకు సిగ్గుపడాల్సింది పోయి... అయినా ఆవిడెవరోగానీ ఆఫీసులో అధికారికి మాబాగా బుద్ధి చెప్పిందిలే!" అంది కాస్త ఆశ్చర్యం, ఇంకాస్త సంతోషం కలగలిపి.

ప్రస్తుత సమాజంలో ఉద్యోగస్థులైన ఆడవాళ్లు, పైఅధికారులు, సహోద్యోగుల వలన లైంగిక వేధింపులకు గురవుతున్నారు. మహిళా ఉద్యోగులు అంతులేని మానసిక వేదనకు లోనవుతున్నారనే ఇలాంటి వార్తలు తరచుగా వింటున్నవే. ఎవరికీ చెప్పుకోలేని మూగబాధతో, ఆ వికృతచేష్టలను పెదవి విప్పకుండా భరించేవారు కొందరైతే, ధైర్యంతో తిరగబడేవారు ఇంకొందరు. ఇందాక టీవీలో చూపించినట్టు వాళ్ళకి బుద్ధిచెప్పే మహిళలు మరికొందరు.

చాలామంది కామాంధులు తమకున్న అధికార వనరులను దుర్వినియోగం చేస్తూ, స్త్రీని భోగవస్తువుగా భావించి ఇలాంటి అరాచకాలకు పాల్పడుతూనే ఉన్నారు. తమ డేగ కన్నుతో ఇలాంటి ప్రబుద్ధులను మీడియా పసిగట్టి ఎండగడుతున్నాసరే, చేసేవాళ్ళు చేస్తూనే ఉన్నారు. జాహ్నవి ఆలోచనలు ఇలా నేలజారిన పాదరసంలా చురుకుగా పరుగులు తీస్తుంటే, గొంతు సవరించుకుంది హైందవి. "నిజానికి నేను నవ్విన కారణం వేరు జానూ, తనని హెరాస్ చేసినవాడిని అంత ధైర్యంగా నాలుగు తన్నినందుకు ఆవిడ సాహసాన్ని అభినందించాలి. అదలా ఉంచితే, ఇలా బాహ్య ప్రపంచం దృష్టికి వస్తున్నది ఒక పార్శ్వం మాత్రమే. పబ్లిక్ ప్లేసుల్లోనూ, ఇళ్లలోనూ ఇలాంటి భయంకర అనుభవాలు ఎదుర్కొంటున్నవారి సంగతేమిటి? వయసుతో సంబంధం లేకుండా చాలా మంది స్త్రీలు ఎదుర్కొంటున్న సామాజిక సమస్య ఇది.

అలాంటివాళ్ళు బయటకు రాకుండా ఉండిపోతున్నారన్న ఆవేదనతోనే అలా నవ్వాను. కన్నతల్లికి కూడా చూపించడానికి సిగ్గుపడుతూ, ఎంతో పదిలంగా కాపాడుకునే ఈ శరీరాన్ని ఇష్టమొచ్చినచోట, ఇష్టమొచ్చిన రీతిలో తాకి, పైశాచికానందం పొందే అలాంటి మగాళ్లని ఏంచేసినా పాపం లేదు. అసలు ఆ హక్కు వాళ్ళకి ఎవరిచ్చారు?" ఆక్రోశంతో ఆమె గుండెలు ఎగసిపడ్డాయి.

ఆమె యాతన అర్థం చేసుకున్న దానిలా హైందవి భుజం తట్టింది జాహ్నవి. "నువ్వు అన్నది నిజమే. అలా బాధపడేవారికి తమని తాము రక్షించుకునే అవకాశం ఉంటుందిగానీ, ఉద్యోగినులకు మాత్రం ఆ వెసులుబాటు ఉండదు. ఉద్యోగం చేస్తేగానీ ఇల్లు గడవని పరిస్థితుల్లో ఆఫీసుకెళ్ళే ఆడది ఈ రకమైన వేధింపులు భరిస్తూ ఎంతకాలం పని చేయగలదు చెప్పు! మింగలేక కక్కలేక ఆమె పడే అవస్థ ఎంత దారుణంగా ఉంటుందో కదా!" జాలిగా అంది.

"నేను చెప్పినవాళ్ళ పరిస్థితి కూడా అంతే దారుణంగా ఉంటుంది. అది అనుభవించినవారికిగానీ తెలియదు" కొంచెం ఆవేశంగానే అంది హైందవి.

"కావచ్చు, కాని వారి సంఖ్య తక్కువ అంటున్నాను. ఇంటిపట్టునే ఉంటూ గృహిణీధర్మం నిర్వర్తించే వారిని, తల్లిదండ్రుల సంరక్షణలో ఎదిగే అమ్మాయిల్ని



వేధించే ధైర్యం ఎవరికి ఉంటుంది? ఒకవేళ వేధించినా పట్టుబడకుండా ఉంటారా?" హైందవి అంతగా ఎందుకు ఆవేశపడుతోందో అర్థంకాక అడిగింది జాహ్నవి.

"ఆc పట్టుబడకుండా ఆడపిల్లల్ని వేధించే ప్రబుద్ధులు చాలామందే ఉంటారు. వాళ్ళు పక్కింట్లోనే ఉంటూ చాపకిందనీరులా మాయచేసే అంకుల్స్ కావచ్చు, అతి బుద్ధిమంతుడిలా నటిస్తూ పెద్దల దగ్గర మార్కులు కొట్టేసే ఎదురింటి స్టూడెంటు కుర్రాడు కావచ్చు, ఇంట్లో ఏళ్ళ తరబడి తిష్ట వేసుకుని కూర్చున్న దూరపు బంధువు కావచ్చు, లేదా అక్కమొగుడైనా కావచ్చు, ఆఖరుకి స్నేహితురాలి భర్తైనా కావచ్చు.

ముక్కుపచ్చలారని పసిపాపలపై కూడా అత్యాచారం చేస్తున్న కామాంధుల గురించి మనం వింటూనే ఉన్నాం కదా!" చేతిలోని రిమోట్‌తో టీవీ ఛానల్ మారుస్తూ అంది హైందవి.

ఆఖరుమాట వింటూనే ఉలికిపడింది జాహ్నవి. దాన్ని గమనించలేదు హైందవి.

"అందరి సంగతీసరే, అంత బల్లగుద్ది మరీ చెబుతున్నావు, నీకిలాంటి అనుభవం ఎప్పుడైనా ఎక్కడైనా ఎదురైందా?" కాస్త సర్దుకున్న జాహ్నవి అడిగింది.

హైందవి అదోలా నవ్వి "వదిలేయ్" అంది.

"వీల్లేదు, చెప్పాల్సిందే" అంది పట్టుదలగా.

"అనేగా చెప్పేది!" కాస్త చిరాగ్గా అంది హైందవి.

జాహ్నవి గుండె గుబిల్లుమంది. ముఖంలోని రక్తం అంతా ఎవరో పనిగట్టుకుని తోడేసినట్టు పాలి

**బాల్యంనుండి ప్రియ నెచ్చెలులు వాళ్ళిద్దరూ. చదువయ్యాక బావను పెళ్ళిచేసుకుని స్థిరపడిందా స్నేహితురాలు. కళ్ళు చెదిరే అందమున్న ఆమె నెచ్చెలిమాత్రం ఇంకా పెళ్ళి చేసుకోలేదు. వీకెండ్ రాకపోకలతో స్నేహం కొనసాగిస్తోంది ఆ నెచ్చెలి. టీవీలో కనిపించిన ఒక వార్తచుట్టూ యథాలాపంగా సాగిన వారి మధ్య సంభాషణ స్నేహితురాలి హృదయంలో కల్లోలం రేపింది. ఆ కల్లోలానికి కారణమైన నెచ్చెలి చివరకు ఏం చేసింది?**

పోయింది. పెదవులు ఏదో తెలియని బాధతో వణికాయి.

"నిజమా!" కంపించే స్వరంతో ప్రశ్నించింది మళ్ళీ.

"అబ్బా జానూ నిజమేనంటున్నాగా! ఇక్కడితో ఈ టాపిక్ వదిలేద్దాం. బాగా ఆకలిగా ఉంది. తినడానికేమన్నా పెట్టు" నవ్వుతూ అడిగింది హైందవి.

జాహ్నవి మాత్రం నవ్వలేకపోయింది. ఆమె చెప్పిన విషయాన్ని అంత తేలికగా తీసుకోలేకపోయింది. హైందవి ఈ రకమైన వేధింపులకు గురైందని ఇది వరకెన్నడూ వినలేదు. ఇవాళ కొత్తగా తెలుస్తుంటే ఒళ్లు గగుర్పొడుస్తోంది.

'ఎవరు? హైందవినలా అల్లరి పెట్టిందెవరు? అసలు ఆ వేధింపుల్ని తనెలా తట్టుకోగలిగింది' ఎన్నో ప్రశ్నలు జాహ్నవి మస్తిష్కంలో గిర్రున తిరగసాగాయి.

అంతవరకు చక్కగా దరహాసం చిందిస్తూ సరదాగా గడిపిన జాహ్నవి అలా ముఖం మాడ్చుకుని, ఆలోచనా సముద్రంలో మునిగిపోవడం గమనించిన హైందవి ఆమె భుజం పట్టి కుదుపుతూ "అబ్బా జానూ, ఇంకా అదే మూడ్‌లో ఉన్నావా! నేనేదో క్యాజువల్‌గా అన్నానులే. ఆత్మారాముడొకటే గోలెడుతున్నాడు, తినడానికేమన్నా పడెయ్... ఇంత కూరుంటేయమ్మో... ఇంత పప్పుంటేయమ్మో!" అంటూ బాబూమోహన్‌లా అభినయించింది.

తన ఉద్విగ్నతను కాసేపు మరచిన జాహ్నవి కిలకిల నవ్వింది.

"హమ్మయ్య ముత్యాలు రాలాయి మొత్తానికి" నెచ్చెలి చెక్కిలిపై సుతారంగా చుంబించింది హైందవి.

***

చిన్నప్పటి నుంచి ప్రాణంగా మెలిగిన నెచ్చెలులు జాహ్నవి, హైందవి. ఇద్దరివీ పక్కపక్క ఇళ్ళే. జాహ్నవి మ్యూజిక్‌లో ఎం.ఎ. చేసి మేనత్త కొడుకు జితేంద్రను పెళ్ళి చేసుకుంది. వాళ్ళకో బాబు.

హైందవి బి.టెక్ పూర్తిచేసింది. బెంగళూర్‌లోని ఓ ప్రముఖ సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తున్న హైందవికి ఇంకా పెళ్ళి కాలేదు. కాలేదు అనడంకన్నా చేసుకోలేదు అనడం సబబేమో! జాహ్నవి వాళ్ళు ఉండేది అనంతపురంలో కాబట్టి అప్పుడప్పుడు వీకెండ్స్‌లో వాళ్ళదగ్గరకు వచ్చి సరదాగా గడిపేసి వెళ్ళిపోతుంది హైందవి.

ఈసారీ అలాగే వచ్చిందిగానీ, ఎప్పటిలా తన నవ్వులు, అల్లరి పంచిచ్చి వాళ్ళని అలరించి, వాళ్ల ఆత్మీయ ఆతిథ్యం స్వీకరించి వెళ్ళలేదామె. ప్రియ సఖి మదిని కలవరపరిచి, ఆమె హృదయాన్ని ముక్కలు చేసే బాంబులాంటి వార్తచెప్పి, ఆమె గుండెల్లో ఆరని అగ్ని రగిల్చి మరీ వెళ్ళింది.

ఆమె వెళ్ళిన దగ్గరనుంచీ జాహ్నవి మనసు మనసులో లేదు. అన్నం సహించడం లేదు. నిద్ర పట్టడంలేదు. అనుక్షణం హైందవి మాటలు గుర్తు తెచ్చుకుంటూ కుంగిపోసాగింది.

ఎవరు? తన హైందవిని లైంగిక వేధింపులకి గురిచేసిందెవరు?

ఊహ తెలిసిన దగ్గర్నుంచి తమింట్లోనే ఉంటూ, తమ కుటుంబంలో ఒకడుగా కలిసిపోయి, ఇటీవలే మరణించిన తల్లికి దూరపు బంధువు భద్రం మామయ్యా!

అయ్యో! తనకేమైంది? తనను, తనతోపాటు హైందవిని కూడా స్వంతబిడ్డలా సాకుతూ, భుజాల మీద ఎత్తుకుపెంచిన భద్రంమామయ్య గురించి అలా తలపోయడం తనకు తగదు.

మరెవరికి ఇలాంటి దుర్బుద్ధి పుట్టినట్టు! ఆమె తలపుల్లో ఎదురింటి విస్సు అంకుల్, పక్కింటి పరంధామ్, ఇంకా అనేకానేకమంది భయంకర చిత్రాల్లా కదలాడుతున్నారు.

ఉన్నట్లుండి ఆరోజు హైందవి అన్న ఇంకోమాట జ్ఞాపకమొచ్చింది. "ఆఖరుకి స్నేహితురాలి మొగుడన్నా కావచ్చునని." అసలే దానిది కళ్ళుచెదిరే అందం. ఒకవేళ జీతూ మనసు చలించి అతడే... మరి ముందుకు వెళ్ళి ఆలోచించలేకపోయింది జాహ్నవి.

తన ప్రాణనాథుడు అలా ప్రవర్తించి ఉంటాడన్న ఆలోచనకే చేదుమాత్ర మింగినట్టు తయారైంది జాహ్నవి మనసు.

'ఛ ఛ! బావ అలాంటివాడు కాదు. తానంటే అపరిమితమైన అనురాగం. హైందవిపట్ల అపార గౌరవం. అతడేకనక హైందవితో మిస్ బిహేవ్ చేసుంటే హైందవి ఈనాడు ఇంత స్వతంత్రంగా తమ ఇంటికి వచ్చుండేది కాదు. మరి జీతూబావ కూడా కానిపక్షంలో ఇంకెవరై ఉంటారు?'.

'ఏమిటో! శ్రీమతిగారు అంతలా ఆలోచిస్తున్నారు?' అప్పుడే ఆఫీసునుంచి వచ్చిన జితేంద్ర అడిగాడు అర్ధాంగి సరసన కూర్చుంటూ.

ఉలికిపడి అతడి కళ్ళలోకి చూసింది జాహ్నవి. ఆమె మీద అతడికి గల ప్రేమను ప్రతిబింబించే నిలువుటద్దాల్లా ఉన్నాయి అతడి కళ్ళు. అతడిని శంకించలేక అలాగని తన మనసును నమిలేస్తున్న అనుమాన పిశాచాన్ని పారద్రోలలేక తనలో తనే నలిగిపోయింది జాహ్నవి.

తన ముఖంలోని భావాలు కనబడకుండా జాగ్రత్త పడుతూ, "ఉండండి.. కాఫీ కలిపి తెస్తా" అంది జాహ్నవి.

"ఏమిటో, జానూ ఈ మధ్య డల్‌గా తయారైంది" అనుకున్నాడు జితేంద్ర లోలోపలే.

***

"జానీ...జానమ్మా.." ఏదో సినిమాపాట ట్యూన్‌లో

## ముద్దు ఫీలింగ్ కలగలేదట!



టాలీవుడ్‌లో అవకాశాలు రాక బాలీవుడ్ బాట పట్టిన కృతి కర్బందాకు అక్కడ కూడా పెద్దగా ఛాన్స్‌లు రావడం లేదు. ఆ మధ్య 'రాజ్ రీబూట్'లో హీరో ఇమ్రాన్ హష్మితో ముద్దు సన్నివేశాలు చేసినా ఫలితం నిల్. సినిమాలో ఈ సన్నివేశాల గురించి ఇటీవల ఓ ఇంటర్వ్యూలో కృతి మాట్లాడింది. ముద్దు సన్నివేశాలు ఉంటాయన్న విషయం తనకు ముందే తెలుసట! అయితే ఆ సన్నివేశాలలో నటించినా ఇమ్రాన్ తనను ముద్దు పెట్టుకున్న ఫీలింగ్ కలగలేదని చెప్పింది. సన్నివేశాలు అలా వచ్చాయి కనుక చేశాను అంటూ ముక్తాయింపు ఇచ్చింది.

హమ్ చేస్తూ తలుపుతీసిన జాహ్నవిని సుడిగాలిలా చుట్టేయబోయిన హైందవి ఆగిపోయింది ఒక్కసారిగా.

కళాకాంతి కోల్పోయిన వదనంతో, నీరసంగా పీడలు కొట్టేలావున్న స్నేహితురాలి ఆకారం గమనించి విస్తుపోయింది.

క్రితంసారి తానొచ్చి వెళ్ళినప్పటికీ ఇప్పటికీ ఎంత మార్పు!

ఆప్యాయంగా ఆమెను కౌగలించుకుంటూ "ఏంటిరా జానూ, ఇలా అయిపోయావు? ఒంట్లో బాగా లేదా!" అడిగింది హైందవి.

"అబ్బే! నాకేమైంది? నేను బాగానే ఉన్నానే" బలవంతాన నవ్వింది జాహ్నవి.

"ఏంబాగో ఏమో! నెలరోజులుగా ఇదే వాలకం. మనిషి మూడీగా తయారైంది. నాతోటీ, రాహుల్ తోటీ సరదాగా గడపడమే మానేసింది" భార్య ప్రవర్తన గురించి ఫిర్యాదు చేశాడు జితేంద్ర.

అవతారం దాల్చి, జితేంద్ర దగ్గరకు వెళ్ళబోయింది జాహ్నవి దూకుడుగా.

కంగారుగా ఆమె చేయి పట్టి ఆపుతూ "ఆగాగు, అంతపని మాత్రం చేయకు. నాతో మిస్ బిహేవ్ చేసినది జీతూకాదు" చెప్పింది హైందవి నెమ్మదిగా.

"మరెవరు చెప్పు? మనింటి పక్కన విస్సూ అంకులా! లేకపోతే యశోదాంటీ కొడుకు మురారా? ఎవరు? ఎవరు?" హిస్టీరిగ్గా అరిచింది జాహ్నవి.

పిచ్చిపట్టిన దానిలా కేకలుపెడుతున్న ఆమెవైఖరి బీతిగొలిపింది హైందవికి. ముందు వెనక ఆలోచించకుండా తానన్న ఆమాట ఆమె మనసులో ఎంతటి తుఫాను రేపిందీ! ఛ! ఆ విషయం దీనితో ప్రస్తావించకుండా ఉండాల్సింది.

ఆనాటి తన తొందరపాటుకి మనసులోనే చింతిస్తూ 'అబ్బబ్బ, వీళ్లెవరూ కాదు జానూ మన భద్రం మామయ్య లేడూ... ఆయన" తలదించుకుని తగ్గు స్వరంలో చెప్పింది హైందవి.




"ఏ నీ" అంటూ ఆలోచనలో పడింది హైందవి. ఆనాడు అనాలోచితంగా తానుపెట్టిన మాటల మందుపాతర పేలడానికి సిద్ధంగా ఉందని ఊహించిన ఆమె నిశ్చేష్టురాలైంది.

తరువాత జాహ్నవి ఒంటరిగా దొరికినప్పుడు అడిగింది, "ఆ రోజు నేను యథాలాపంగా అన్న మాటలు నువ్వు మనసుకి పట్టించుకున్నావు కదూ! ఊరకే తమాషాకి అన్నాను జానూ, దాన్ని నువ్వింత సీరియస్‌గా తీసుకుంటావని అస్సలు అనుకోలేదు" సంజాయిషీలా చెప్పింది హైందవి.

"ఏ ఆడపిల్లా తమాషాకి కూడా ఇలాంటి సిచ్యుయేషన్ ఫేస్ చేశానని అబద్ధం చెప్పదు. నిజం చెప్పు, నిన్ను హెరాస్ చేసింది జీతూబావేకదూ!" అడిగింది జాహ్నవి ఆత్రుతగా.

"అబ్బబ్బ, ఏమిటి జానూ అంతలా పీకుతున్నావు, వదిలేయమన్నాగా! ప్లీజ్" విసుగు తొంగిచూసింది హైందవి మాటల్లో.

"నువ్వలా దాటవేస్తే నా అనుమానం మరింత బలపడుతోంది. నిన్ను అలా అల్లరి పెట్టింది జీతూయేనని కన్ఫర్మ్ చేసుకుంటున్నాను. ఉండు, నీతో అలా బిహేవ్ చేసేందుకు జీతూకి మనసెలా వచ్చిందో కడిగి పారేస్తాను" ఆవేశంలో అపరకాళిక

ఆశ్చర్యంతో జాహ్నవి కళ్ళు పెద్దవైనాయి. ఏదో అపనమ్మకం వదనంలో చోటు చేసుకుంది.

"నిజమా! విస్మయంగా ప్రశ్నించింది.

ఔనన్నట్టు తలూపింది హైందవి. అంతే, జాహ్నవి ముఖంలో అలుముకున్న ఉద్వేగఛాయలు కాస్త కాస్తగా తొలగిపోసాగాయి. వదనం ప్రశాంతంగా మారింది.

"ఎవరూ! మన భద్రం మామయ్యా!? దగ్గర దగ్గర నాన్నగారి వయసుంటుంది. ఆయనకిదేం పాడుబుద్ధి! కూతురిలాంటి నీ పట్ల అనుచితంగా ప్రవర్తించిన పాపానికి చిన్నవయసులోనే గుండె ఆగి చచ్చాడులే" కసిగా అంది జాహ్నవి.

"శాపనార్థాలు పెట్టడమెందుకులే. ఆయన పాపానికి ఆయనే పోయాడు. మనం ఊహించలేం కానీ, వయసులో పెద్దవాళ్ళై పైకి మర్యాదగా కనిపించే మహానుభావులకే ఇలాంటి పెడబుద్ధులు పుడతాయి. అయిందేదో అయింది. నామీద దయుంచి ఇక ఈ విషయం నీ బుర్రలోంచి తుడిచి పారేస్తే సంతోషిస్తాను" రెండుచేతులూ జోడించి జాహ్నవిని వేడుకుంది హైందవి.

"డౌట్ క్లియర్ అయింది కదా! ఇంక అంతా హ్యాపీసే" చాలారోజుల తరువాత మనస్ఫూర్తిగా

నవ్వింది జాహ్నవి. గుండెలనిండుగా, నిశ్చింతగా గాలి పీల్చుకుంది హైందవి.

"థాంక్స్ హైందవీ, ఇన్నాళ్ళకు నీ ప్రియ స్నేహితురాలి ముఖంలో ఆనందం చూశాను. ఏం మంత్రం వేశావేమిటి?" వికసించిన వదనంతో కుతూహలంగా అడిగాడు జితేంద్ర.

"అది మాత్రం సస్పెన్స్" అంది హైందవి రాహుల్‌ని ముద్దాడుతూ.

***

ఆ మర్నాడు రాత్రి హైటెక్‌బస్‌లో బెంగుళూరు తిరిగి వెళ్తున్న హైందవి కళ్ళు మూసుకుని అనుకుంది బాధగా.

"ఈ పాపాత్మురాలిని క్షమించు మామయ్యా. దిద్దుకోలేని ఘోర అపరాధం చేశాను. ఎప్పుడో చిన్నతనంలో నాకెదురైన చేదు అనుభవాన్ని మాటల మధ్య జానూతో అనేశాను. యవ్వనంలో ఉండే చాపల్యం కొద్దీ నాతో ఆకతాయితనంగా ప్రవర్తించింది జీతూయేనని జానూతో చెప్పలేక ఆ నేరం నీపై మోపాను.

తాను చేసిన పాడుపని జీతూ మరచిపోయినా నేను మరవలేకున్నాను. అలాగని జానూ స్నేహాన్ని దూరం చేసుకోలేక సతమతమవుతున్నాను. నా తొందరపాటు మాటల వలన జానూ తన భర్తపై అనుమానం పెంచుకుంది. ఆ విషయం నేరుగా అతన్ని అడగలేక, అలాగని తనలోతనే మనస్సులో మథన పడలేక హింస అనుభవిస్తున్న జానూతో అసలు విషయం ఇదీ అని చెప్పేస్తే ఇంకేమైనా ఉందా!

అమృతభాండంలాంటి ఆమె పచ్చనిసంసారం చేజారి ముక్కలైపోదూ!

ఇంకెవరిమీదనో నేరం నెట్టేసి ఈ ఉపద్రవం నుంచి గట్టెక్కవచ్చు. అలా చేసి మరింతపాపం మూట గట్టుకోలేను. ఏం చేయాలో తోచని సంకటస్థితిలో జానూ మనసునెలా ఊరడించాలో తెలియని సంకట పరిస్థితిలో చచ్చి స్వర్గానున్న నువ్వు జ్ఞప్తికొచ్చావు. మరో మార్గాంతరం లేక నీపైనే నిందమోపి నిన్ను దోషిని చేశాను. దీనివలన జానూకి నీమీద ద్వేషం పెరుగుతుందని తెలుసు. నిన్ను అసహ్యించుకుంటుందని తెలుసు.

కానీ నువ్వు దేవుడివి. సామాన్య మానవుడి రాగద్వేషాలు నిన్నేమీ చేయలేనంత ఎత్తుకి ఎగిరి పోయావు. అందుకే ఈ దుశ్చర్యలకి పాల్పడింది నువ్వేనని జానూతోచెప్పి ఘోర పాపానికి పూనుకున్నాను.

నా గుండెబరువు దించుకుని. ఆ భారం జానూ నెత్తిమీదికి బదలాయించడం ఇష్టంలేక దేముడిలాంటి నీపై నింద వేశాను. నా పాపానికి నిష్కృతిలేదు. ఎన్ని గంగల్లో మునిగినా నాకు ప్రాయశ్చిత్తం జరగదు. నన్ను క్షమించు మామయ్యా, క్షమించు".

సీట్లో వెనక్కివాలి కూర్చున్న హైందవి హృదయాన్ని అలముకున్న కల్మషాన్ని కడిగేస్తున్నట్లుగా, ఆమె చేసిన మహాపాపం ప్రక్షాళన కావించబడినట్లుగా ఆమె కళ్ళల్లో నుంచి నులివెచ్చని బాష్ప ధారలు జలజల ప్రవహించి ఆమె బుగ్గల మీదుగా కిందికి జారి ఎదలోతుల్లో ఇంకిపోయాయి.

***సెల్: 80967 38953***

**బతుకునావ నడిపించడానికి ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొనక తప్పదు. బిజినెస్ మాగ్నెట్ అయినా, ఎద్దునాడించే గంగిరెద్దులవాడు అయినా జీవన ప్రయాణం సాగించాల్సిందే! మార్గంలో ఎదురయ్యే ఆటుపోట్లు తట్టుకుని తీరం చేరాల్సిందే! అలా తీరం చేరుకున్న ఒక్కొక్కరిదీ ఒక్కో గాథ! అలాంటి గాథల సమాహారమే ఈ జీవనతరంగాలు!**




# నా బతుకంతా కొబ్బరే!

కొత్త శీర్షిక ప్రారంభం

వేసవికాలం వేడిమి నుంచి ఉపశమనం కొబ్బరిబొండాం. తక్షణశక్తినిచ్చే కొబ్బరిబొండాలకు వేసవిలో మార్కెట్ విపరీతంగా ఉంటుంది. ఎక్కడ చూసినా కొబ్బరిబొండాం గెలలే కనిపిస్తాయి... ఆషాపులే దర్శనమిస్తాయి. ఆ కొబ్బరిబొండాలు అమ్ముకునే ఆచారి జీవిత గాథ ఈ వారం...

"ఇది జరిగి ఏడాది అయిందనుకుంటా! కోలాలు తాగితే కేన్సర్ వస్తుందండి.." ఆ మాటలు ఎవరన్నారా అని తలెత్తి చూశా. నేను తొలిసారి ఆచారిని చూసింది కూడా అప్పుడే! రోజుకు లక్షల కోలా బాటిల్స్ ఖాళీ అయ్యే హైదరాబాద్‌లో దానికి వ్యతిరేకంగా మాట్లాడే తన్మదీయుడు ఎవరా అని కొంత కుతూహలంతో చూశా. ఆచారి! మా అపార్ట్‌మెంట్ ముందే కొబ్బరిబొండాలు అమ్ముతూ ఉంటాడు. ప్రశాంతమైన మనిషి. తన షాపు ముందు అరగంట ట్రాఫిక్ జామ్ అయినా, షాపు పక్కనే వినాయకచవితి పందిరివేసి ఊరంతా వినిపించేలా పాటలు పెట్టినా ఎవరినీ పల్లెత్తు మాట అనని సాధు స్వభావి. మూడు నాలుగేళ్లుగా ప్రతిరోజూ ఆచారిని చూస్తున్నా. పరిచయం పెరిగింది మాత్రం ఈ వేసవిలోనే! "మన ఆంధ్రావైపు బొండాలు వేరండి. బెంగుళూరు బొండాలు వేరు. ఆంధ్ర బొండాలు మా ఊర్లో శేఖర్ గాడి టీ కొట్లో ఇడ్లెన్లలా ఉంటాయి. బెంగుళూరువి ఇరానీ కేఫ్‌లో బిస్కెట్లలా ఉంటాయి.." అని బొండాల్లో తేడాలు తొలిసారి వివరించింది ఆచారే! తనతో పరిచయం కూడా విచిత్రంగా జరిగింది. ఒకరోజు కారు ఆపి కూరలు కొంటుంటే "మన ఆంధ్రా బొండాలొచ్చాయమ్మా! ఒకటి తాగి వెళ్లండి" అని పిలిచాడు ఆచారి. ఆ పలుకుల్లో తన బొండాలు అమ్ముకోవాలనే ఆత్రుత కన్నా మనం ఒకే ప్రాంతం వాళ్లమనే ఆప్యాయత వినిపించింది. అతను చెప్పినట్లే ఆ కొబ్బరిబొండాం నీళ్లు చాలా తీయగా ఉన్నాయి. చిన్నప్పుడు పులేటుకుర్రు మా అమ్మమ్మ తోటలో బొండాంలా! ఆ మర్నాడు అప్రయత్నంగానే అతని షాపు ముందు నా కారు ఆపా! ఇక అక్కడినుంచి 'కొబ్బరిబొండాం తాగండమ్మా..' దగ్గర మొదలైన మా పరిచయం 'పిల్లలు పరీక్షలు ఎలా రాస్తున్నారమ్మా!' అని చనువుగా అడిగే దాకా పెరిగింది. హైదరాబాద్‌కు ఎక్కడెక్కడి నుంచి కొబ్బరిబొండాలు లారీలు లారీలుగా వస్తుంటాయి? ఎవరు సప్లై చేసిన బొండాలు తియ్యగా ఉంటాయి? ఎవరు మోసం చేస్తుంటారు? ఇలాంటివన్నీ నాకు వివరించి చెప్పింది ఆచారే. "అసలు కొబ్బరి నీళ్లను లీటర్లలో మొదట అమ్మింది నేనే.. ఆ తర్వాతే అందరూ మొదలుపెట్టారు. నేను ఎప్పుడూ ఎంగిలి బాటిల్స్‌లో కొబ్బరి నీరు అమ్మలేదు. మోండా బజార్ నుంచి కొత్త బాటిల్స్ కొనేవాడిని.." అని తన ఇన్నోవేషన్‌ను చెప్పేవాడు ఆచారి.

### ఆచారి కథ

ఆచారిది అమలాపురం పక్కన ఒక చిన్న పల్లెటూరు. పుట్టింది, పెరిగింది, జీవితం గడిపింది అంతా కొబ్బరితోటలోనే! పదేళ్లక్రితం వరకూ అతను కూడా ఓ రెండెకరాల ఆసామే! కూతురు పెళ్ళితో ఒక ఎకరం కరిగిపోయింది. కొడుకు దుబాయ్ ఉద్యోగ యాత్రకు మరో ఎకరం ఎగిరిపోయింది. "నా బతుకంతా కొబ్బరే! కానీ అన్నం తిన్న తర్వాత కొబ్బరినీళ్ల తాగలేం కదా" అనే ఆచారి జీవితం ఆ తర్వాత రకరకాల మలుపులు తిరిగింది. హైదరాబాద్ వస్తే నవాబులా బతకొచ్చని చాలామంది చెబుతుంటే విని ఆచారి కూడా హైదరాబాద్ వచ్చేశాడు. "అపార్ట్‌మెంట్‌లో వాచ్‌మెన్‌గా చేరితే దర్జాగా బతకవచ్చన్నారు.. మోండా మార్కెట్‌లో మేస్త్రీ అయితే బోల్డంత డబ్బన్నారు.. చివరకు తెలిసిన వాళ్ల క్లినిక్‌లో కాంపౌండర్‌గా చేరా. పేరుకు కాంపౌండరే కానీ మొత్తం క్లినిక్ పనులన్నీ నేనే చేయాల్సి వచ్చేది. మొదట్లో అంతా నాదే అనుకునేవాడిని. కానీ డాక్టర్ డాక్టరే! కాంపౌండర్ కాంపౌండరే! అని, అక్కడ ఏదీ నాది కాదని తెలిసేసరికి చాలా ఆలస్యమైపోయింది. ఆ తర్వాత క్లినిక్‌లో మానేసి, ఒక అపార్ట్‌మెంట్‌లో మేనేజర్‌గా చేరా! తెలిసున్న వాళ్ల పొలం కూడా కొద్దికాలం చూశా. కానీ ఎక్కడా కుదురుగా చేయలేదు. గౌరవం లేనిచోట ఉండటం చాలా కష్టం. కూలీలా చూస్తే తట్టుకోలేకపోయేవాడిని.." అంటాడు ఆచారి. ఒకవైపు అగౌరవం.. మరోవైపు ఊరికి దూరమయ్యాననే బాధ.. వీటికి తోడు పేదరికం... దాంతో భార్యను కొడుకు ఇంటికి పంపేశాడు. ఇక ఆఖరిగా ఆచారికి తెలిసిన వాళ్ల అపార్ట్‌మెంట్ కడుతుంటే ఎదురుగుండా కొబ్బరిబొండాల షాపు పెట్టాడు. దానిమీదే జీవితం వెళ్ళదీస్తున్నాడు.

### వాళ్ళ ఉసురు నాకెందుకు?

"కిళ్లీ షాపు పెట్టుకుంటే ఎక్కువ డబ్బులొస్తాయి కదా.. కొబ్బరిబొండాలొక్కటే అమ్మితే ఏం మిగులుతుంది?" అని ఒకసారి అడిగా. "ఇంతకు ముందయితే మా తోటలో బొండాలు మేస్త్రీకి అమ్మేవాడిని. ఇప్పుడు నేరుగా మీకే అమ్ముతున్నా. అయినా సిగరెట్లు, కోక్‌లు, గుట్కాలు అమ్మితే వచ్చే పాపపు సొమ్ము వద్దమ్మా.. అవి తాగి కేన్సర్ వచ్చి పోయిన వాళ్లనెంతమందినో చూశా. వాళ్లందరి ఉసురు నాకెందుకు?" అని ప్రశ్నించాడు. వెంటనే "కోలా తాగితే కేన్సర్ వస్తుందని ఎవరు చెప్పారు?" అని అడిగా! ఆచారి నాకేసి జాలిగా చూసి నవ్వి "చెట్టు నుంచి వచ్చినవే మంచివమ్మా! మనం తయారుచేసే వాటిలో కెమికల్స్ మోతాదే ఎక్కువ కదమ్మా... అన్నింట్లోనూ విషమే! నన్ను చూడండి ఈ వయస్సులో కూడా ఎంత బలంగా ఉన్నానో.. నువ్వు చూడు ఎలా ఉన్నావో? ఎందుకంటే నేను గంజి తాగుతా.. నువ్వు సూప్ తాగుతావు.." అన్నాడు. నాకు ఏం కౌంటర్ వేయాలో కూడా తెలియలేదు. ఆచారి ఎప్పుడూ తన దుకాణం వదిలి బయటకు వెళ్లినట్లు కనబడడు. ఒకసారి నీకు బంధువులు ఎవరూ లేరా? బెంగగా ఉండదా? అంటే ఒక్క క్షణం ఆగి "మీరందరూ ఉన్నారు కదమ్మా.." అన్నాడు. నాకేం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. నా కళ్లు నాకు తెలియకుండానే చెమర్చాయి! బహుశా మేమెవ్వరం నీకు లేము అని చెప్పలేని నిస్సహాయత వల్ల కూడా కళ్లు చెమర్చి ఉండచ్చు!



—సీత

email: fbackfm@gmail.com




కోటీర నగరం కోలాహలంగా ఉంది. ఉగాది పర్వంతో ప్రారంభమయ్యే వసంత నవరాత్రుల సందర్భంలో అనునిత్యమూ ఆ నగరం కోలాహలంగానే ఉంటుంది. పదవనాడు వసంత నవరాత్రుల సమాపనోత్సవ దినం. అది నగరవాసులకు మహాపర్వం.

శరన్నవరాత్రుల పదవనాడు 'విజయదశమి' అయితే, వసంత నవరాత్రుల పదవనాడు సుభిక్ష సామ్రాజ్యానికి 'వీరదశమి'. శతాబ్దాల క్రితం సుభిక్ష సామ్రాజ్య చక్రవర్తి రూపొందించి, ప్రారంభించిన పర్వం అది. తొమ్మిది దినాల పాటు రాజ్యంలోని యువయోధుల మధ్య యుద్ధ విద్యలలో స్పర్ధలు జరుగుతాయి. ఖడ్గ యుద్ధం, గదా యుద్ధం, ముష్టి యుద్ధం అనే ప్రధాన విద్యలలో జరిగే పోటీలలో వందలాది మంది పాల్గొంటారు. వీరదశమి అయిన పదవనాటికి మూడు ప్రక్రియల లోనూ విజేతలుగా ఇద్దరు యోధులు మిగులుతారు. ఖడ్గ యుద్ధంలో, గదా యుద్ధంలో, ముష్టి యుద్ధంలో ఆ ఇద్దరి మధ్య స్పర్ధ జరుగుతుంది. మూడింటిలో రెండు విన్యాసాలలో గెలిచిన యోధుడు వీరవిజేత; మూడింటిలోనూ గెలిచిన యోధుడు మహావీర విజేత. విజేతకు జ్ఞాపికలుగా స్వర్ణఖడ్గమూ, స్వర్ణగదా లభిస్తాయి. ఆకారంలో చిన్నవైనప్పటికీ విలువలో ఆ రెండూ చాలా పెద్దవే! ఆ జ్ఞాపికలకు తోడుగా పట్టువస్త్రాలు, బంగారు నాణేలు, నవరత్నాలు పొదిగిన 'వీర హారం', ముఖ్యంగా మహారాజుగారి ప్రాపకం లభిస్తాయి.

కొత్త సీరియల్ ప్రారంభం

నగరవాసులందరూ రాజమందిరం ముందున్న క్రీడాంగణంలో గుమిగూడారు. చిన్నా, పెద్దా, బీదా, బిక్కీ, ఆడా, మగా అందరూ నిర్దేశిత స్థలాల్లో కూర్చున్నారు. క్రీడాంగణానికి పడమటివైపు ఉన్నత ప్రదేశంమీద ఉన్న చలువరాతి మండపంలో మహారాజు నందికేశ్వరుడూ, మహారాణి శుభాంగీ కూర్చున్నారు. ఇద్దరి మధ్యా రాకుమారి ఉత్పల రాజకుటుంబానికి ఇరువైపులా మహామంత్రీ, రాజగురువూ, ఆస్థాన జ్యోతిష్యుడూ, ఇతర రాజోద్యోగులూ కూర్చున్నారు. గడచిన తొమ్మిదినాళ్ళ స్పర్ధలలో పాల్గొని, పరాజితులైపోయిన వందమందికి పైగా యువకులు ఒక వైపున వరుసగా కూర్చున్నారు.

క్రిక్కిరిసి కూర్చున్న ప్రేక్షకులు వీరదశమినాడు తమ యుద్ధవిద్యా నైపుణ్యాన్ని ప్రదర్శించబోయే

యోధుల రాకకోసం వేయికళ్ళతో ఎదురు చూస్తు న్నారు. ఉన్నట్టుండి ఢంకా మ్రోగ సాగింది. సుళ్ళు తిరగసాగిన ఆ భేరీనాదం రణగొణధ్వనుల్ని మ్రింగి వేసింది. భేరీనాదం యోధుల రంగప్రవేశ సూచిక. ప్రేక్షకులు కుడి, ఎడమలకు తలలు తిప్పుతూ చూస్తున్నారు. అంతిమస్పర్ధకు అర్హత సంపాదించు కున్న యువయోధులిద్దరూ కోటీర నగరవాసులే! ఒకరు 'కేసరి', మరొకరు 'నిధి'. ప్రేక్షకులలో సగం మంది కేసరి గెలుస్తాడనీ, సగం మంది నిధి గెలు స్తాడనీ పందేలు కాశారు. ఆ పందేలలో బంగారు నాణేలున్నాయి. బంగారు నగలున్నాయి. నవరత్నాలు ఉన్నాయి. గోవులున్నాయి. గుర్రాలున్నాయి. పుట్ల కొలతలతో ధాన్యముంది. పళ్ళతోటలూ, వ్యవసాయ భూములూ ఉన్నాయి.

రంగభూమిలోకి ప్రవేశిస్తున్న కేసరి ముందుగా అందరి దృష్టినీ ఆకర్షించాడు. రక్తవర్ణంలో ఉన్న ధోవతీ, అంగీ రెండూ అతని శరీరాన్ని రెండవ చర్మంలా అంటిపెట్టుకున్నాయి. నల్లరంగు దట్టీ అతని సన్నటి నడుమును చుట్టి ఉంది. శిరస్త్రాణం ధరించి ఉన్నాడతను. గిరజాల జుట్టు శిరస్త్రాణంలోంచి కొద్దిగా కనిపిస్తోంది. కేసరి నడకలో ఠీవి అడుగడుగునా ఒలికిపోతోంది. తనను చూస్తూ హర్షధ్వానాలు చేస్తున్న ప్రేక్షకులవైపు చేతిని ఊపి ముందుకు వస్తున్నాడతను.

అటువైపు నుండి రెండవ యోధుడు, నిధి రంగభూమివైపు వస్తున్నాడు. నిధి లేత నీలం రంగు ధోవతి ధరించాడు. ముదురు నీలం రంగు ఉత్తరీయాన్ని దట్టీ లాగా చుట్టుకున్నాడు. నడుము పైనుండి అతని శరీరం అనాచ్ఛాదితంగా ఉంది. కేసరిలాగా అతను శిరస్త్రాణం ధరించలేదు. వంకీలు తిరిగిన గిరజాల జుట్టు భుజాలమీద నాట్యం చేస్తోంది. ప్రేక్షకుల హర్షధ్వానాలను నిధి చిరునవ్వుతో స్వీకరిస్తున్నాడు. కండలు తిరిగిన శరీరం మీద అక్కడక్కడా చిన్నచిన్న గాయాలు కనిపిస్తున్నాయి.



ప్రత్యర్థులిద్దరూ ఒకరినొకరు సమీపించి, ఎదు రెదురుగా నిలుచున్నారు. నిధి చిరునవ్వుతో చూస్తూ కేసరికి అభివాదం చేశాడు. కేసరి తల కొద్దిగా పంకించాడు. ఇద్దరూ పడమటివైపున ఉన్న చలువ రాతి మండపం ముందుకు నడిచారు. మండపం ముందు నిలుచుని, తలలు పైకెత్తి, చేతులు జోడించి, మహారాజుకు నమస్కరించారు. నందికేశ్వర మహారాజు చిరునవ్వుతో తలపంకించి, నిర్దేశిత స్థలానికి వెళ్ళమన్నట్టు చేతిని ఊపాడు.

కేసరీ, నిధీ క్రీడాంగణం మధ్యకు చేరుకున్నారు. వెంటనే జేగంట మ్రోగింది. మండపం ముందు, క్రీడాంగణం అంచున నిలుచున్న ఇద్దరు భటులు ప్రత్యర్థి యోధుల వైపు కదిలారు. వాళ్ళచేతుల్లో వెడల్పాటి ఇత్తడి పళ్ళేలున్నాయి. పళ్ళేల మీద ఒరలోంచి తీసి, సిద్ధంగా ఉంచిన కత్తులు న్నాయి. భటులు యోధుల్ని సమీపించి, పళ్ళేలను వాళ్ళ ముందుకు జరిపారు. నిధీ, కేసరీ కత్తులు అందుకున్నారు. సూర్యరశ్మి ఆ కత్తుల మీద పడి తళుక్కుమంది.

కేసరి చేతిలోని కత్తి ఒక్కసారి ఉలికిపడ్డట్టు గాలిలో నాట్యం చేసింది. ఎండలో మెరుపు తీగలా మెరిసింది. కత్తిని కదిలిస్తూ అతను నిధి ముఖంలోకి తీక్షణంగా చూస్తున్నాడు. నిధి అతని ముఖంలోకి చూడటం లేదు. అతని చూపులు కత్తి పిడిని పట్టుకున్న కేసరి పిడికిలి మీద ఉన్నాయి. కేసరి వేళ్ళు కత్తి పిడిమీద గట్టిగా బిగుసుకున్నట్టున్నాయి. కణుపులు తెల్లగా మెరుస్తున్నాయి. నిధి ఆలోచనలో పడ్డాడు. కేసరి కత్తిని బలంగా, గట్టిగా పట్టుకున్నాడు. ఎందుకు? అలా గట్టిగా పిడి చుట్టూ వేళ్ళని బిగించడం తను అలవాటు చేసుకోలేదు.

వేదికమీద నుండి ఎవరో రాజోద్యోగి కంఠం ఖంగుమంది. "వీరదశమి స్పర్ధకు అర్హత సాధించిన మన యోధులు కేసరీ, నిధీ మొట్టమొదట ఖడ్గయుద్ధంలో తలపడతారు. తదనంతరం గదాయుద్ధం. ముగింపు అంశంగా ముష్టియుద్ధం. త్రివిధ యుద్ధ పరీక్షలు ముగిశాక, న్యాయనిర్ణేతలు విజయం ఎవర్ని వరించిందో ప్రకటిస్తారు! మహారాజుగారి అనుమతితో మొదట ఖడ్గయుద్ధం!

**మహామంత్రి తన ప్రకటన వినిపించి వెళ్ళిపోతున్నాడు. రాజదంపతులు, న్యాయనిర్ణేతలు, చుట్టూచేరిన యోధులు, ప్రేక్షకులు అందరూ వెళ్ళిపోతున్నారు. నిధి చూపు మాత్రం ఒకే వ్యక్తిపై కేంద్రీకృతమై ఉంది. అతడి పెదవులపై చిరునవ్వు మెరుస్తోంది. ఆ నవ్వులో ఎగతాళి, గర్వం కనిపిస్తున్నాయి. ఇంతకీ మహామంత్రి చేసిన ప్రకటన ఏమిటి? అసలేం జరిగింది?**

ప్రకటన ముగిసిన వెంటనే జేగంట మ్రోగింది. నిధి కత్తిని నిలువుగా పట్టుకుని, కళ్ళ మధ్య భాగంలో నుదుటికి ఆన్చి, యుద్ధవిద్యలు నేర్పిన గురువునీ, తల్లిదండ్రుల్నీ, దైవాన్నీ తలచుకుంటున్నాడు. దగ్గరగా నిలుచున్న కేసరి కత్తి పట్టుకున్న పిడికిలితో నిధిని దూరంగా తోశాడు. నిధి కత్తిని దించుతూ కేసరివైపు ఆశ్చర్యంగా చూశాడు.

కేసరి చేతిలోని కత్తి గాలిని చీలుస్తూ అటూ ఇటూ చివాల్న కదిలింది. తన కంఠం వైపు మెరుపులా దూసుకొస్తున్న కేసరి కత్తిని తన కత్తితో నిలువరించి దారి మళ్ళించాడు నిధి. కేసరి కళ్ళు ఎర్రగా, గుర్రుగా తనని చూస్తున్నట్టు గ్రహించాడు నిధి. కేసరి అటూ ఇటూ లంఘిస్తూ, మహావేగంతో కదులుతున్నాడు. నేలమీద నిలువకుండా గెంతులేస్తున్నాడు. అతని కత్తి ప్రతీసారీ తనను గాయపరిచే లక్ష్యంతో స్పందిస్తున్నట్టుంది. మొదటి స్పర్ధలోనే తనను కూలగొట్టి, రెండవ, మూడవ అంశాలు లేకుండా చేయాలని చూస్తున్నాడా కేసరి? ఇప్పటి దాకా అతనికీ, తనకూ మధ్య ఏ స్పర్ధా జరగలేదు. ఒకరి మీద ఒకరికి కసి ఉండటానికి అవకాశం లేదు. అయితే, కేసరి తనను ప్రత్యర్థిగా కాకుండా శత్రువుగా చూస్తున్నట్టున్నాడు. అతని చూపులూ, కదలికలూ, ఖడ్గచాలనలూ ఆ సత్యాన్ని కళ్ళకు కట్టుతున్నాయి. అతన్ని గాయపరచి, పడగొట్టే కోరిక లేదు తనకు. తన లక్ష్యం అతన్ని గాయపరచడం కాదు. ఖడ్గ విద్యలో గెలవడం!

నిధి జాగ్రత్తగా, పరిమితంగా కదులుతూ యుద్ధం చేస్తున్నాడు. మొదటి స్పర్ధలోనే అలసిపోవడం అతనికి ఇష్టం లేదు. కేసరి అలసిపోతే తనకు మంచిదే! క్షణాలు గడుస్తున్నాయి. కత్తులు ఒకదాన్ని ఒకటి బలంగా తాకుతూ చప్పుళ్ళు చేస్తున్నాయి. సూర్యకాంతి కత్తుల్ని మెరుపుతీగల్లా మార్చేస్తోంది. ప్రేక్షకులు యోధుల్ని ఉత్సాహపరుస్తూ అరుస్తున్నారు. కేసరి చేతిలో తైతక్కలాడుతున్న కత్తి నిధి శరీరాన్ని స్పృశిస్తూ గాయాలు చేస్తోంది. నిధి శరీరం మీద రక్తం మరకలు మోదుగపువ్వు రేకుల్లా కనిపిస్తున్నాయి. ఉన్నట్టుండి కేసరి ఖడ్గం పైకి లేచి, రెట్టించిన వేగంతో నిధి ఎడమ భుజం మీదికి దిగుతోంది. నిధి పిడికిలి బిగుసుకుంది. ముంజేతి కండరాలు బిగిశాయి. ఒక్కసారిగా ప్రాణం పోసుకున్నట్టు అతని కత్తి కదిలింది. కేసరి కత్తిని మెరుపు వేగంతో, మహాబలంతో తాకింది. పిడికిలి బిగించి ఉంచినందువల్ల అరచేతిని కమ్మిన చెమట కేసరి పట్టులోంచి కత్తిని జారిపోయేలా చేసింది.

అతన్ని ఆశ్చర్యంలో ముంచిచేస్తూ కత్తి పైకి ఎగిరిపోయి, గిరికీలు కొట్టి, నేల వైపు దూసుకొస్తోంది. కేసరి ఆశ్చర్యంతో విగ్రహంలా, చలనం లేకుండా చూస్తూ ఉండిపోయాడు. క్రిందికి దూసుకొస్తున్న కేసరి కత్తిని ఎడమచేత్తో ఒడుపుగా పట్టుకున్నాడు నిధి. అతని చూపుల్లో గర్వం లేదు. అతని చూపులు కేసరి మీద లేవు. మహారాజు కూర్చున్న మండపం ముందు కూర్చున్న ముగ్గురు న్యాయనిర్ణేతలను చూస్తున్నాడతను. అతని చేతులు కదిలాయి. కుడి చేతిలో పట్టుకున్న అతని కత్తీ, ఎడమ చేతిలో ఇరుక్కున్న కేసరి కత్తీ ఒకేసారి నేలలో దిగి, అటూ ఇటూ కదిలి, నేలలో పాతిన మేకుల్లా ఉండిపోయాయి. ప్రేక్షకులు చెవులు చిల్లులు పడేలా హర్షధ్వానాలు చేస్తున్నారు.

ప్రత్యర్థి యోధులకు ఖడ్గాలు అందించిన భటులు వాళ్ళవైపు పరుగెత్తుకు వస్తున్నారు. వాళ్ళ చేతుల్లో పెద్దపెద్ద గదలున్నాయి. అవి బంగారు రంగులో మెరుస్తున్నాయి. తన దగ్గరగా వచ్చిన భటుడి చేతుల్లోంచి గదను విసురుగా లాక్కున్నాడు కేసరి. రెండవ భటుడి చేతుల్లోంచీ గదను అందుకుని, ఒకసారి పైకెత్తి దాని బరువును చూసుకున్నాడు నిధి. భటులు నేలలో నిధి పాతిన కత్తుల్ని తీసుకుని దూరంగా పరుగెత్తారు.

జేగంట మ్రోగింది. కేసరీ, నిధీ గదల్ని ఒకసారి ఢీకించి వెనక్కి జరిగారు. గదాయుద్ధం ప్రారంభమైంది. కేసరి గిరుక్కున తన చుట్టూ తిరుగుతూ రెండు చేతుల్తో పట్టుకున్న తన గదతో నిధి గదను బలంగా మోదాడు. నిధి కుడిచేతిలోని గద కొద్దిగా వాలి, యథా స్థానానికి తిరిగి వచ్చింది. గదలు ఒకదాన్నొకటి తాకుతూ చేస్తున్న చప్పుళ్ళు క్రీడాంగణంలో ప్రతిధ్వనిస్తున్నాయి. ఖడ్గ విద్యలో ఎదురైన పరాజయం కేసరిలో కసినీ, పట్టుదలనూ పెంచింది. క్షణాలు గడిచేకొద్దీ ఆ కసీ, పట్టుదలా ఆగ్రహంగా మారుతున్నాయి. ఆగ్రహం, గెలవాలన్న ఆత్రుత, కదలికలలో అనవసరమైన వేగం... కేసరి శక్తిని క్రమంగా క్షీణింప చేస్తున్నాయి. అంతసేపూ ప్రత్యర్థి గదా ప్రహారాల్ని నిలువరించడానికే తన దృష్టినీ, కదలికలనూ, గద కదలికలనూ పరిమితం చేసిన నిధి ఒక్కసారిగా తన శిల్పాన్ని మార్చాడు. కేసరి ఊహకు అందని రీతిలో గదను విపరీతమైన వేగంతో దూసుకుపోనిచ్చాడు. గద గాలిని చీల్చుకుంటూ, మెరుపు వేగంతో కేసరి గదను ఢీకొంది. చెవులు పగిలేలా చప్పుడైంది. కేసరినీ, న్యాయ నిర్ణేతలనూ, రాజ కుటుంబాన్నీ, ప్రేక్షకులనూ నివ్వెరపాటుకు గురిచేస్తూ కేసరి గద అతని పట్టులోంచీ జారి గాలిలో ప్రయాణం చేస్తూ, న్యాయనిర్ణేతల సమీపంలో నేలమీద పడింది. నిధి చెయ్యి కదిలింది. అతని గద గాలిలో ప్రయాణం చేస్తూ కేసరి గద మీద పడింది. నిధి గదా ప్రహార వేగాన్ని తట్టుకోలేక గదను జారవిడుచుకుని నేలమీదికి వంగిపోయిన కేసరి మెల్లగా లేచి నిలుచున్నాడు. ప్రేక్షకులు వెర్రిగా బొబ్బలెడుతున్నారు.

రాజకుటుంబం కూర్చున్న మండపం ప్రక్కన వేదిక మీద కూర్చున్న సేనాపతి వీరకేసరి ప్రకటనలు చేసే వ్యక్తి చెవిలో ఏదో చెప్తున్నాడు. నిధి కేసరి వైపు చిరునవ్వుతో చూస్తున్నాడు. కేసరి కళ్ళు చింతనిప్పుకణికల్లా ఉన్నాయి. శ్వాసక్రియతో అతని ఎద ఎగిరెగిరి పడుతోంది. జేగంట ఒకసారి మోగింది. నిశ్శబ్దం ఆవరించింది.

"రెండు స్పర్ధలలో ఒక యోధుడు గెలుపొందిన కారణంగా మూడవదైన ముష్టియుద్ధ స్పర్ధను నిషే



## దీపిక అంటే మండిపడుతున్నాడట!

దర్శకుడు సంజయ్‌లీలా భన్సాలీ సినిమా 'పద్మావతి'లో దీపికా పదుకొనె నటిస్తున్న సంగతి తెలిసిందే! ఈ సినిమాలో పాత్ర స్వభావాన్ని అనుసరించి దీపిక చాలా వరకూ సంప్రదాయబద్ధంగానే కనిపిస్తుంది. అయితే ఇటీవల దీపిక చేసిన ఒక పని సినిమా ప్రతిష్ఠనూ, పాత్రమీద అనుమానాల్ని రేకెత్తించేదిగా ఉందని సంజయ్ లీలా భన్సాలీ ఆమె మీద కారాలు మిరియాలు నూరుతున్నాడట! ఆయనకి అంత కోపం రావడానికి దీపిక చేసిన ఫొటో షూట్ కారణమంటున్నారు. అరకొర డ్రస్సు వేసుకొని దీపిక ఇటీవల ఓ మ్యాగజైన్‌కి ఫొటో షూట్ చేసింది. ఈ ఫొటోల ప్రభావం 'పద్మావతి' మీద తప్పకుండా పడుతుందని భన్సాలీ భావిస్తున్నాడట! అందుకే ఆమె మీద కారాలు మిరియాలు నూరుతున్నాడని బాలీవుడ్ జనాలు అంటున్నారు.



ధిస్తున్నాం" రాజోద్యోగి బిగ్గరగా అరుస్తూ ప్రకటించాడు.

నిధి ఆశ్చర్యంతో ప్రకటించిన వ్యక్తి వైపు చూసి, చూపుల్ని న్యాయనిర్ణేతల వైపు మళ్ళించాడు. ఏదో కదలిక అతని దృష్టి మళ్ళించింది. విసురుగా శిరస్త్రాణాన్ని తీసి, దూరంగా విసిరికొట్టి, కేసరి పోట్లగిత్తలా నిధి వైపు పరిగెత్తుకు వచ్చాడు. ముష్టి యుద్ధం గురించిన ప్రకటనను నిర్లక్ష్యం చేస్తూ, నిధి మీదికి లంఘించాడు. అతని పిడికిలి గునపంలా నిధి పొట్టలో దిగింది. నిధి ఎడమ చెయ్యి పాముపడగలా కదిలింది. వేళ్ళు కేసరి మణికట్టును చుట్టేశాయి. తన పట్టును పట్టుకారు పట్టులా బిగిస్తూ నిధి కేసరి ముఖంలోకి చూశాడు.

"ఆవేశపడకండి. ప్రకటనను గౌరవించండి. ముష్టి యుద్ధం..." నిధి మాటను పూర్తి చేయనివ్వకుండా కేసరి ఎడమచెయ్యి పిడికిలిగా మారి, నిధి ముఖం వైపు మెరుపులా దూకింది. నిధి కుడిచేత్తో కేసరి ఎడమచేతిని బలంగా పట్టుకున్నాడు.

రెండు చేతుల్నీ బలంగా మెలిపెట్టాడు. కేసరి చేతులు ఇప్పుడు లోహం గొట్టాల్లా బిగుసు కున్నాయి. నిధి ఆ చేతుల ఆధారంతో కేసరి శరీరాన్ని ఆకాశంలోకి ఎత్తాడు. కేసరి గాలిలో తేలుతున్నాడు. అతని పాదాలు గాలిలో ఊగుతున్నాయి. భరించలేని నొప్పి, అతని ముఖాన్ని వికారంగా మారుస్తోంది. అతను వగరుస్తున్నాడు.

మరికొన్ని క్షణాలు చేతుల ఆధారంతో అలాగే గాలిలో ఎత్తి పట్టుకుంటే కేసరి కొన్నాళ్ళపాటు ముష్టి యుద్ధం గానీ, ఖడ్గయుద్ధం గానీ, గదాయుద్ధం గానీ చేయలేడని నిధికి తెలుసు. ప్రేక్షకుల కేకలతో బాటు మండపం వైపునుండీ కలకలం వినవస్తోంది. నలుగురు భటులు పరుగు పరుగున వస్తున్నారు. కేసరి వగర్పు తగ్గు స్వరంలో మూలుగుగా మారింది. నిధి అతన్ని ఎడంగా విసిరాడు. కేసరి వెల్లకిలా నేల మీద పడిపోయాడు. భటులు అతన్ని లేవదీసి న్యాయనిర్ణేతల వైపు నడిపించుకు వెళ్తున్నారు. నిధి వాళ్ళను అనుసరించాడు.

నిధి న్యాయనిర్ణేతల సమీపంలో ఆగి, మహారాజు గారికి అభివాదం చేశాడు. మహారాజు తల కొద్దిగా కదిలింది. తల్లిదండ్రుల మధ్య కూర్చుని, యుద్ధ విద్యా పరీక్షలను తిలకించిన రాకుమారి ఉత్పల ముఖం ఎందుకో బిగుసుకుపోయినట్టుంది. మండపం ముందు తల వాల్చుకుని నిలుచున్న కేసరిని చూస్తూ ఆసనం మీద నుంచి లేచి, వెళ్ళిపోయిందామె. రాజ దంపతులు నిరుత్సాహంగా ముఖాలు చూసుకున్నారు.

జేగంట ఏదో ప్రకటనకు ప్రారంభ సూచకంగా మ్రోగింది.

"ప్రజలందరూ సంయమనంతో ఉండాలి. కొన్ని క్షణాలలో నేటి 'వీర దశమి విజేత' ఎవరో ప్రకటించబడుతుంది" రాజోద్యోగి ప్రకటన ముగించి, మహామంత్రీ, సేనాపతీ ఉన్న చోటుకు వెళ్ళాడు. సేనాపతి వీరకేసరి సైగను అర్థం చేసుకున్న ప్రధాన న్యాయనిర్ణేత లేచి, వాళ్ళ దగ్గరగా వెళ్ళాడు.

'వీరదశమి విజేత' ఎవరో అక్కడున్న వాళ్ళందరికీ తెలుసు. తనకూ తెలుసు. తన ప్రత్యర్థి కేసరికీ తెలుసు. విజేత ఎవరో ప్రకటించడానికి ఆలోచన దేనికి? కాలయాపన దేనికి? ఆలోచిస్తున్న నిధి బుర్రలో ఏదో తళుక్కున మెరిసింది.

అంతిమస్పర్థలో పాల్గొన్న తనకూ, కేసరికీ జన్మపరంగా, జాతిపరంగా, వర్గపరంగా, స్థాయీ పరంగా తేడా ఉంది. తను సామాన్యుడు. కేసరి అసామాన్యుడు. ముఖ్యంగా మహాసేనాని కుమారుడు! ఈ సత్యం తనకూ తెలుసు; ప్రజలందరికీ తెలుసు! వీర దశమి విజయం వీరకేసరి తనయుడిదే అనీ, వీర కేసరి తనయుడిదే కావాలనీ, అవుతుందనీ వాళ్ళు అనుకున్నట్టున్నారు.

"ఓడిపోయిన యోధుడి చేతిమీద ముద్ర వేయాలి కదా, అన్నా?" ఎవరో, ఎవర్నో అడుగుతున్న ప్రశ్న నిధి చూపులను ఆకర్షించింది.

చలువరాతి మంటపం సమీపంలో చిన్న అరుగు మీద కుంపటిలో నిప్పులు కణకణలాడుతున్నాయి. కొయ్యపిడి ఉన్న ఇనుప శలాక కొస ఎర్రటి నిప్పుల్లో దాగి ఉంది. కొస వర్తులాకారంగా ఉంటుంది. ఓటమి పాలైన వీరుడికి ఎర్రగా కాల్చిన వర్తులాకారంతో ముంజేతి మీద కాలుస్తారు. మొదటిసారి ఓడిన యోధుడికి పెద్దవర్తులాకారం ముద్రగా కాల్చుతుంది. ఆ యోధుడు రెండవసారి ఓడితే కొంచెం చిన్న వర్తులాకారంతో మొదటిముద్ర లోపల వైపున కాలుస్తారు. మూడవసారి ఓడిన యోధుడి చేతి మీద మొదటి, రెండవ చక్రాలకన్నా చిన్నదైన శలాకతో ముద్ర పడుతుంది. అంతే! ఇంక ఆ యోధుడికి పోటీలో పాల్గొనే అవకాశం ఉండదు. లోతుగా కాలి, శాశ్వతంగా ముంజేతిమీద ఉండే చక్రాల ఆధారంగా యోధుడి అర్హత నిర్ణయించబడుతుంది. తన చేతిమీద ఇంతవరకూ ముద్ర పడలేదు. ముష్టి యుద్ధం నిషేధించ బడింది. అయినా కేసరి తనతో తలపడ్డాడు. తను వీరవిజేతా? మహావీర విజేతా? మహారాజూ, మహామంత్రీ, సేనాధిపతీ, న్యాయనిర్ణేతలూ చర్చించి నిర్ణయిస్తారేమో...

ఉన్నట్టుండి ఒకవైపున కలకలం బయలుదేరింది. తొమ్మిదినాళ్ళ పోటీలలో ఓడిపోయిన యోధులు ఒక్కసారిగా రంగ భూమి మీదికి దూకే

శారు. హర్షధ్వానాలు చేస్తూ నిధిని చుట్టు ముట్టే శారు. "ఏం జరుగుతోందో ఊహించేలోగా నిధిని ఇద్దరు యువకులు గాలిలోకి ఎత్తేశారు. అరుపులు! కేకలు! ఈలలు!

వేదిక మీదున్న సేనాపతి విసుగ్గా, కోపంగా చూసి, ఆ చూపుల్ని మహామంత్రి వైపు మళ్ళించాడు.

"ఎవరి ఉత్సాహం వాళ్ళది వీరకేసరీ.. మన సమాలోచనలకు మంచి అవకాశం" మహామంత్రి అన్నాడు తెలివిగా.

"సేనానిగారికి మనవి.." దగ్గరగా ఆగి తగ్గు స్వరంలో అన్న వ్యక్తివైపు చూశాడు వీరకేసరి. ఓడిన యోధుల ముంజేతుల మీద 'అగ్నిముద్రలు' వేసే శలాక నిపుణుడు.

"ఏమిటి?" వీరకేసరి కసిరాడు.

"తమ కుమారుడు... ఓటమి పాలయ్యాడు. శలాకముద్ర వేయాలి. అనుమతి..."

"వెళ్ళి, నీ స్థానంలో ఉండు. ఏం చేయాలో త్వరలో ప్రకటిస్తాం!" వీరకేసరి గద్దించాడు.

శలాక నిపుణుడు వెళ్ళిపోయాడు. వీరకేసరి నిరుత్సాహంగా మహామంత్రిని చూశాడు. "మహా మంత్రిగారూ... మనవాడు పరాజితుడవుతాడని ఊహించలేదు. భవిష్యత్తు ప్రణాళిక ప్రశ్నార్థకం అయిపోయింది".

"అవును. రాకుమారి వెళ్ళిపోవటం ఆ విషయాన్ని స్పష్టం చేస్తోంది. మహారాజుగారు కూడా నిరు త్సాహ పడినట్టున్నారు".

"ప్రస్తుత కర్తవ్యం? కేసరిని పరాజితుడిగా ప్రక టించడమేనా?" వీరకేసరి నీరసంగా అడిగాడు.

"ప్రకటించాల్సింది పరాజితుణ్ణి కాదు; వీర విజే తను.." మహామంత్రి సరిదిద్దాడు.

"విజేతను ప్రకటిస్తే, పరాజితుడిని ప్రకటించి నట్టే కదా!"

"రాజగురువు మేధావి వాళ్ళ దగ్గరగా వచ్చాడు. చిరునవ్వుతో మహామంత్రినీ, సేనానినీ చూశాడు. "కేసరి చేతిమీద పరాజయ ముద్ర వేయడానికి లేదు. కేసరి కేవలం వీరకేసరి పుత్రుడే కాదు; మహా రాణిగారి మేనల్లుడు, రాజదంపతులకు కాబోయే అల్లుడు, కాబోయే మహారాజు..."

"అవన్నీ మనందరికీ తెలిసిన సత్యాలే గురు దేవా! కర్తవ్యం బోధపడటం లేదు. కేసరి ఓడిపోవ డానికి వీల్లేదు" మహామంత్రి అన్నాడు.

"ఒక పని చేస్తే?" వీరకేసరి అన్నాడు. "ఏదో నెపంతో నేటి పోటీని పక్కనపెట్టి, రేపు మరోసారి పోటీ ప్రకటిస్తే?"

"ఎందుకు వీరకేసరీ... నీ కుమారుడు రెండవ సారి ఓడాలా? అది ప్రమాదం! గెలిచిన యువకుడిని విజేతగా ప్రకటించకండి! గెలిచినవాడు లేనప్పుడు ఓడినవాడు ఉండడుగా!" రాజగురువు అన్నాడు.

"అదెలా సాధ్యం గురుదేవా? అక్కడ ఆ హర్ష ధ్వానాలూ అవీ చూశారుగా?" మహామంత్రి అన్నాడు. "సమాధానం దొరకని సమస్య వచ్చిపడింది. కేస రిని రంగంలోకి దించకుండా ఉండాల్సింది."

"కేసరి ముచ్చటపడ్డాడు. తను మహావీరుడే కదా! కాబోయే మహారాజుకి ముందుగానే ఒక కీర్తి




కిరీటంగా మహావీరహారం లభిస్తుందనీ, అది మంచిదే అనీ అనుకున్నాం. మా చెల్లి మహారాణీ, బావగారూ, ముఖ్యంగా యువరాణి ఉత్పలా అలాగే భావిం చారు." వీరకేసరి బరువుగా నిట్టూర్చాడు. "తల పగిలి పోతోంది".

రాజగురువు చిన్నగా నవ్వాడు. "సమస్యలకు సమాధానం చెప్పడానికి మహాభారతం ఉందిగా!"

మహామంత్రి, వీరకేసరి కళ్ళు చిట్లిస్తూ చూశారు.

"జాగ్రత్తగా వినండి. ఒక అంశం గురించి ఒక్కొక్క పురాణం ఒక్కొక్క రకంగా చెబుతుంది. ఒక పురాణ వచనానికీ, అదే విషయంలో మరొక పురాణ వచనానికీ తేడా ఉంటుంది. అలాంటి భేదాలు ఎదురైనప్పుడు మహాభారతాన్ని ప్రామాణి కంగా తీసుకోవాలన్నారు విజ్ఞులు. ఆ అంశం గురించి మహాభారతం చెప్పేదానిని అధికారికంగా స్వీకరించాలన్న మాట.."

"పురాణ వచనం కాదుగా గురుదేవా, మన సమస్య?" మహామంత్రి అన్నారు.

"వస్తున్నా; వస్తున్నా మహామాత్యా. ప్రస్తుత వీరహార విషయంలో తలెత్తిన సమస్యకు కూడా మన మహాభారతంలో సమాధానం దొరుకుతుంది. కౌరవ పాండవుల శస్త్ర విద్యా పరీక్ష, ఆ సందర్భంలో కర్ణుడు రంగప్రవేశం చేయడం గుర్తుందిగా? కర్ణుడు అర్జునునితో తలపడే ప్రయత్నం చేస్తాడు. క్షత్రియుడు కాని కారణంగా కర్ణుడిని అనర్హుడిగా నిర్ణయిస్తారు. మనకు అక్కడిదాకా చాలు! కర్ణుడికి అంగరాజ్య పట్టాభిషేకం తదితర అంశాలు మనకు అనవసరం!

మహామంత్రీ, వీరకేసరీ నోళ్ళు వెళ్ళబెట్టారు.

"ఆ యువకుడు.... పేరు నిధి కదూ... క్షత్రి యుడు కాదనుకుంటాను".

"అవును. క్షత్రియుడు కాదు." వీరకేసరి అన్నాడు. అతని తండ్రి కర్దముడు నా బాల్య మిత్రుడు.

"క్షత్రియుడు కాని వ్యక్తి క్షత్రియుడితో పోటీ పడటం నిషేధం!"

"పోటీ జరిగిపోయిందిగా గురుదేవా?" మహా మంత్రి అడ్డు తగిలాడు.

"వసంత నవరాత్రులూ, వీరదశమీ, స్పర్ధలూ, ఉత్సవాలు... ఈ తొందర్లో కేసరితో మరొక క్షత్రియ యోధుడే పోటీకి అర్హుడు అనే నిబంధనను ప్రక టించడం మరిచిపోయాం. ఇప్పుడు రాజగురువు గారు గుర్తుచేశారు అని చెప్పండి! నిధి అనే యువ కుడు క్షత్రియుడు కాని కారణంగా జరిగిన స్పర్ధకు విలువలేదనీ, పోటీలలోంచీ దానిని కొట్టివేశామనీ, ఇది మహారాజు గారి ఆజ్ఞ అనీ, అందువల్ల నిధిని విజేతగా ప్రకటించడం లేదనీ కుండబ్రద్దలు కొట్టి, గంభీరంగా ప్రకటించండి!" రాజగురువు కంఠంలో గర్వం ప్రతిధ్వనించింది.

"గురుదేవులు దివ్యమైన విరుగుడు ఉపదేశిం చారు" వీరకేసరి ఉత్సాహంగా అన్నాడు.

"అపాయాలు ఆరు; ఉపాయాలు నూరు అన్నారు మాలాంటి మేధావులు!" మేధావి గర్వంగా అన్నాడు.

"కానీ... మహారాజుగారు.." మహామంత్రి అను మానిస్తూ అన్నాడు.

"మహారాజుకు ముందుగానే, కుడిచెవిలో ఉప దేశం చేశాం!" మేధావి సగర్వంగా అన్నాడు. "మేం రాజగురు దేవులం కదా!"

"పాపం... ఆ యువకుడు.. నిధిని తలచుకుంటే జాలివేస్తోంది!" వీరకేసరి ఉత్సాహంగా అన్నాడు.

"అందుకు కూడా మందుంది! అతను గెలిచా డనీ ప్రకటించం, కేసరి ఓడిపోయాడనీ ప్రకటించం. ముంజేతిమీద పరాజయ ముద్ర వేయం. ఆ యువ కుడున్నాడే... నిధి.. అతని శ్రమను గుర్తించాం అనండి. శ్రమకు ప్రతిఫలంగా ఒక పళ్ళెం నిండుగా ముత్యాలు ఇవ్వండి! బంగారు బొమ్మ కత్తీ, బొమ్మ గదా లేవు. వీరవిహారంలో రత్నాలూ; ఇక్కడ ముత్యాలూ! అంతే తేడా!" మేధావి అన్నాడు.

"గురుదేవా! ఆపదలో ఆదుకున్నారు." వీరకేసరి చేతులు జోడిస్తూ అన్నాడు.

"రాజగురువు పదవి మాకు అలంకారప్రాయం కాదు వీరకేసరీ! ఉపాయాలు ఉపదేశించడానికే మా

ఉనికి!" మేధావి గర్వంగా అన్నాడు. "అఁ అన్నట్టు ప్రకటన మహామంత్రిగారు స్వయంగా చేయాలి.."

"మన్నించాలి..." అప్పటిదాకా మౌనశ్రోతలా ఉండిపోయిన ప్రధాన న్యాయనిర్ణేత అన్నాడు. "న్యాయ నిర్ణేతలుగా మా పాత్ర.."

"మీ పాత్ర ఏ చప్పుడు చేయాలో మేం ఉపదేశిస్తాం. ప్రధాన న్యాయనిర్ణేతగా నువ్వు పరిచయ ప్రకటన చేయి నాయనా. దాని సారాంశం ఇదీ: యువయోధులు కేసరీ, నిధీ ప్రదర్శించిన యుద్ధ విద్యా విన్యాసాలు మీరందరూ తిలకించారు. మన ప్రభువులకు ఒక ధర్మసంకటం ఎదురైంది. ఆ సంకటం ఏమిటో, దాని పరిష్కారం ఏవిటో మన మహామాత్యుల వారు వివరిస్తారు... అదీ!"

"బాగుంది గురుదేవా!" న్యాయనిర్ణేత అన్నాడు.

"వెళ్ళి మీ సహచర న్యాయనిర్ణేతలకు చెప్పండి" వీరకేసరి అతన్ని హెచ్చరించాడు.

"ప్రకటనకు మహారాజుగారి అనుమతి తీసుకుంటాను గురుదేవా!" అంటూ అక్కడి నుంచి కదిలాడు మంత్రి.

***

జేగంట మ్రోగింది.

నిధిని చుట్టుముట్టిన యోధులూ, ప్రేక్షకులూ తమ హర్షధ్వానాలు ఆపారు. ప్రధాన న్యాయ నిర్ణేత వేదిక మీద నిలుచుని ప్రకటన ప్రారంభించి ముగించాడు. అతని ప్రకటన అందరి లోనూ ఆశ్చర్యాన్నీ, ఉత్కంఠనూ పుట్టించింది. మహామంత్రి ప్రకటన కోసం వేలాది చెవులు రిక్కించబడ్డాయి.

మహామంత్రి గంభీర కంఠంతో ప్రారంభించాడు...

మహామంత్రి ప్రకటన అందరిలోనూ పుట్టిన ఆశ్చర్యాన్నీ, ఉత్కంఠనూ నివ్వెరపాటుగా మార్చి వేస్తోంది. చాలామంది చేతులతో నోళ్ళను కప్పుకున్నారు. అంతసేపూ తనను అభినందించిన యోధుల మధ్య నిలుచున్న నిధి అర్థం కానట్టు చూస్తున్నాడు. అతని గుండె వేగంగా కొట్టుకుంది. ఇన్నేళ్ళుగా యుద్ధవిద్యాస్పర్ధలకు అడ్డం రాని కులం ఇప్పుడు అడ్డంగా వచ్చింది! తను వింటున్నది నిజమా?!

మహామంత్రి ప్రకటన పూర్తయింది. తాను గెలిచి ఓడిపోయాడా, లేక ఆ కేసరి ఓడి గెలిచాడా? నిధి గుండెలో ఏవో చలిచీమలు కుట్టుతున్నాయి. ప్రకటన ముగించి మహామంత్రి వెళ్ళిపోతున్నాడు. రాజదంపతులు లేచి వెళ్ళిపోతున్నారు. న్యాయనిర్ణేతలు తన వైపు జాలిగా చూస్తూ వెళ్ళిపోతున్నారు. చుట్టూ చేరిన యోధులు వెళ్ళిపోతున్నారు. నిధి చూపులు పక్కకు తిరిగాయి. కేసరి వేదిక మెట్లు ఎక్కుతున్నాడు. అతని చేతులు పురివదులైన తాళ్ళలా, బలహీనంగా వేళ్ళాడుతున్నాయి. తలతిప్పి అతను తనవైపే చూస్తున్నాడు. అతని పెదవుల మీద చిరునవ్వు మెరుస్తోంది. ఆ నవ్వులో ఎగతాళి, గర్వం జంటగా కనిపిస్తున్నాయి. నిధి పిడికిళ్ళు అప్రయత్నంగా బిగుసుకున్నాయి. 'సుయ్' అంటూ చప్పుడైంది. నిధి చూపుల్ని మళ్ళించాడు. శలాక ఉన్న నిప్పుల కుంపటి మీద నీళ్ళు పోస్తున్నాడు పరాజయ ముద్రలు వేసే వ్యక్తి...

నిధి వెనుదిరిగి బరువుగా అడుగులు వేశాడు. అతనిలో ఆగ్రహం అగ్నిగుండంలా మండుతోంది. తనకు అన్యాయం జరిగింది. కులమదం తనను కుళ్ళబొడిచింది. పరాజయం ప్రత్యర్థి కులాన్ని గుర్తుకు తెచ్చింది. నిధిలోని ఆగ్రహం సెగలు కక్కుతూ నిట్టూర్పు రూపంలో వెలువడింది. రంగభూమి మధ్య, కేసరిని చిత్తుచేసిన చోట నిలుచుని చుట్టూచూశాడు నిధి. ఆశ్చర్య ప్రతిమల్లా ఉన్న ప్రేక్షకులు తనవైపే మౌనంగా, జాలిగా చూస్తున్నారు.

"నాయనా.."

నిధి పక్కకి తిరిగి చూశాడు. ఎదురుగా ప్రధాన న్యాయనిర్ణేత నిలబడ్డాడు. అతని చేతుల్లో వెడల్పాటి పళ్ళెం ఉంది. పళ్ళెంలో ఆణిముత్యాలు ఎత్తుగా రాశి పోసి ఉన్నాయి.

"మహారాజుగారు నీకు ఇమ్మన్నారు.."

"ఎందుకు?"

"నీ... నీ... శ్రమకు ప్రతిఫలంగా.." అంటూ పళ్ళేన్ని నిధి వైపు జరిపాడు న్యాయనిర్ణేత.

నిధి చేతులు అప్రయత్నంగా అందుకున్నాయి. తెల్లటి, గుండ్రటి ముత్యాలను ఎర్రటి కళ్ళతో తదేకంగా చూశాడతను. శ్రమకు ప్రతిఫలం! నిధి చెయ్యి కదిలింది. పళ్ళెం చక్రంలా గాలిలోకి ఎగిరింది. గుండ్రటి ముత్యాలు తెల్లగా, వడగళ్ళలా మెరుస్తూ నేలమీదికి వర్షిస్తున్నాయి. జనం ఒక్కసారిగా రాలుతున్న ముత్యాలకోసం పరుగెత్తుకొస్తున్నారు. న్యాయ నిర్ణేత నోరు వెళ్ళబెట్టి చూస్తున్నాడు. పళ్ళెం చప్పుడు చేస్తూ నేలమీద పడింది.

నిధి క్రీడాంగణ ద్వారం వైపు నడుస్తున్నాడు. కేసరి నవ్వు గుర్తొస్తోందతనికి. ఆ నవ్వుని అతని ముఖం మీద నుండి చెరిపివేయాలి! ఎలా? నిధి బుర్రలో ఆలోచనలు కదిపిన పుట్టలోంచీ కందిరీగల్లా లేస్తున్నాయి.

***(ఇంకావుంది)***

## శ్రుతి బ్యాడ్ టైం షురూ?

*'గబ్బర్‌సింగ్' తరువాత శ్రుతి మీద ఉన్న ఐరన్ లెగ్ ముద్ర చెరిగిపోయి గోల్డెన్ లెగ్ అన్న బిరుదు వచ్చింది. మూడేళ్ళ తరువాత సీన్ మళ్ళీ రిపీట్ అయింది. ఇప్పుడు శ్రుతి చేసిన సినిమాలన్నీ అట్టర్ ఫ్లాప్ అవుతున్నాయి. తొలి రోజు కూడా నామ మాత్రపు వసూళ్ళు రాని సినిమాలు బాలీవుడ్‌లో ఉన్నాయి. ఇటు తెలుగులో కూడా శ్రుతి టైం బాగా లేదు. చేతిలో తండ్రితో చేస్తున్న సినిమా తప్ప మరొక సినిమా లేదు. అది కూడా ఎప్పుడు పూర్తవుతుందో, అసలు పూర్తవుతుందో లేదోనన్న అనుమానాలు చాలామందికి ఉన్నాయి. బాలీవుడ్ మీద మోజుతో ఆ మధ్య తన దగ్గరకు వచ్చిన తెలుగు దర్శకనిర్మాతలకు చుక్కలు చూపించి, వాళ్ళను వెనక్కి పంపించేసింది. ఇప్పుడు తెలుగులో ప్రయత్నించాలని చూసినా ఇక్కడి వారెవ్వరూ శ్రుతిని దగ్గరకు రానీయడం లేదు.*

# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్

5

-ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

# విశ్వాసంతోనే విజయం

**"నువ్వు ఏం కాదల్చుకున్నావో, దేనిగురించి కలలుగన్నావో ఆ పనిని వెంటనే విశ్వాసంతో ప్రారంభించు. ప్రతిభ బైటపడేది ధైర్యంతోనే. అదే మనతో అద్భుతాలు చేయిస్తుంది. నీపై నీకు ఎప్పుడు విశ్వాసం ఏర్పడుతుందో అప్పుడే గెలుపుమెట్లెలా ఎక్కాలో నీకే బోధపడుతుంది". —గోథె**

### నీ చరిత్ర నువ్వే రాసుకో

సాధారణ సిపాయిగా జీవితం ప్రారంభించిన నెపోలియన్ ఎంతో ఎదగాలని అమితంగా తపన పడేవాడు. అది గమనించిన తోటి సిపాయి "నిన్ను చూస్తే జాలేస్తోంది. ఎందుకీ అర్థంలేని తపన? నీకీ సిపాయి జీవితం చాలదా?" అని ఎద్దేవా చేశాడు.

"నాకున్న ఆత్మవిశ్వాసం, స్వీయగౌరవం నీకూ ఉంటే నీకు నామీద జాలి కాదు గౌరవం కలుగుతుంది" అని బదులిచ్చాడు నెపోలియన్.

విచిత్రం ఏమిటంటే ఈ తోటి సిపాయి సైనికుడిగానే మిగిలిపోయాడు. నెపోలియన్ మాత్రం తన జీవితానికి కొత్త చరిత్ర రాసుకున్నాడు.

**"పెద్ద ఫలితాలు ఆశించేవారు సాధారణమైన వాటిని తిరస్కరించి ఆత్మవిశ్వాసంతో ప్రయత్నిస్తే అద్భుత ఫలితాలు అందుకుంటారు"**

**—(సోమర్‌సెట్‌మామ్)**

నువ్వు చెయ్యదల్చుకున్న దానిపై నీ అంతరంగంలో విశ్వాసం ఉండాలి. కంటికి కనిపించని ఆ అంతరంగం విశాల విశ్వం కంటే పెద్దది, అత్యంత శక్తిమంతమైనది. విశ్వాసానికి మూలాలు అంతరంగంలోనే ఉంటాయి.

అడవుల్లో, పొలాల్లో, నేలమీద కన్పించే మొక్కలు, చెట్లు ఉద్భవించేది భూ అంతరంగంలో ఉన్న విత్తనాల నుండే.

మొలకెత్తగలనో లేదో అన్న విశ్వాసాన్ని విత్తనం కోల్పోతే భూమ్మీద వృక్షజాతే ఉండదు.

**"విజయ సాధనాలు భౌతికపరమైనవిగా కన్పించినా అవన్నీ బుద్ధి, మనస్తత్వం, భవిష్యత్తు, ఊహాశక్తి మీదున్న విశ్వాసాలే."**

—స్టీవ్ ఫోర్బ్స్

### బుద్ధి

సరైన మార్గం, సరైన ఆలోచనల్ని సరైన సమయంలో నడిపించకపోతే విజయాన్ని కూడా పట్టించుకోకుండా దాని పక్కనుండే తప్పుకునిపోతాం. తాబేలు కుందేలు కథలో కుందేలు బుద్ధిగర్వం, అహంభావంతో ఆలోచించబట్టే సునాయాస విజయాన్ని అనూహ్యంగా చేజార్చుకుంది.

బుద్ధికి అహంభావం, అలసత్వం, అహంకారం జతపడినప్పుడు అంతరంగం హెచ్చరిస్తుంది. కానీ పట్టించుకోం. "బుద్ధిని శుద్ధిగా ఉంచుకున్నవాడే విజేత".

### మనస్తత్వం

చేసే పనులనుబట్టి మనిషి మనస్తత్వం చెప్పెయ్యొచ్చు.

"స్వశక్తిమీద దృఢ విశ్వాసమున్న వ్యక్తి ఉన్నత మనస్తత్వంతో తన ప్రపంచాన్ని తానే నిర్మించుకుంటాడు".

మన ఆలోచనలనుండే మన మనస్తత్వం వృద్ధి చెందుతుంది. ఆలోచనలెప్పుడూ ఆకాశంలా విశాలంగా అన్నిటినీ అక్కున చేర్చుకునేలా ఉండాలి. విశాల దృక్పథంగల వారి మనస్తత్వంలో స్వార్థానికి తావుండదు.

అలాంటివాళ్ళే మానవాళికి ఉపయోగపడే ఆవిష్కరణలు నిస్వార్థంగా చేస్తున్నారు. మన విజయం పదిమందికి ఉపయోగపడినప్పుడే దానికి పరమార్థం, చిరస్మరణీయం.

"వ్యాధిని తగ్గించే మందుసీసాలను రూపాయికి ఒకటి చొప్పున కొన్న ఒక వ్యాపారి, వాటిని మూడు రూపాయల చొప్పున అమ్మితే ఆ వ్యాపారికి లాభమెంత?" కొడుకుని అడిగింది తల్లి.

"అది ఏమి మందు?" కొడుకు అడిగాడు.

"ఏమందైతే నీకెందుకు? లెక్కకి జవాబు చెప్పు"

"జవాబు నీ ప్రశ్నలోనే ఉందమ్మా! ఆ మందేమిటో చెప్పమ్మా".

"కలరా వ్యాధి మందు".

"ఆ వ్యాపారికి పన్నెండు కొరడాదెబ్బలు శిక్ష వెయ్యాలి" అన్నాడు కొడుకు.

తల్లి నిశ్చేష్టురాలైంది. "ఇదేం జవాబు" అంది.

"అవునమ్మా! ప్రాణాలు కాపాడే మందును ఎక్కువ లాభానికి అమ్మితే పేదవారు ఎలా కొనగలరు? ఆ మోసకారి వ్యాపారికి కొరడా దెబ్బలే సరైన శిక్ష" అన్నాడు ధైర్యంగా.

ఆ బాలుడెవరోకాదు మన్యం వీరుడు అల్లూరి సీతారామరాజు. పదుగురి బాగుకోరే ఆలోచనలు చేయబట్టే ప్రజలకోసం ఆయన బ్రిటీష్‌వారిని ఎదిరించి చరిత్రకెక్కాడు.

### ఊహాశక్తి

ఊహాశక్తి విశ్వాసాన్ని నింపుతుంది.



ఊహతోకూడిన వాస్తవానికే విలువ ఎక్కువ.

'షాజహాన్ ఊహల్లోని అద్భుత కళాఖండం తాజ్‌మహల్. పట్టుదలతో ఎన్నో అవరోధాలు అధిగమించి నిర్మించాడు. అందుకే అది నేటికీ ప్రపంచ అద్భుతాల్లో ఒకటిగా నిలిచింది.

### ఊహ, విశ్వాసం, విజయం

"బాల్యంలో ఆమెకు తినడానికి తిండి కూడా లేదు. గాలి, వెలుతురు, తలుపులు లేని ఇంట్లోనే ఆమె నివాసం. అలాంటి పరిసరాల్లో పెరిగినా నెంబర్‌వన్ శాస్త్రవేత్తగా గుర్తింపు పొందాలన్న ఊహ బాల్యం నుండే ఆమెలో రూపుదిద్దుకుంది. తనమీద తనకి అపారవిశ్వాసం. ఆ విశ్వాసమే ఆమెతో అపార కృషి చేయించింది. "రేడియం" కనిపెట్టింది. ఆమె ఎవరో కాదు, వైద్యశాస్త్ర రూపురేఖలు మార్చేసిన నోబెల్ బహుమతి గ్రహీత మేడం క్యూరీ.

కాబట్టి ఊహల్లో ఉన్నతంగా ఆలోచించేవాళ్ళే

ఏ పరిస్థితుల్లో ఉన్నా, ఏ పరిసరాల్లో ఉన్నా విజేత లుగా నిలుస్తారు.

### భవిష్యత్తు

సద్బుద్ధి, పదుగురి బాగుకోరే మనస్తత్వం, ఊహా శక్తికి వాస్తవ రూపమిచ్చే శక్తి గలవారికి భవిష్యత్తు చూచాయగా తెల్సిపోతుంది.

ఏదైతే చెయ్యాలనుకుంటామో దాన్నే పదేపదే స్మరించుకోవడంవల్ల ఆత్మవిశ్వాసం ప్రేరణ పొంది ఆచరణవైపు అడుగులేయిస్తుంది.

బాల్యం నుండే స్పష్టమైన అవగాహన, ప్రయత్నంతో శ్రమించేవారికి భవిష్యద్దర్శనం కలుగుతుంది.

### తొలి పెట్టుబడి

విజయానికి తొలి పెట్టుబడి విశ్వాసమే.

" నిన్నలోకెళ్ళి ఎవరూ కొత్తజీవితం ప్రారంభించలేరు. ఎంతవారైనా, ఈ రోజుపై విశ్వాసం ఉంచి జీవితం కొనసాగించి కొత్త ముగింపు ఇవ్వాలి".

"అనుకున్నది సాధించి తీరతా" అని ఒక తపస్సులా శ్రమిస్తే సక్సెస్ సెల్యూట్‌చేసి మనల్ని వరిస్తుంది.

"మనిషికి శ్వాస ఎంత అవసరమో, విజయానికి విశ్వాసమూ అంతే".

ఆత్మవిశ్వాసంతో అద్భుతాలు సాధించిన వారెందరో.

"నెల్లూరుజిల్లా చవటపాలెంలో సాధారణ రైతు




కుటుంబంలో పుట్టి, బాల్యం నుండే నాయకత్వ లక్షణాలు కనబరిచాడు. విద్యార్థిదశ నుండే యువజన నాయకుడిగా, రాజకీయాల్లో కార్యకర్త స్థాయి నుండి కేంద్రమంత్రి స్థాయికి ఎదిగాడు. అద్భుతమైన వాక్పటిమతో ఐక్యరాజ్యసమితి ఆవాస అధ్యక్షపదవికి ఎన్నికయ్యారు. ఆయనే వెంకయ్యనాయుడు. అరుదైన తన విజయాలకు ఆత్మవిశ్వాసమే ఆయన పెట్టుబడి.

### విశ్వాసంతో ఒక్క అడుగెయ్

మీ 'సత్తా' ఏంటో మీకే తెలుస్తుంది.

అనుమానపు విశ్వాసంతో అడుగేస్తే అడుగడుగునా అవరోధాలే.

పనిచిన్నదైనా పెద్దదైనా సంపూర్ణవిశ్వాసంతో ప్రయత్నించినవారినే వారిలోని సత్తా, అంతర్గత శక్తిని ప్రేరేపించి విజయంవైపు నడిపిస్తుంది.

ఆ తర్వాత మానసిక క్రమశిక్షణ, ధైర్యం, సృజనాత్మకత, ప్రత్యేకత మనకు అలవడతాయి. ప్రతి అడుగులో విజయసమీరాలు నూతనోత్సాహాన్ని అందిస్తాయి.

**"ఆత్మవిశ్వాసం గల వ్యక్తుల చరిత్ర ప్రపంచ చరిత్ర"**

—వివేకానంద

### కొలంబస్

ఆత్మవిశ్వాసానికి మారుపేరు కొలంబస్. భార్య మాట కాదన్నాడు. సన్నిహితులు వారించినా వినలేదు. సాధించాలన్న పట్టుదలతో, ఆత్మవిశ్వాసాన్నే శ్వాసిస్తూ, భయానకమైన కల్లోల సముద్రంలో అనేక ప్రమాదాలు తప్పించుకుంటూ రాత్రింబవళ్ళు అన్వేషణ కొనసాగించాడు. ఫలితం అతని జుట్టు తెల్లబడింది, ఒంటిమీది దుస్తులు పీలికలైపోయాయి. అనారోగ్యం తోడైంది. అయినా ఆత్మవిశ్వాసం కోల్పోలేదు. వెనుకంజ వెయ్యకుండా అమెరికాను కనిపెట్టాడు. చరిత్ర సృష్టించాడు.

తొలితరం వైద్యుల్లో ప్రముఖుడు డాక్టర్ కాకర్ల సుబ్బారావు. సాధారణ బొక్కల దవాఖానాగా పేరుపడిన 'నిమ్స్' ఆస్పత్రిని కార్పొరేట్ ఆస్పత్రిస్థాయికి తీసుకెళ్ళటంలో ఆయన కృషి మరువలేనిది. 93 ఏళ్ళ వయసులోను డాక్టర్లకు పాఠాలు బోధిస్తూ, ప్రొఫెసర్ వృత్తిలోని ఆనందం ఆస్వాదిస్తున్నారు. 'ఈ వయసులో కూడా ఫిట్‌నెస్ కోల్పోకుండా, టీచింగ్ ఎలా చెయ్యగల్గుతున్నారంటే, "వృత్తిపట్ల గౌరవం, పనిపట్ల విశ్వాసం" అంటారాయన.

భూమ్మీద జన్మించిన ప్రతిప్రాణికీ ఏదో ఒక నైపుణ్యం, ప్రత్యేకత ఉంటుంది. మనకి అనుక్షణం అనేకానేక ఆలోచనలు వస్తుంటాయి, పోతుంటాయి. అలక్ష్యం చెయ్యకుండా వాటిని ప్రతిరోజూ విశ్లేషించుకుంటే, మనలోని క్రియేటివిటీకి ఏదో ఒక క్లూ దొరుకుతుంది. ఆ 'క్లూ' మిమ్మల్ని నెమ్మదిగా కూచోనివ్వదు.

ఆ 'క్లూ..' మీ క్రియేటివిటీని... ఏ రంగంలో ఎప్పుడు, ఎక్కడ, ఎలా ఉపయోగించాలన్న అన్వేషణ ప్రారంభించేలా చేస్తుంది. దాని ఆవశ్యకత, అవసరం ఏమిటి? అని పాకులాడేలా చేస్తుంది. కొత్త ఆలోచన రేకెత్తిస్తుంది. అది సంకల్పాన్నిచ్చి మీలోని క్రియేటివిటీకి, ఆచరణకి అన్వేషణ ఆరంభిస్తుంది. ఒక రూపకల్పన చేస్తుంది. అందులో ప్రత్యేకత చాటుకోగల్గితే, మీరు సాధించే విజయం చిరస్మరణీయమే.

**"విజయం కోసం ఆరాటపడే వారికి కఠోరశ్రమ, పట్టుదల ముఖ్యకారణాలవుతాయి. ఆచరణకు ముందు ఆలోచన, ఆత్మవిశ్వాసంతో కార్యోన్ముఖులవ్వాలి".**

—రవీంద్రనాథ్ ఠాగోర్

## హేట్సాఫ్ కె.విశ్వనాథ్



- కళాతపస్విగా చిరపరిచితులు పద్మశ్రీ కాశీనాథుని విశ్వనాథ్. ఈ పేరు వినగానే 'శంకరాభరణం' గుర్తొస్తుంది. తెలుగుసినిమా గౌరవాన్ని ఇనుమడింపజేసిన వారిలో కె.విశ్వనాథ్‌గారిది ప్రత్యేకబాణీ. సినిమారంగానికి ఆయన చేసిన సేవ, కృషికిగాను ప్రతిష్ఠాత్మకమైన 'దాదాసాహెబ్ ఫాల్కే' అవార్డుతో కేంద్రప్రభుత్వం సత్కరించడం తెలుగువారికి గర్వకారణం.
- గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా పెదపులివర్రు ఆయన స్వస్థలం. బాల్యం ప్రాథమికవిద్య అక్కడే. విజయవాడలో ఉన్నతపాఠశాల విద్య, గుంటూరు ఎ.సి. కాలేజీలో బి.ఎస్సీ చదివారు.
- చెన్నైలో సాంకేతిక నిపుణుడిగా జీవితం మొదలుపెట్టారు. ప్రముఖ దర్శకులు ఆదుర్తి సుబ్బారావు వద్ద సహాయకుడిగా పనిచేసి, 'ఆత్మగౌరవం' చిత్రంతో దర్శకుడయ్యారు.
- సిరిసిరిమువ్వ సినిమాతో ఆయనలోని విభిన్న కోణం వెలుగులోకి వచ్చింది. మూసలో కొట్టుకుపోతున్న తెలుగుసినిమా 'వైభవం' ఇది అని తన అభిరుచివైపు ప్రేక్షకుల్ని మళ్ళించారు. మన సంస్కృతి, మన సంగీతం ఇదే అని తెలుగుజాతి సగర్వంగా చెప్పుకునే 'శంకరాభరణం' చిత్రరాజం నిర్మించారు. జాతీయపురస్కారంతో బాటు, ఎన్నో అవార్డులందుకున్న శంకరాభరణం భారతీయ సినిమాచరిత్రలో ఓ మైలురాయి.
- భారతీయ సంప్రదాయం, కళలకు పట్టంగట్టి సాగరసంగమం, శృతిలయలు, సిరివెన్నెల, స్వర్ణకమలం, స్వాతిముత్యం లాంటి చిత్రాలు తీశారు. కళలకే పరిమితమైపోకుండా కుల వ్యవస్థ, వరకట్నం వంటి సామాజిక అంశాలపై సప్తపది, స్వాతిముత్యం, స్వయంకృషి, శృతిలయలు, ఆపద్బాంధవుడు వంటి చిత్రాలు తీశారు.
- విశ్వనాథ్ సినిమా అంటేనే సంగీత, సాహిత్యాలకు పెద్దపీట ఉంటుంది. ప్రముఖ పాటల రచయిత వేటూరిసుందరరామ్మూర్తిగారు, సిరివెన్నెల సీతారామశాస్త్రిగారు విశ్వనాథ్ అన్వేషించిన ఆణిముత్యాలే.
- ప్రస్తుతం వయసురీత్యా దర్శకత్వ బాధ్యతలు తగ్గించుకుని, నటుడిగా కొనసాగుతున్న కె.విశ్వనాథ్‌గారికి దాదాసాహెబ్‌ఫాల్కే పురస్కారం రావడం, ఆ కళాతపస్వి తెలుగు వారవటం, ప్రతి తెలుగువాడూ గర్వించదగ్గ విషయం.



# 'సెక్స్' ఈజ్ ఆల్

**సెక్స్ అనేది తాత్కాలిక సంతోషాన్నిచ్చే చర్య కాదు. శాశ్వత ఆరోగ్యాన్ని అందించే సాధనం. యవ్వనంగా కనిపించాలన్నా, వ్యాధులతో పోరాడే శక్తి సమకూరాలన్నా, నొప్పులు తగ్గాలన్నా శృంగారంలో తరచుగా పాల్గొనాలి.**

## యవ్వనం కోసం

స్కాట్‌లాండ్‌లోని రాయల్ ఎడిన్‌బర్గ్ హాస్పిటల్.... 18 నుంచి 102 ఏళ్ల మధ్య వయసున్న 3,500 మంది మీద జరిపిన పరిశోధనలో యవ్వనంగా కనిపించటానికి లైంగిక జీవితమే కారణమనే నిజం బయల్పడింది. తరచుగా లైంగికంగా కలిసే వ్యక్తుల్లో ఒత్తిడి, సుఖనిద్ర, జీవితాన్ని చూసే కోణం....అనే అంశాలను పరిశీలించిన తర్వాతే ఈ నిర్ధారణకు వచ్చారు పరిశోధకులు. వారంలో కనీసం రెండు నుంచి మూడు సార్లు సెక్స్‌లో పాల్గొనే వాళ్లలో రోగనిరోధకశక్తికి కారణమైన ఇమ్యునోగ్లోబ్యులిన్ 30 శాతం ఎక్కువగా ఉత్పత్తి అవుతున్నట్టు తేలింది. అలాగే యాక్టివ్ సెక్స్ లైఫ్ వల్ల కేన్సర్, గుండెపోట్లు వచ్చే అవకాశాలు కూడా తగ్గుతాయి. అన్నిటికంటే ముఖ్యంగా లైంగిక జీవితాన్ని తరచుగా ఆస్వాదించేవారికి సాధారణ జలుబు, జ్వరాలు కూడా రావు.

## సెక్సర్‌సైజ్

అన్ని వ్యాయామాలలాగే సెక్స్ కొవ్వు, క్యాలరీలను కరిగిస్తుంది. 20 నిమిషాల వ్యవధిలో 80 కిలోల వ్యక్తికి దాదాపు 96 క్యాలరీలు ఖర్చవుతాయి. లైంగిక తృప్తి పొందిన ఫలితంగా నొప్పిని తట్టుకోగలిగే శక్తి పెరుగుతుంది. లైంగిక ప్రేరణతో కలిగే ఆనందం స్త్రీలకు నెలసరి నొప్పులు, కీళ్ల నొప్పులు, మైగ్రెయిన్, ఇతర నొప్పుల నుంచి ఉపశమనాన్ని అందిస్తుంది. వారంలో రెండు లేదా మూడు సార్లు సెక్స్‌లో పాల్గొనే వాళ్లతో పోలిస్తే నెలలో ఒక్కసారి లేదా అసలు సెక్స్‌లో పాల్గొనని వారు చనిపోయే అవకాశాలు 50 శాతం ఎక్కువ ఉంటాయని పరిశోధనల్లో రుజువైంది. వయసు, ధూమపానం, సామాజిక అంశాలను పరిగణ లోకి తీసుకుని చేసిన ఈ పరిశోధన ఫలితంగా ఎంత తరచుగా సెక్స్‌లో పాల్గొంటే ఆరోగ్యం అంత మెరుగ్గా ఉంటుందని రుజువైంది.

## సుఖనిద్ర కోసం

లైంగిక ప్రక్రియ లైంగిక, పునరుత్పత్తి వ్యవస్థల ఆరోగ్యం నుంచి ఆనందకరమైన జీవితం వరకూ అన్ని కోణాల్లో దీర్ఘకాలిక సత్ఫలితాలనిస్తుంది. 1800 మంది మీద అమెరికాలో చేపట్టిన పరిశోధనలో మంచి నిద్ర పట్టడానికి సహాయపడే మత్తును కలిగించే ఆక్సిటోసిన్ మిగతా ఎండార్ఫిన్లు సెక్స్‌లో పాల్గొనటం వల్ల రిలీజ్ అవుతున్నట్టు ఈ పరిశోధనలో తేలింది. కాబట్టి కంటి నిండా నిద్ర పట్టాలంటే సెక్స్‌ను ఆశ్రయించాలి.

## సెక్స్‌కు దూరమైతే?

లైంగిక తృప్తి లోపం ఫలితం వయసు, ఆరోగ్య స్థితి, లైంగిక సంతృప్తి పొందే విధానాల మీద ఆధారపడి ఉంటుంది. ఆరోగ్యంగా ఉండి భాగస్వామితో విభేదాలు లేదా అనారోగ్యం వల్ల లైంగిక జీవితానికి దూరమైతే లైంగికాసక్తి సన్నగిల్లటం సహజం. అరుదుగా కొందర్లో ఈ పరిస్థితి సెక్స్ ఆలోచనలను రెట్టింపు చేస్తుంది కూడా! సెక్స్ లోపం వల్ల కొందరు నీరసం, సెక్స్ మీద క్రమక్రమంగా ఆసక్తి సన్నగిల్లటం లేదా దొరకని వస్తువు మీద ఆశ పెరిగినట్టు సెక్స్ కోసం వెంపర్లాడటం...ఇలా విభిన్నమైన తత్వాలు వ్యక్తుల్లో చోటు చేసుకుంటాయి. ఈ రెండూ అనారోగ్యకరమే!

## సెక్స్...సగం శారీరకం, సగం మానసికం

తల్లితో బిడ్డకు అనుబంధం చర్మం స్పర్శ ద్వారా ఏర్పడినట్టే భాగస్వాముల మధ్య సఖ్యత రెండు దేహాలు ఒకదాన్ని మరొకటి తాకటం ద్వారా ఏర్పడుతుంది. మానసిక సాన్నిహిత్యం పెరగాలంటే రెండు శరీరాలు దగ్గరవ్వాలి. ఇలా జరిగి ఫీల్ గుడ్ హార్మోన్స్ విడుదలై మానసిక ఆరోగ్యం మెరుగ్గా ఉండాలంటే తరచుగా చేరువవ్వాలి. ఇది సెక్స్ వల్లే సాధ్యం. ఎండార్ఫిన్లతో మనసు ఉరకలేస్తూ ఉండాలంటే లైంగిక చర్యలో పాల్గొంటూ ఉండాలి. నిరాశా నిస్పృహలకు, లైంగిక చర్యలకు లింక్ ఉన్నట్టు పరిశోధనలు చెబుతున్నాయి. లైంగిక చర్యకు దూరమైతే డిప్రెషన్‌లోకి కూరుకుపోం కానీ, ఒక బంధానికి దూరమై ఫలితంగా సెక్స్‌కు దూరమైతే కచ్చితంగా ఆ ప్రభావం మనసు మీద పడుతుంది.

# సెక్స్ లైఫ్ మెరుగవ్వాలంటే?



ప్రారంభంలో ఉండే ప్రాధాన్యత కాల క్రమేణా తగ్గటం సెక్స్‌లో అందరం చూస్తుంటాం. ఆసక్తి సన్నగిల్లటం, పని ఒత్తిళ్లు...ఇలా సెక్స్ మీద ఆసక్తి తగ్గటానికి ఎన్నో కారణాలుంటాయి. అయితే సెక్స్‌కు మీ జీవితంలో తిరిగి చోటు కల్పించటం కోసం కొన్ని చిట్కాలు పాటించాలి.

### సెక్స్ ఈజ్ ది ఫస్ట్ ప్రయారిటీ

రోజువారీ పనులు, కుటుంబ ఒత్తిళ్లు, పిల్లల చదువులు, కట్టాల్సిన బిల్లులు వీటికి ప్రథమ ప్రాధాన్యం ఇస్తూ దంపతులు సెక్స్‌ను లిస్ట్‌లో చివరికి తోసేస్తూ ఉంటారు. ఎక్కువ శాతం దంపతులందరూ చేసే తప్పే ఇది. ఇలా సెక్స్‌కు మలి ప్రాధాన్యం ఇస్తూ పోతే క్రమక్రమంగా అది కనుమరుగయ్యే ప్రమాదం ఉంది. కాబట్టి అందుకోసం సమయాన్ని కేటాయించుకోవాలి. తీరిక చేసుకోవాలి. ఒకర్నొకరు సంప్రదించుకుని ఏకాంతాన్ని సమకూర్చుకోవాలి.

### ముద్దులాటలు

ప్రారంభంలో ముద్దులు, కౌగిలింతలతో ఎక్కువ సమయం గడిపేవాళ్లు తర్వాత వాటికి ప్రాధాన్యమివ్వటం మానేస్తారు. రెండు దేహాల కలయికతో సెక్స్‌ను ముగించేద్దాం అన్నట్టు వ్యవహరించే క్రమంలో కాలక్రమేణా ముద్దులు, కౌగిలింతలు కనుమరుగవుతాయి. కానీ దంపతుల మధ్య తిరిగి లైంగిక మెరుపు మెరవాలంటే దుస్తులతోనే ముద్దులకు పూనుకోవాలి. అప్పుడే ముద్దులు, కౌగిలింతలను పూర్తిగా, స్వచ్ఛంగా ఆస్వాదించగలుగుతారు. వాటితో కొనసాగే సెక్స్ అంతకుముందు ఇవ్వనంత సంతృప్తిని అందిస్తుందని లైంగిక నిపుణులు సూచిస్తున్నారు.

### ప్రశంసలు, అభినందనలు

మనల్ని మన భాగస్వామి ప్రేమిస్తున్నట్టు, ఆకర్షితులవుతున్నట్టు కలిగే భావనను మించిన ఆనందం మరొకటుండదు.

ఇలాంటి అనుభూతి పొందాలంటే తరచుగా ఒకర్నొకరు అభినందించుకుంటూ, ప్రశంసించుకుంటూ ఉండాలి. మనల్ని మనం తక్కువగా భావించే సందర్భంలో ఇలాంటి మెచ్చుకోళ్లు మానసిక స్థయిర్యాన్ని అందిస్తాయి. కాబట్టి భాగస్వామిలో నచ్చిన విషయాలను బాహాటంగా పొగడాలి. విమర్శలను సున్నితంగా బయట పెట్టాలి. ఇలాంటి ప్రవర్తన వల్ల పడక గదిలో దంపతుల మధ్య అరమరికల పరదాలు తొలగిపోయి స్వేచ్ఛాయుత లైంగిక జీవితాన్ని ఆస్వాదించగలుగుతారు.

### అభ్యంతరపెట్టకూడదు

ఒక్కోసారి మనసు సెక్స్‌కు సహకరించదు. ఇది దంపతుల్లో ఇద్దరికీ జరిగేదే! అయితే అందుకు బలమైన కారణం ఉంటే తప్ప సెక్స్‌కు అభ్యంతరం చెప్పకూడదు. దగ్గరకొచ్చిన వ్యక్తిని ఏదో ఓ వంకతో దూరం పెట్టేయటం తరచుగా జరుగుతూ ఉంటే మానసిక దూరం పెరగటం ఖాయం. ఇది శరీరాల మధ్య శాశ్వత దూరానికి దారి తీస్తుంది. కాబట్టి ప్రతిసారీ లైంగిక కోరిక లేకపోయినా, స్పందనలు కలగకపోయినా అందుకోసం ప్రయత్నించటంలో తప్పు లేదు. ప్రేరణ కోసం పరిస్థితిని విప్పి చెప్పి భాగస్వామి సహాయం తీసుకోవాలి.

### మెనోపాజ్ దశలో

మెనోపాజ్‌కు చేరుకున్నప్పుడు సెక్స్‌కు దూరమైతే ఇక లైంగిక జీవితానికి ఫుల్‌స్టాప్ పడినట్టే! ఆ దశలో తరచుగా సెక్స్‌లో పాల్గొనకపోతే యోని గోడలు పలుచనై లైంగిక చర్య నొప్పిని కలిగిస్తుంది. మెనోపాజ్ తర్వాత యోని ఆరోగ్యం మెరుగ్గా ఉండాలంటే తరచుగా సెక్స్‌లో పాల్గొనక తప్పదు. సెక్స్‌లో పాల్గొనటం వల్ల ఆ ప్రదేశానికి రక్త ప్రసరణ పెరిగి లైంగిక అవయవాల ఆరోగ్యం మెరుగవుతుంది. వయసు పైబడిన మహిళల్లో లూబ్రికేషన్ కొరవడటంతో తిరిగి లైంగిక జీవితం మొదలుపెడితే కొంత ఇబ్బంది ఎదురవటం సహజం. ఈ వయసు మహిళల్లో తగ్గిన ఈస్ట్రోజన్ వల్లే ఈ పరిస్థితి తలెత్తుతుంది. మెనోపాజ్ మహిళలతో పోలిస్తే సెక్స్‌లో తరచుగా పాల్గొనకపోయినా, 20 నుంచి 30 ఏళ్ల మధ్య ఉన్న మహిళల్లో లూబ్రికేషన్, ఎలాస్టిసిటీ ఎక్కువ. కాబట్టి మెనోపాజ్‌కు చేరుకున్న మహిళలు తమ ఎరోటిక్ వీడియోలు చూడటం, పుస్తకాలు చదవటం చేయాలి లేదా పార్ట్‌నర్ సహాయం తీసుకోవాలి. ఇలా చేయగలిగితే పెరిగే వయసుతో తగ్గే వెజైనల్ లూబ్రికేషన్ వేగాన్ని నియంత్రించవచ్చు.

### ఒత్తిడి పాత్ర

ఒత్తిడి తక్కువగా ఉన్నవాళ్లు ఎక్కువగా సెక్స్‌లో పాల్గొంటారు. అలాగని ఎక్కువ ఒత్తిడితో ఉన్నప్పుడు ఆసక్తి కోల్పోకూడదు. సెక్స్ ఒత్తిడిని తగ్గించే అద్భుతమైన సాధనం కాబట్టి ఆ సమయంలోనే ఎక్కువగా సెక్స్‌లో పాల్గొనాలి. తరచుగా సెక్స్‌లో పాల్గొనేవారి రక్తపోటు కూడా నియంత్రణలో ఉంటుంది. కొంతమంది మహిళలకు అది దినచర్యలో ఓ భాగం లేదా నొప్పితో కూడుకున్న పని. ఇలాంటి మహిళలు సెక్స్ వల్ల కలిగే ఆరోగ్యపరమైన లాభాల మీద అవగాహన ఏర్పరుచుకుని సెక్స్ కలిగించే ఇబ్బందులకు వైద్య చికిత్స తీసుకుని ముందుకు సాగాలి.



### నెలసరి నొప్పికి మందు

సెక్స్‌లో పాల్గొనటం ద్వారా కలిగే భావప్రాప్తి వల్ల గర్భాశయం సంకోచ వ్యాకోచాలకు గురవుతుంది. పునరుత్పత్తి వ్యవస్థకు చెందిన కండరాలు సెక్స్ వల్ల రిలాక్స్ అవుతాయి. ఫలితంగా రుతుక్రమంలో రక్తస్రావం తేలికగా జరిగి నెలసరి నొప్పి నుంచి ఉపశమనం దొరుకుతుంది. ఈ కారణం వల్లే పెళ్లికి ముందు స్త్రీలను వేధించే నెలసరి నొప్పులు పెళ్లయ్యాక దూరమవుతాయి. అయితే సెక్స్ లైఫ్‌కు దూరమైతే మళ్లీ నొప్పులు తిరగబెడతాయి.

### సెక్స్‌తో తెలివితేటలు

యూనివర్సిటీ ఆఫ్ మేరీల్యాండ్, దక్షిణ కొరియాల్లో ఎలుకల మీద జరిపిన పరిశోధనలో సెక్స్‌కూ తెలివితేటలకూ సంబంధమున్నట్టు శాస్త్రవేత్తలు కనిపెట్టారు. సెక్స్ వల్ల మెదడులో న్యూరాన్ల సంఖ్య పెరిగి, మెదడు పనితీరు మెరుగైనట్టు వాళ్లు కనుగొన్నారు. అలాగని సెక్స్‌లో పాల్గొనని వాళ్లందరికీ తెలివి తగ్గిపోతుందని చెప్పలేం. కానీ సెక్స్‌లో తరచుగా పాల్గొనటం వల్ల మెదడు చురుగ్గా ఉంటుందని మాత్రం రుజువైంది.

**–గోగుమళ్ల కవిత**

# మ్యాజిక్ బాక్స్

## -పి.వి.డి.ఎస్. ప్రకాష్

**"చిట్టితల్లీ! ఊహా! ఈ మ్యాజిక్‌పెట్టె నీకోసమే తెచ్చానమ్మా" కూతురుకి అందమైన ఒక పెట్టె చూపిస్తూ చెప్పాడు తండ్రి.**

**"మ్యాజిక్‌పెట్టా?"ఆశ్చర్యపోయింది ఊహ.**

**"అవునమ్మా! ఇది మ్యాజిక్‌పెట్టె. ఈపెట్టె ఉంటే మనచెంత ఉండదు ఏ చింత" అంటూ పెట్టె గొప్పతనం గురించి ఒక్కొక్కటిగా చెప్పసాగాడతడు. బుగ్గన చేయి వేసుకుని తండ్రి చెప్తున్న విషయాలన్నీ ఆసక్తిగా వింటోంది ఊహ.**

**"ఈపెట్టెనిండా అంతులేని ఆనందాలు, లెక్కలేనన్ని సంతోషాలు దాగున్నాయి. కొన్ని గాయాలు, మరికొన్ని బాధలు కూడా ఉన్నాయనుకో. సందర్భానుసారం అభిరుచిమేరకు ఏంకావాలో మనమే ఎంచుకోవచ్చు. ఉదాహరణకి గుండె పట్టనంత ఆనందక్షణాలు అనుభవంలోకి వచ్చినా తట్టుకోవడం కష్టం కదా!"**

అవునా అన్నట్టు చూసింది ఊహ.

"సరిగ్గా అప్పుడే మొహంమొత్తి రుచి మార్చాలనిపిస్తుంది. వెంటనే ఈ మ్యాజిక్ పెట్టెలో చెయి పెట్టి ఓ చెంచాడు బాధని తీసుకుంటే సరి. ఆ కిక్కే వేరు. చిన్నపాటి నొప్పి కూడా లేకుండా హాయి రుచి తెలిసేదెలా? హఠాత్తుగా కాలికి దెబ్బ తగిలి చిన్నగాయమై నెత్తురోడితే 'జివ్వు'మనే సుఖమే వేరు...."

"నాన్నా" అంది అప్పుడే ఆక్షణమే తన కాలికి దెబ్బతగిలిన బాధను కళ్ళతోనే అభినయిస్తూ ఊహ.

"బాధలు కూడా జీవితంలో భాగమే నమ్మా. వద్దన్నా అవి మనల్ని వెంటాడి వేధించకమానవు.



అందుకే బాధల్లోనూ సుఖాన్ని వెతుక్కోవడమే మందు. అలాంటి మందే ఈ మ్యాజిక్ పెట్టె మనకు అందిస్తుంది. నడుస్తున్నక్షణంలో ఎదురయ్యే అనుభవాల గాఢతని తట్టుకోలేమనిపించినప్పుడు ఇంకోటి మనం ఎంచుకునే సౌలభ్యం ఈపెట్టెద్వారా దక్కుతుందని చెప్తున్నా. నిజంగా నువ్వు బాధలో ఉన్నావనుకో, ఆ ఆవేదనతో మనసు నలిగిపోతోందనుకో అది మరచిపోయి నవ్యోత్సాహం పొందేందుకు ఈ మ్యాజిక్ పెట్టె ఎంతగానో ఉపకరిస్తుంది. బాధల అగాధంలో కూరుకుపోయినప్పుడు ఓ గరిటెడు సంతోషాన్ని ఇదే పెట్టెలోంచి తోడుకోవచ్చు" అన్నాడతను చిన్నారి ఊహ భుజంతట్టి ధైర్యం చెప్తూ.

"బాగుందే. అలాగైతే అస్తమానం ఆనందాన్నే జుర్రుకోవచ్చు జీవితంలో. అసలు బాధలే లేకుండా సంతోషాల్నే అందుకుంటా"

"ఒక్క విషయం చెప్పనా? ఉగాదిపచ్చడిలా వివిధరుచుల సమ్మేళనం ఈ జీవితం. బతుకులన్నీ కష్టసుఖాల కలనేతే! ఆనందమైనా విషాదమైనా కలకాలం కాపురం చేయవు. ఏది ఎదురైనా స్వాగతించి అనభవించే స్థితినే అలవర్చుకోవాలి." ఆ పదేళ్ళ చిన్నారికి ముందు ముందు ఎలా జీవించాలో బోధిస్తున్నాడా తండ్రి.

"అయితే ఈ మ్యాజిక్‌పెట్టె నాక్కావాలి, వెంటనే ఇచ్చెయ్ నాన్నా" మారాం చేస్తూ తండ్రి దగ్గరున్న ఆ పెట్టెను తన చేతుల్లోకి తీసుకోబోతుండగానే భళ్లున తెల్లవారింది. వేడి వేడి సూర్యకిరణాలు ఒక్కొక్కటిగా కనురెప్పల్ని తాకడంతో మెలకువ వచ్చిన ఊహ లేచిచూస్తే పూజగదిలో పూజచేసుకుంటూ కనిపించాడు తండ్రి. అతడి చేతిలో హారతి పళ్లెం.

తను ఇంకా పక్కమీదనే ఉంది. ఇంతలో, "ఊహా ఎంతసేపే మొద్దునిద్ర... ఇవాళ్టికి స్కూల్‌కి డుమ్మా కొడతావేంటీ?" వంటింట్లోంచి గొంతు చించుకుని అరుస్తోంది అమ్మ.

"అమ్మో..? ఒక్క ఉదుటున లేచి రాత్రి కప్పుకున్న దుప్పటి మడతపెట్టి బయటకొచ్చినా ఆమె కలలోంచి మాత్రం బయటకి రాలేకపోయింది. అప్పుడే కాదు ఆ తర్వాత కూడా మ్యాజిక్‌పెట్టె ఆమె కళ్ళలోనే కాపురం ఉంది.

నైన్త్ క్లాస్‌లో పెద్దమనిషైంది. ఏడాది తర్వాత టెన్త్ ఎగ్జామ్స్ రాసింది. ఇంటర్‌లోకి అడుగు పెట్టింది. డిగ్రీ చేసింది. మధ్యలో సినిమాలు,

షికార్లు, స్నేహితుల్తో ఆటలు, పాటలు, అల్లర్లతో సందడి చేస్తూనే ఉంది. అయినా పదేళ్ళ వయసులో ఓరాత్రి కలలో కనిపించి కవ్వించి, మురిపించి మరిపించిన మ్యాజిక్‌పెట్టెను మాత్రం ఆమె మరచిపోలేదు. ఎప్పటికైనా మ్యాజిక్‌పెట్టె తన సొంతం కాకపోతుందా? అనే ఆలోచనతో ఆశగా లోకమంతా గాలిస్తూనే ఉంది. ఆధునిక సాంకేతికత ఆధారంగా అనేకానేక ఆవిష్కరణలు ప్రపంచంలో ప్రతినిత్యం చోటుచేసుకుంటుండగా ఎప్పుడో అప్పుడు ఎవరో ఒకరు ఈ మ్యాజిక్ పెట్టెను కనిపెట్టకుండా ఉండరు. ఆ నమ్మకంతోనే ఆ మ్యాజిక్‌పెట్టె కోసం దశదిశలా వెతుకుతూనే ఉంది.

"నిజంగా ఆ మ్యాజిక్‌పెట్టె మనకు అందుబాటులో ఉంటే ఎంత హాయి. చుట్టుముట్టి ఊపిరాడకుండా ఉక్కిరిబిక్కిరిచేసే బాధలన్నింటినీ చాపలా ఓ చుట్టుచుట్టేసి ఏ సముద్రంలోనో విసిరేసేదాన్ని. కానీ ఏం చేస్తాం కలలోతప్ప ఇలలో ఆ మ్యాజిక్‌పెట్టె మనచేతుల్లో లేదాయే!" నిట్టూర్చేది ఊహ.



'మ్యాజిక్‌పెట్టా?' తన నోట ఆమాట వెలువడగానే చుట్టుపక్కల వాళ్ళంతా పిచ్చిదాన్ని చూసినట్లు చూసేవాళ్ళు.

'మీ అమ్మానాన్న నీకు సరైన పేరే పెట్టారే, ఎప్పుడూ ఊహల్లో బతుకుతావు కనుకే ఊహ సుందరయ్యావు. పొద్దస్తమానం ఊహల్లో విహరించడం కాదు వాస్తవంలో నేలపై బతకాలి' అంటూ స్నేహితులు హితవు చెప్పేవాళ్ళు. ఆ హితోక్తులు వింటుండగానే హఠాత్తుగా ఓరోజు పెళ్ళిచూపులు నెలతిరిగేసరికల్లా మెడలో తాళిపడిపోవడం ఊహించలేనంత వేగంగా జరిగిపోయాయి. కుమారి ఊహ శ్రీమతి ఊహగా మారిపోయింది.

"ఒసేయ్ ఎక్కడ చచ్చావే?" కర్ణభేరి బద్దలయ్యేలా పెద్ద అరుపు. ఆ అరుపు తన భర్త మోహన్‌దే. పెళ్ళైన ఈ ఆరునెలల్లోనూ ముద్దుగా మురిపెంగా పేరు పెట్టి పిలవడంగానీ, మృదువుగా మాట్లాడడంగానీ తనెరుగదు. పసితనంలో అమ్మానాన్నలు నలుగురినీ పిలిచి ఉత్సవంచేసి ఎంతో ఇష్టంగా పెట్టిన 'ఊహాసుందరి' పేరుతో తనను ఒక్కనాడు పిలవలేదు కట్నం తీసుకుని తనని తానే అమ్ముకున్న మొగుడు. 'ఏమేవ్, ఒసేయ్, ఎక్కడ చచ్చావే' లాంటి సంబోధనలే అత్తింటి గడపతొక్కిన మొదటి క్షణం నుంచీ తనకి అలవాటయ్యాయి. సాధారణంగా మార్కెట్లో డబ్బిచ్చి కొనుక్కున్న వస్తువుపై కొనుగోలుదారుడికి సర్వహక్కులూ ఉంటాయి. కానీ చిత్రంగా పెళ్ళనే వ్యాపారసూత్రం మాత్రం అందుకు విరుద్ధం. మూడుముళ్ళ విపణిలో లక్షల సొమ్ములు గుమ్మరించిన నవవధువు అన్ని హక్కుల్నీ కోల్పోతుంది. చివరాఖరికి పుట్టింటి పేరుతో సహా సొంతపేరు కూడా మరచిపోయే దయనీయమైన పరిస్థితులు దాపురిస్తాయి. మోహన్ నోటివెంట 'ఏమేవ్..' అన్న పిలుపు వచ్చినప్పుడల్లా అలా బాధపడుతూనే ఉంటుంది ఊహ.

"ఎన్నిసార్లు పిలవాలి? చెవుల్లో చెట్లు మొలిచాయా? విని కూడా విననట్లు నటిస్తున్నావా? ఓసారి వచ్చి చావు" గావు కేకలు పెడుతున్నాడు.

"ఒక్కక్షణం ఇదిగో వచ్చేస్తున్నా" అంటూ చీరకొంగు నడుముచుట్టూ దోపుకుంటూ డ్రాయింగ్ రూంలోకి వచ్చింది ఊహ.

"ఏమైంది నీకు? తాళికట్టిన భర్త చులకనయ్యాడా? ఒక్కపిలుపుకే రావాలని తెలియకపోతే నీకు తెలియజేస్తాను?" అంటూ కుర్చీలోంచి అమాంతం లేచి చెంప చెళ్లుమనిపించాడు. బలంగా తగిలిన ఆ దెబ్బకి ఒక్కసారిగా ఆమెకు చుక్కలు కనిపించాయి. కళ్ళలో నీళ్ళు సుళ్లు తిరిగాయి.

"దీనికేం తక్కువ లేదు. నెత్తిమీదెప్పుడూ నీళ్ళకుండ ఉంటుంది. నోర్ముయ్. ఏడుపు వినిపిస్తే చంపేస్తాను" గట్టిగా హుంకరిస్తున్నాడతడు.

"ఇంతకీ ఏం చేస్తున్నావక్కడ?" గద్దించాడు.

"రెండోసారి మీకివ్వడం కోసం కిచెన్‌లో కాఫీ కాస్తున్నాను" వెక్కుతూనే భర్తకి సంజాయిషీ ఇచ్చుకుంది ఊహ.

"ఎందుకు పిలిచారు?" అడగాలనుకుని కూడా నోరు మెదపలేదు. పిలిచిందెందుకో అతడూ చెప్పలేదు. అతడు కుర్చీలో కూర్చుని పేపరు తిరగేస్తున్నాడు. అతడిముందు ముద్దాయిలా అలాగే నిల్చుండిపోయింది ఊహ.

"కాసేపటి తర్వాత ఇంకా మొద్దులా అలా నిల్చున్నావేం? పిలిచిందెందుకో తెలీదా?" మళ్ళీ అరిచాడు.

"ఊహూ..!"

"అదీ నా నోటితోనే చెప్పాలన్నమాట. పెళ్ళై ఇన్నాళ్ళైనా పొద్దునే లేచిన మొగుడిగారికి ఏం కావాలో ఇంకా తెలీదా? అదిగో, ఆ సిగరెట్‌పెట్టె అందుకో" ఆర్డరేశాడు మోహన్. చేతికందేంత దూరంలోనే టేబుల్‌పైన సిగరెట్‌పెట్టె ఉంది. అయితే తనచేతిని అంతవరకు సాచడానికి అతడికి బద్ధకం. ఆ పెట్టె అందించింది ఊహ.

"సిగరెట్ ఎవడు వెలిగిస్తాడే, పుట్టింట్లో ఉన్న నీ బాబా" గర్జించాడు. లైటర్ తీసుకుని సిగరెట్ వెలిగిస్తుంటే ఆ నిప్పుసెగ ఆమె గుండెల్ని తాకింది. పుట్టింటోళ్ళ పూజగదిలో అగరుబత్తి, హారతి వెలిగించిన చేతుల్తోనే ఇప్పుడు భర్త నోట్లో సిగరెట్ వెలిగిస్తోంది. అదే లైటర్‌తో అతడిని తగలబెట్టాలనిపించేంత ఆవేశం రగుల్తున్నా, మెడలో అతడు కట్టిన తాళి వద్దని వారిస్తోంది.

పెళ్ళికిముందు తను ఎలా ఉండేది. పెళ్ళి తర్వాత ఎలా మారిపోయింది. ఇంట్లో, స్కూల్లో, కాలేజీలో తనో మహారాణి. తనకు తన స్నేహితులు పెట్టుకున్న ముద్దుపేరు శివంగి. ఔను, తననెవరైనా అవమానిస్తే అచ్చం శివంగిలాగే రెచ్చిపోయేది. ఓసారి బస్సులో టిక్కెటిస్తూ చేతిని గట్టిగా నలిపేశాడని ప్రయాణికులంతమంది చూస్తుండగానే కండక్టర్ చెంప చెళ్లుమనిపించింది. కాని ఇవాళ తన భర్త చేతుల్లో ప్రతిరోజూ అవమానపడుతోంది దెబ్బలు తింటోంది.

ఎందుకలా?

తాళిబంధం. ఔను అతడికీ తనకూ మధ్య ఉన్నది తాళిబంధమే. ఆ బంధానికి గౌరవమిచ్చే అతడెంత రెచ్చిపోతున్నా తన మనసుకెంత నొప్పి కలుగుతున్నా భరిస్తోంది. భర్త ఆగడాలు సహిస్తోంది. ఇలాంటి సందర్భాల్లోనే ఆ మ్యాజిక్‌పెట్టె గుర్తొస్తుంది ఊహకి. ఇప్పుడు కలిగిన బాధ నుంచి ఉపశమనం పొందాలంటే మ్యాజిక్‌పెట్టెలోంచి కాసింత సంతోషాన్ని స్వీకరించాల్సిందే.

కానీ ఆ మ్యాజిక్‌పెట్టె ఎక్కడుంది? అది ఎప్పటికీ అంతుచిక్కని మిలియన్ డాలర్ల ప్రశ్నే!

"మీనాన్నతో చెప్పావా?" ఓపక్క అర్ధరాత్రి హింస పెడుతూనే అడిగాడు మోహన్.

"ఏ విషయం?"

"ఏ విషయమా? మూడ్రోజుల్నుంచీ చెవిలో ఇల్లు కట్టుకుని మరీ చెప్తుంటే బుర్రకెక్కలేదా?"

"యాభైవేల గురించా?"

"అవును"

"అడగలేదు"

"ఏం ఎందుకు అడగలేదు? నీ భర్త బైక్‌మీద వెనుకసీట్లో కూర్చుని సిటీలో ఊరేగాలని నీకు లేదా?"

"ఊహూ..బైక్‌మీద మీవెంట తిరగాలన్న కోరిక నాకు లేదు"

"కానీ నాకుంది. రోజూ సిటీబస్సుల్లో ఆఫీసుకి వెళ్ళి రాలేకపోతున్నాను.."

ఊహ మాట్లాడలేదు.

"రెండులక్షలు కట్నం ఇచ్చి అనవసరంగా నిన్ను పెళ్ళి చేసుకున్నాను. పెళ్ళైన వారంరోజులకే నాకింకా పెళ్ళి కాలేదనుకుని నాలుగులక్షల కట్నం ఇస్తామంటూ మరో సంబంధం వచ్చింది. ఓ నెల ఓపికపడితే మరో రెండు లక్షలు వచ్చేవి. నష్టపోయాను"

"నష్టపోవడానికి ఇదేమన్నా వ్యాపారమా? పెళ్లి" అంది తనని చుట్టుకున్న అతడి చేతుల్ని బలంగా తోసేస్తూ.

"జీవితంలో ఒకే ఒక్కసారి పెళ్ళి చేసుకుంటాం. ఆ పెళ్ళితోనే భవిష్యత్తు మారుతుంది. మా ఆఫీసులో ఓ ఫ్రెండ్ పెళ్ళికి ముందు సైకిల్‌పై తిరిగేవాడు. పెళ్ళి తర్వాత కార్లో షికారు చేస్తున్నాడు. నేనూ ఉన్నాను ఎందుకు? పెళ్ళికి ముందూ పెళ్ళి




**స్కూల్లో స్నేహితులు ఆమెను శివంగి అనేవారు. ఎందుకంటే అంతలా చెలరేగిపోయేది. మాట పడేదికాదు. ఎంతటివారినైనా ఎదిరించేది. టికెట్టు ఇస్తూ తనచేతిని నలిపేశాడని కండక్టర్ చెంపచెళ్లుమనిపించింది. పెద్దయ్యాక మెడలో తాళిబొట్టు పడింది. ఆమె జీవితం తారుమారైంది. రోజూ భర్త ఆమె చెంపలు చెళ్లుమనిపిస్తున్నాడు. సూటిపోటి మాటలంటున్నాడు. అప్పుడుకూడా ఆమె తిరగబడిందా? లేక సహించిందా?**

తర్వాత కూడా ఉసూరుమంటూ సిటీబస్సుల్లోనే ప్రయాణం.

"ఎవరి అదృష్టం వారిది"

"అంటే నేను దురదృష్టవంతుడిననా?"

"అని నేననలేదు, మీ ఫ్రెండ్ అదృష్టవంతుడంటున్నాను"

"ఔను, వాడు అదృష్టవంతుడే. ఎందుకంటే ఇప్పటికీ ఒక్క ఫోన్‌కాల్ చేస్తేచాలు వాడి అకౌంట్లోకి క్షణాల్లో డబ్బులొచ్చి పడ్తాయి. మరి నేనో దేబిరించుకోవాల్సి వస్తోంది. ఇంతకీ ఆ యాభైవేలు అడుగుతావా లేదా?"

"అడిగే ప్రసక్తే లేదు.."

"మీ నాన్నని అడిగి ఆ యాభైవేలు తేవాల్సిందే. రిటైర్మెంట్ బెనిఫిట్స్ మొన్నేగా అందుకున్నాడు. ఇంకా ఖర్చుపెట్టలేదనుకుంటా"

"మీరడిగినంత కట్నమిచ్చి పెళ్ళి చేశాడు. జీవితాంతం మీకు సేవచేయమని నన్ను పంపించాడు. ఏ ఆడపిల్ల తండ్రయినా ఇంతకన్నా ఏంచేస్తాడు? పెళ్ళి తర్వాత ఆడపిల్లకి పుట్టిల్లనేది ఉండదు. ఉందనుకున్నాగానీ అది చుట్టాలిల్లే"

"స్పీచులివ్వకు. మండిపోతోంది. నీకు నేను కావాలన్నా, నువ్వింట్లో ఉండాలన్నా రెండ్రోజుల్లో నేనడిగిన డబ్బు నా చేతుల్లో పడాల్సిందే. లేకుంటే నీదారి నీదే"

"అంటే"

""నాకు నువ్వొద్దంటున్నాను"

ఆ క్షణం..అప్పుడే సిగరెట్ లైటర్‌తో అతడిచితికి నిప్పు అంటించాలన్నంత కోపంకూడా వచ్చింది.

నిద్రని వెలివేస్తూ ఆలోచిస్తూనే అప్పుడెప్పుడో కొలంబస్ ఇండియాను కనుక్కున్నట్లు ఆ అర్ధరాత్రి వేళ మ్యాజిక్‌పెట్టె అడ్రస్ కనుక్కుంది ఆమె.

అంతే! కొండంత ధైర్యంతో రేపటి ఉదయాన్ని ఆమె స్వాగతించింది.

"నే వెళ్తున్నా"

"పుట్టింటికా.... సాయంత్రానికల్లా యాభైవేలతో తిరిగొస్తావు కదా!" అడిగాడు మోహన్ తెల్లారగానే సూట్‌కేసు సర్దుకుని ప్రయాణానికి సిద్ధంగా ఉన్న భార్యతో.

"రావట్లేదు"

'నువ్వంటున్నదేమిటో అర్థం కావడం లేదు"

"ఇందులో అర్థం కానిదేమీలేదు. పర్మనెంట్‌గా

గుడ్‌బై చెప్పేస్తున్నాను. ఈ ఇంటితో మీతో ఇప్పటి వరకు ఉన్న బంధం తెంచుకుని మీనుంచి దూరంగా వెళ్ళిపోతున్నాను."

"ఇంత చిన్న విషయానికేనా"

"మొలతాడుకట్టిన మగాడిగా మీకు ఇది చిన్న విషయమే. కానీ తల వంచుకుని తాళికట్టించుకున్న భార్యగా నాకిది ఆత్మాభిమానం సమస్య. ఆడపిల్లైనా మగపిల్లాడైనా అమ్మకడుపులోంచే పుడతారు. చచ్చాక పుడమి ఒడిలోనే కలిసిపోతారు. మధ్యలో ఉన్న బతుకులో మాత్రం కలిసి ఉండలేరు. అడుగ డుగునా వివక్ష. ఆడదానిగా పుట్టినందుకు అనుక్షణం అవమానాలు ఎదుర్కొంటూ బతకాలని ఆ బ్రహ్మ రాయలేదు. మనసులేని ఈ మగాళ్లే ఆ రాత రాశారు. రాస్తున్నారు. మీ దృష్టిలో భార్యంటే ఎప్పుడుపడితే అప్పుడు డబ్బులు తీసుకునే ఏటీఎం కార్డు. కావాలనుకున్నప్పుడల్లా పక్కలోకి వచ్చే పడతి. ఆమెకి శరీరమేతప్ప మెదడులేదు. ఆలోచన లేదు. అంతరంగంలేదు. మీకు గుర్తుందా? పెళ్ళైన వారంరోజులకే పాతికవేల రూపాయలు కావాలంటే సిగ్గుతో చచ్చిపోతూనే నాన్ననడిగి ఆ డబ్బు తెచ్చాను. ఇన్నాళ్ళకి ఇప్పుడు యాభైవేలు. ఆ డబ్బు తేకపోతే తెగతెంపులే అన్న మిమ్మల్ని నమ్ముకుంటే నాకు భద్రత ఉంటుందా? భవిష్యత్తుంటుందా? మీ మనసులో పాముపిల్లలా ఎప్పుడు ఏ కోరిక బుస కొడుతుందో అంచనావేయడం ఎలా? ఆ కోరిక తీర్చుకోవడం కోసం ఓ అర్థరాత్రి నిద్రలేపి పుట్టింటి కెళ్ళి డబ్బు తీసుకు రమ్మంటూ హడావిడిగా తరిమేస్తుంటే. ఒకే కప్పుకింద మీతో సహజీవనం సాగించేదెలా? జీవితాన్ని పంచుకునేదెలా? మొగుడు అవసరం ఒక్క ఆడదానికేనా? ఓ మగాడుగా మీకు అర్థాంగి అవసరం లేదా?"

"ఎక్కువ మాట్లాడుతున్నావ్"

"ఔను. ఎక్కువే మాట్లాడుతున్నాను. ముందు ముందు మిమ్మల్ని కలిసి మాట్లాడే అవసరం రాదు గదా! అందుకే చెప్పాల్సినవన్నీ చెప్పేస్తున్నా. పెళ్ళంటే ఇద్దరు భాగస్వాముల మధ్య వ్యాపార లావాదేవీ కాదు. రెండు కుటుంబాల మధ్య ఇష్టపూర్వకంగా నిర్మించుకునే ఆత్మీయవారధి. రెండు నిండు జీవితాల కలయిక ఇది. అర్థం చేసుకోకుండా పెళ్ళంటే కట్నం సొమ్మని పెళ్ళాం అంటే కరెన్సీనోటని భావించే మొగుడితో కాపురం చేయడం అనర్థం. అది తెలిసే వెళ్ళిపోతున్నా. నచ్చని కాపురం చేయలేం కాబట్టి, ఎలాగో విడాకులు తీసుకుంటాం కాబట్టి నాలుగైదులక్షల కట్నంతో మళ్ళీ పెళ్ళి చేసుకోండి. నన్ను పెళ్ళి చేసుకోవడంవల్ల నష్టపోయా ననుకుంటున్న ఆ సొమ్ముని ఎంచక్కా తిరిగి రాబట్టుకోవచ్చు. అంతేకాదు అడపాదడపా అవసరం పడితే ఆ పిల్లని పుట్టింటికి తరిమేస్తూ డబ్బులు గుంజుకోవచ్చు. గుడ్‌బై" అంటూ సూట్‌కేసుతో గడపదాటి బయట అడుగుపెట్టింది ఊహ.

"తప్పు చేశావేమో?" అన్నాడు తండ్రి.

"తప్పుకచేస్తే అది తప్పుకాదు నాన్నా, ఒప్పే" అంది ఊహ.

## బరువుపై జేజమ్మ సీరియస్!

**టాలీవుడ్** జేజమ్మ అనుష్కశెట్టి బరువుపై బోలెడన్ని జోకులు షికారుచేశాక...వాటిని సీరియస్‌గా తీసుకుంది అనుష్క. అర్జంటుగా తన బరువు తగ్గించుకోవాలని డిసైడ్ అయిపోయింది. మామూలుగా కడుపు మాడ్చుకుని, చెమట చిందించకుండా, యోగాతో బరువు తగ్గి పూర్వ రూపాన్ని పొందాలని నిర్ణయించుకుందట! ఈ మేరకు గంటల తరబడి యోగా చేస్తోందట! అయితే యోగా చిట్కా పనిచేయదేమో అని ఆమె అభిమానులు తెగ బాధపడిపోతున్నారట!



"అల్లుడుగారు అడిగిన డబ్బు సర్దేస్తే సరి పోయేది కదమ్మా, నీ కాపురం నిలబడేది" అన్నాడు తండ్రి.

"కరెన్సీనోట్లతో నిలబెట్టుకునే కాపురం ఓ కాపుర మేనా నాన్నా? అమ్మని మీరెంత ప్రేమగా చూసు కున్నారు. పెళ్ళై ఇన్నేళ్ళైనా ఇప్పటికీ మీ ఇద్దరి మధ్య అదే ప్రేమ కనిపిస్తోంది. ఆ ప్రేమే కరువైతే జీవితాలు నరకమే. ప్రేమ లేని ఆ నరకంలో ఉండలేకే వచ్చేశాను"

"ఇప్పుడేం చేస్తావు?"

"నువ్వు చెప్పించిన చదువు అండగా ఉండగా బతకడానికి భయమెందుకు నాన్నా. అన్నట్టు చెప్పడం మరిచాను. పదేళ్ళ వయసులో నాకో కల వచ్చింది. ఆ కలలో నువ్వు నాకు ఒక మ్యాజిక్‌పెట్టె ఇచ్చావు" అంటూ చెప్పడం ప్రారంభించింది ఊహ.

"ఔనా.." ఆశ్చర్యంగా వింటున్నాడు ఊహ తండ్రి.

"నిజం నాన్నా ఎన్నాళ్ళుగానో నేను వెతుకు తున్న మ్యాజిక్‌పెట్టె అడ్రస్ నాకు దొరికింది."

"మ్యాజిక్‌పెట్టె అడ్రస్ నీకు దొరికిందా?" అతడిలో మరింత ఆశ్చర్యం.

"ఔను నాన్నా! దొరికింది. ఆ మ్యాజిక్‌పెట్టె ఒక్క నాదగ్గరే కాదు నీ దగ్గర, అమ్మ దగ్గర... ప్రతి ఒక్కరి దగ్గరా ఉంది. అయితే దాన్ని గుర్తించకపోవడమే మన పొరపాటు.

"ఇంతకీ ఆ మ్యాజిక్‌పెట్టె అడ్రస్ చెప్పు"

"మ..న..సు! ఔను నాన్నా మన మనసే ఓ మ్యాజిక్‌పెట్టె! ఆ పెట్టెలో బాధలు, గాథలు, కోపాలు, తాపాలు, ఆనందాలు, విషాదాలు..ఇలా ఎన్నో ఎన్నెన్నో ఉన్నాయి. సంతోషంగా ఉన్నప్పుడు అందరూ నవ్వుతారు. బాధలో కూడా నవ్వగలగడమే గొప్ప మ్యాజిక్. ఆ మ్యాజిక్ ఇప్పుడు నావశమైంది. ఇన్నాళ్ళూ అతనికి తాళికట్టిన భర్త అనే గౌరవం ఇచ్చాను. కొట్టినా తిట్టినా ఏడుస్తూ భరించాను. పెళ్ళి అనే బాంధవ్యం ఇద్దరిదీ. ఆ పేరుతో దౌర్జన్యం చేస్తుంటే నేను ఒక్కదాన్నే ఎందుకు ఏడుస్తూ బతకాలి. 'నో వన్ కెన్ మేక్ యు ఇన్ఫీరియర్ వితౌట్ యువర్ కన్సెంట్'! ఔను అతడి దగ్గర భార్యలా బతకాలనుకున్నాను, కుదరలేదు. బానిసలా ఉండకూడదనుకుని వచ్చేశాను. ఏధైర్యంతో అంటావా? మనసనే మ్యాజిక్‌పెట్టె ఉందన్న ధైర్యంతో. ఔను కష్టాలొచ్చినా చిరునవ్వుతో వాటిని జయించే ఆత్మవిశ్వాసాన్ని ఇచ్చే మ్యాజిక్‌పెట్టె అది. ఒక జీవితాన్ని ఈదడంలో ఏ భయమూ లేదు ఇప్పుడు చెప్పు, నేను చేసింది తప్పా?" అడిగింది ఊహ.

"ఊహూ..! తప్పేం కాదమ్మా! సమస్యలు చుట్టుముట్టినప్పుడు అందరూ నీలాగే ఆలోచించాలేమో?" కూతురు భుజాన్ని ప్రేమగా తడుతూ అన్నాడు ఆ తండ్రి.

సెల్: 9000544160




## భలే మంచి హాబీ!

ఒక్కొక్కరిదీ ఒక్కో అభిరుచి. ఒకరికి డాన్స్ ప్రాణమైతే మరొకరికి సైకత శిల్పాలు మలచడం ఇష్టం. ఇంకొకరికి రకరకాల వస్తువుల సేకరణ అంటే మమకారం. మిచెల్లె కూడా ఈ కోవలో మనిషే. ఇంగ్లండ్ బర్మింగ్‌హామ్‌కి చెందిన మిచెల్లె ఫోలీ ఇంటి గార్డెన్‌కి ఒక ప్రత్యేకత ఉంది. అక్కడ మీకు మొక్కలరూపంలో ఉన్న మనుషుల ముఖాలు కనిపిస్తాయి. తన గార్డెన్‌లో మొక్కల్ని మనుషుల ముఖ ఆకృతుల్లో ఆమె ట్రిమ్ చేసింది. మిచెల్లె ఒక ఆర్టిస్ట్ కాబట్టే అలా చెయ్యగలిగింది. ఆర్టిస్ట్ కళ్ళకు ఏ వస్తువైనా కళాత్మకం గానే కనబడుతుంది. అందులోనూ మిచెల్లె ముఖాకృతులను తీర్చిదిద్దటంలో సిద్ధహస్తురాలు. దాంతో ఆమె తన ఇంటి గార్డెన్‌లోని మొక్కల్లో తన కుటుంబసభ్యుల ముఖాకృతులనే తీర్చిదిద్దింది. ముఖ్యంగా తన ఇద్దరు పిల్లల ముఖాకృతుల్ని తీర్చిదిద్దింది. కొడుకు బెన్నన్‌కు కళ్ళజోడు ఉంది. దాన్ని అమర్చడానికి పెద్ద తతంగమే జరిగిందంటోంది మిచెల్లె. పనికిరాని ప్లాస్టిక్‌తో కళ్ళజోడు తయారుచేసి ఆ ముఖానికి అమర్చింది. కాకపోతే ఎప్పటికప్పుడు వాటిని ట్రిమ్ చేస్తూ, రూపాన్ని కాపాడటంలోనే కాస్తంత ఇబ్బంది ఉందని చెబుతోంది.





## శతాధిక వృద్ధుని స్కైడైవింగ్

ఎవరైనా పుట్టినరోజునాడు ఏం చేస్తారు? చక్కగా గుడికెళ్ళి ఆ భగవంతుని ఆశీస్సులు కోరి ఆ రోజంతా ఆనందంగా గడుపుతారు. స్నేహితులకి పార్టీ, కేక్ కటింగ్ వంటివి ఉంటాయి. కానీ ఈ తాతగారు మాత్రం అందుకు భిన్నంగా పుట్టినరోజునాడు తనకెంతో ఇష్టమైన స్కై డైవింగ్ చేసి ఎంజాయ్ చేశాడు. తాతగారు స్కై డైవింగ్ చేశారంటే ఏ యాభై అరవై ఏళ్ళో ఉంటాయనుకోకండి. శతాధిక వృద్ధుడు. పేరు వెర్డన్ హేస్. ఇంగ్లండ్‌లోని బర్మింగ్‌హామ్ నివాసి. వంద సంవత్సరాలు పూర్తిచేసుకుని 101వ సంవత్సరంలోకి అడుగుపెట్టిన సందర్భంగా డెవన్‌లో 15 వేల అడుగుల ఎత్తులో ప్రయాణిస్తున్న విమానంలోంచి స్కై డైవింగ్ చేసి తన ముచ్చట తీర్చుకున్నాడు. అంతేకాదు ప్రపంచంలో స్కై డైవింగ్ చేసిన అతిపెద్ద వయస్కునిగా ఘనత సాధించాడు. ఇంతకుముందు కెనడియన్ ఆర్మండ్ గెండ్రూ పేరు మీద ఉన్న ఈ ఘనత ఇప్పుడు ఈ తాతగారి సొంతమైంది.

## నాలుకతో ఆర్పేశాడు

అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళా కాదేదీ రికార్డుకనర్హం అని నిరూపిస్తున్నాడు న్యూయార్క్ నివాసి ఆశ్రిత ఫర్మాన్. టకటకా అగ్గిపుల్లలు ఆర్పేసి, గిన్నిస్ రికార్డుల్లో చోటు సంపాదించుకున్నాడు. అగ్గిపుల్లలు ఆర్పితే రికార్డు అవుతుందా? అనే సందేహం వద్దు. అతను అగ్గిపుల్లలను మామూలుగా ఆర్పలేదు. అందుకు తన నాలుక ఉపయోగించాడు!

జమైకాలోని శ్రీ చిన్మయ సెంటర్‌లో ఈ ఫీట్ చేశాడు 61 సంవత్సరాల ఫర్మాన్. ఒక్కొక్క అగ్గిపుల్లా వెలిగించి వాటిని నాలుకతో ఆర్పేశాడు. అలా కేవలం ఒక్క నిమిషం వ్యవధిలో 37 అగ్గిపుల్లలు వెలిగించి నాలుకతో ఆర్పేసి తన రికార్డును తిరగరాశాడు. ఇక్కడ రూలేంటంటే ఒకసారి ఒక్క అగ్గిపుల్లను మాత్రమే వెలిగించాలి. శ్వాస ద్వారా అవి ఆరిపోకూడదు. ఇదంతా ఒక్క నిమిషంలోనే జరగాలన్నమాట. అలా 37 అగ్గిపుల్లల్ని ఆర్పి గిన్నిస్ రికార్డు సొంతం చేసుకున్నాడు.



## సంచార మందుల విక్రేతలు

కూరగాయలు, పండ్లు తట్టల్లో బుట్టల్లో పెట్టి అమ్ముతుంటారు. వీధి వీధంతా వినబడేట్టు అరుస్తుంటారు. కానీ తట్టల్లోపెట్టి మెడిసిన్స్ అమ్మటం ఎక్కడైనా చూశారా? హైతీ దేశంలో అంతేనండి. కూరగాయలమ్మినట్టు మెడిసిన్స్ తట్టల్లోపెట్టుకుని వీధివీధి తిరిగి అమ్ముతారు. బాగా వెనుకబడిన దేశం హైతీ. రాజధాని పోర్ట్ ఓ ప్రిన్స్‌లో ఫార్మసీ షాపులుండవు. అమ్మకాలన్నీ బుట్టల్లోనే. లైసెన్స్‌తో పనిలేదు. ఏ రోగానికి ఏ టాబ్లెట్ ఇవ్వాలో కూడా వాళ్ళకి తెలియదు. వివిధరంగుల్లో ఉన్న టాబ్లెట్లను బుట్టల్లో ఆకర్షణీయంగా అమరుస్తారు. ఆ టాబ్లెట్ల రంగులే వినియోగదారులను ఆకర్షిస్తాయట. అయినా అక్కడి ప్రజలు ఆ మందులనే వినియోగిస్తుంటారు.



–నర్మద వాసిరెడ్డి

# ఆస్తమా - నివారణ హోమియో చికిత్స

మానవుడు జీవించాలంటే ప్రతిక్షణం శ్వాసఎంతో ముఖ్యం.నీరు, ఆహారం లేకపోయిన కొన్ని రోజుల వరకు జీవించగలడు. కాని కొన్ని క్షణాలు శ్వాస లేక పోతే శరీరం నిర్జీవమైపోతుంది, స్వచ్ఛమైన గాలితో మంచి ఆరోగ్యం సమకూరుతుంది. ఆస్తమా వలన దైనందినజీవితంలోచాలాఇబ్బందులుఎదుర్కొం టూరు. ఏవైనా వాతావరణంలోమార్పులు, ఆహారంలో మార్పులు, కాలుష్యం, పొగత్రాగడంవలన ఆస్తమా, విజృంభిం చడంతో చాలా ఇబ్బందులు ఎదుర్కొం టూరు. ఎక్కడికి వెళ్ళాలన్నా అభద్రత భావనకు లోనవుతారు. ఆస్తమా వలన మరణించేవారు... బీదదేశాలలో, బీదకుటుంబా లలో ఎక్కువ. ఆస్తమా వలన హాస్పిటల్‌లో చేరే వారి సంఖ్య పిల్లలలో ఎక్కువ. ఆస్తమా అనగా సేచ్ఛ లేని శ్వాస, ఊపిరితిత్తులు, దీర్ఘకాలిక శ్వాసకోశ ఇబ్బందినే ఆస్తమా అంటారు. ముఖ్యంగా ఆస్తమా వ్యాధిగ్రస్తులలో అలర్జీ, రియాక్షన్ వల్ల శ్వాసకోశం లో, ఊపిరితిత్తులలో గాలి మార్గంలో శ్వాస పీల్చు కోవటంలో అవాంతరం ఏర్పడుతుంది. ఫలితం గా పిల్లికూతలు, దగ్గు, ఆయాసం, ఛాతీలో నొప్పి వస్తాయి. **ఆస్తమాకు ముఖ్య కారణాలు:** చల్లగాలి (చల్లటి వాతావరణం) దుమ్ము,ధూళి, పొగ(సిగరెట్) అలర్జెన్స్, గడ్డిచెట్లు, ఫంగస్, పొల్యూషన్ అధిక శారీరక శ్రమ వైరల్ ఇన్‌ఫెక్షన్ పిల్లి, గుర్రం, కుక్కవంటి పెంపుడు జంతువుల విసర్జక పదార్థాలు శ్వాసకోశ ఇన్‌ఫెక్షన్స్ ముఖ్యంగా పిల్లలలో... రోగ **నిర్ధారణ:** వంశానుగత చరిత్ర, అలర్జీలు, ఎగ్జిమా, చర్మవ్యాధులు, చిన్నతనంలో శ్వాసకోశ వ్యాధులు శారీరక పరీక్షలు, ముక్కు గొంతు, ఛాతీ పరీక్షలు ఎక్స్-రే, కఫం పరీక్ష, పి.ఎఫ్.టీ అలర్జీ చర్మపరీక్షలు:. అలర్జెన్స్‌ను ఇంజెక్షన్ ద్వారా ఇచ్చి రియాక్షన్ చూడటం. **స్పైరోమెట్రీ:** శ్వాస మీటర్‌ద్వారా పరీక్ష గుండె, ఊపిరితిత్తులు, రక్త లోపం, కిడ్నీ వ్యాధులు, జీర్ణకోశ వ్యాధులు ఏవైనా ఉంటే వాటి నిర్ధారణ. ఆస్తమాతో జీవించడమెలా? 1.ఆస్తమాతో రోజు వారి పనులు చేసుకునేలా ప్రోత్సహించాలి. 2.రాత్రి, పొద్దున్న వచ్చే శ్వాస ఇబ్బందులను నివారించటం, నిర్మూలించటం, తగ్గించటం, 3.ఎక్కువ శారీరక శ్రమలేని ఉపాధి ఏర్పాటు చేసుకోవటం.4. దుమ్ము ధూళి, పొగ, చల్లటి వాతావరణం నుండి దూరంగా ఉండటం. 5.ప్లాస్టిక్ బ్యాగ్స్, కార్పెట్స్, బెడ్‌షీట్స్, బెడ్స్, బ్లాంకెట్స్‌లో డస్ట్‌మైట్స్ (చిన్నపరాన్నజీవులు) ఉంటాయి. కాబట్టి 10 రోజులకోకసారి ఎండలో వేయుటం, నీటితో శుభ్రం చేయడం. 6. పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం చేయాలి.

**రోగనివారణ:**బ్రాంకోడైలేటర్స్, కార్టికో,స్టీరాయిడ్స్, యాంటీబయాటిక్స్, స్ప్రేమందులు.. వీటి వలన వెంటనే ఉపశమనం కలుగుతుంది. కాని వ్యాధి మళ్ళీ తిరగబెడుతుంది. ధీర్ఘకాలికంగా మందులు వాడటం వలన సైడ్‌ఎఫెక్ట్స్, పిల్లల పెరుగుదల లోపాలు, మానసికఆందోళన, జ్ఞాపకశక్తితగ్గటం,బరువు


**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**




పెరగటం వంటివి జరగవచ్చు. యోగా, మెడిటేషన్, చేయడం మంచిది. పొగత్రాగడం,కాలుష్య పదార్థాలకు దూరంగా ఉండటం. స్వచ్ఛ మైన గాలి, నీరు ఉన్న ప్రదేశాలలో నివసించటం బాగా సివియర్ ఆస్తమా వచ్చే వారిలో అది ఆ ప్రదేశం ప్రభావంవల్ల కావచ్చు. ఇలాంటప్పుడు వారు స్థిరపడిన చోటునుంచి వీలైతే ఇతర ప్రదేశానికి మారడం మంచిది.

**హోమియోవైద్యం:**ఈ వైద్యవిధానం ద్వారా ఆస్తమాకు చక్కటి చికిత్సను అందించవచ్చు. ముఖ్యంగా పిల్లలలో అలర్జీలు, శ్వాసకోశ ఇబ్బందు లకు... వారి శారీరక, మానసిక విశ్లేషణ ద్వారా తగిన కాన్‌స్టిట్యూషనల్ ఔషదాన్నిగుర్తించి చికిత్సజరిపితేవ్యాధిని సమూలంగా తగ్గించ వచ్చును.

**వాడదగిన మందులు:**

ఆంటిమ్‌టార్ట్, ఆంటిమోనిమ్, ఆర్స్ ఆర్సినిక్ ఆల్బ్ స్పాంజియా, నాట్రంసల్ఫ్ ఆరేలియా, కార్బొవెజ్.



# సంతానలేమి సమస్యకు పరిష్కారం సాధ్యమే

పాశ్చాత్యదేశాల్లోలాగే ఇప్పుడు మనదగ్గర కూడా పని సంస్కృతి విపరీతంగా పెరిగిపోయింది. తమరంగంలో రాణిం చడం కోసం రాత్రి-పగలు తేడా లేకుండా కృషి చేయడం అన్నది ఇప్పుడొక సాధారణ అంశంగా మారింది. దాంతో సరైనవయసులో పెళ్లి కాక, పెళ్లైన వాళ్లలో కూడా పై కారణాల వల్ల మానసిక ఒత్తిడి విపరీతంగా పెరిగి సంతానం కలగ డానికి అవసరమైన హార్మోన్లస్రావాలుసరిగ్గా జరగక, సమస్యలు తలెత్తి, అవి సంతానలేమికి దారి తీస్తున్నాయి. అయితే ఆధునిక విజ్ఞానం పెరిగిన ఈ రోజుల్లో సంతానలేమికి చక్కటి పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి కనుక ఆందోళన చెందనవసరం లేదు.చాలామంది మహిళల్లో నెలసరి సమస్యలున్నా, స్త్రీలలో భర్త కన్నా భార్య వయసు ఎక్కువగా ఉన్నా లేదా భార్యా భర్తలిద్దరూ ఎలాంటి సంతాన నిరోధక పద్ధతులు పాటించకుండా సంవత్సర కాలం పాటు సంతానం కోసం ప్రయత్నించినా గర్భధారణ జరగకపోవచ్చు. మరి కొంతమందిలో కేవలం ఏడాది మాత్రమే గాక.. ఏళ్లు గడుస్తున్నా గర్భం రాకపోవచ్చు. స్త్రీలకే కాదు.పురుషులకు కూడా.. సంతానం కలగలేదంటే అందుకు మహిళను కారణంగా చూపడం మన సమాజంలో పరిపాటి. ఇది కేవలం అపోహ మాత్రమే. సంతానలేమికి కారణాలన్నవి అటు మహిళలలోనూ, ఇటు పురుషుల లోనూ లేదా ఒక్కోసారి ఇద్దరిలోనూ ఉండవచ్చు. అంటేదంపతులిద్దరిలో లోపం ఎవరిలోనైనా ఉండవచ్చునన్న మాట. పురుషుల్లో వీర్యకణాల సంఖ్య తగినంతగా లేకపోవడం కూడా సంతానలేమికి కారణం కావచ్చు. అలాగే స్త్రీలలోనైతే హార్మోన్ల లోపం, థైరాయిడ్ సమస్య, పీసీఓడి వంటి అనేక అంశాలు సంతానలేమికి కారణం కావచ్చు. దంపతులిద్దరూ ఎలాంటి గర్భనిరోధక సాధనాలు వాడకుండా, సంతాన నిరోధక ప్రక్రియలను అనుసరించకుండా.. తమ దాంపత్య జీవితాన్ని గడిపితే సాధారణంగా ఏడాదిలోపు 75% మందిలో గర్భం వస్తుంది. ఇక యాభై శాతం మందిలో ఐదు మాసాల లోపే 50% మందిలో గర్భం వస్తుంది. రెండేళ్లలో 90% మందిలో గర్భం వస్తుంది. కానీ ఎవరిలోనైనా అంతకాలం తర్వాత కూడా గర్భం రాలేదంటే, ఏదైనా సమస్య ఉందేమోనని భావించాలి. సమస్యను తెలుసుకోవడానికి స్త్రీలు ముందుకు వచ్చి వైద్య పరీక్షలు చేయించుకున్నట్లుగా, పురుషులు అంత తేలిగ్గా ముందుకు రారు. **సంతానలేమికి ముఖ్య కారణాలు..** మన జీవనశైలితో పాటు కాలుష్యం, వాతావరణం,పొగ తాగడం, మద్యం సేవించడం, బిగుతైన దుస్తులు ధరిం చడం, అధికబరువు, మానసిక ఒత్తిడి, కొన్ని రకాల మందులు, ఆరోగ్యకరమైన వీర్యం ఉత్పత్తిపై ప్రభావం చూపిస్తాయి. పురుషుల్లో శుక్రకణాల సంఖ్య తగినంతగా లేకపోవడం, ఉన్నా... వాటిలో తగినంత చురుకుదనం లేకపోవడం వంటి లోపాలు ఉన్నప్పుడు వారి భాగస్వామి కి గర్భధారణ జరగడం కష్టమే, మరికొందరి వీర్యంలో అసలుశుక్రకణాలేఉండకపోవచ్చు. ఇక మహిళ విషయా నికి వస్తే.. నెలసరి సమస్యలు, అండాల విడుదల సరిగా లేకపోవడం లేదా విడుదలైన అండాలలో నాణ్యత లోపించడం వంటివి ప్రధాన కారణాలు, వయసు పెరిగే కొద్దీ అబార్షన్లు అయ్యే అవకాశాలూ ఎక్కువే. మహిళ వయసు 30 ఏళ్లు దాటాక సంతాన అవకాశాలు తక్కువగా ఉంటాయి. **సంతానలేమికి ఇప్పుడు అందుబాటులో ఉన్న ఆధునిక పరిష్కారాలు...** సంతాన లేమి ఉన్న వారికి ఇప్పుడు మూడు రకాల పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి. అవి 1) ఐ.యు.ఐ.భర్తనుంచి సేకరించిన వీర్యాన్ని ల్యాబ్‌లో పరీక్షించి, దానిలో నుంచి ఆరోగ్యంగా, చురుగ్గాఉన్న కణాలను మాత్రం వేరు చేసి సిద్ధం చేస్తారు. వాటిని ఒక సన్నని గొట్టం ద్వారా స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశ పెడతారు. ఈప్రక్రియను అనుసరించడం వల్ల గర్భధారణకు 15% వరకు అవకాశం ఉంటుంది. ఇలా ఆరు రుతుచక్రాల పాటు ఈ చికిత్స చేసినా ఫలితం లేకుంటే అప్పుడు ఐ.వి.ఎఫ్ అనే ప్రక్రియను అనుసరించవచ్చు. 2)ఇక్సీ: స్త్రీ నుంచి సేకరించి న అండా ల్లోకి, పురుషుని శుక్ర కణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మానిప్యు లేటర్ సహాయంతో ప్రవేశ పెట్టి ఫలదీకరణం చెందిస్తారు. వాటిని తిరిగి గర్భాశయం లోకి ప్రవేశపెడతారు. ఈ పద్ధతి ద్వారా గర్భధారణ విజయవంతం కావడానికి 40% వరుకు అవకాశాలు ఉంటాయి. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్నవారిలో ఈ ప్రక్రియ మరింత ఉపయోగకరంగా ఉంటుంది.

3) ఐ.వి.ఎఫ్: దీన్నే టెస్ట్‌ట్యూబ్ విధానం అంటారు. ముందు గాపక్వమైనఅండాలను స్త్రీ నుంచి బయటకుతీసి, పురుషుడి శుక్ర కణా లతో బయటే ఫలదీకరణం చెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలి దశపిండాల్లో రెండు లేదా మూడింటిని తిరిగి స్త్రీ గర్భా శయం లోకి ప్రవేశపెడతారు. ఈ ప్రక్రియ ద్వారా సంతానం కలగడానికి 30 నుంచి 35% విజయావకాశాలు ఉంటాయి. ఇటీవలి కాలంలో సంతాన సాఫల్యత చికిత్సలో మరెన్నో కొత్త విధానాలు అందుబాటు లోకి వచ్చాయి. ఫలదీకరించిన పిండాలలో అతిశీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత వాటిని వాడతారు. అవసరాన్ని బట్టి అండాలను గాని శుక్రకణాలను గాని దాతల నుంచి స్వీకరించి వాడతారు. అందుకే సంతానం కలగడం లేదని ఏళ్ల తరబడి బాధపడే కన్నా ఆధునిక పద్ధతులు అనుసరించడం శ్రేయస్కరం.


**- డా॥ సి.జ్యోతి ఫర్టిలిటీ స్పెషలిస్ట్**
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**





# కొత్త రాష్ట్రపతి నుంచి దేశం ఏం ఆశిస్తోంది?

**రాష్ట్రపతి తన ప్రవర్తన, వ్యవహారశైలితో దేశ చరిత్రనే తిరగరాయగలిగి ఉండాలి. దేశా నికి దిశానిర్దేశం చేయగలిగి ఉండాలి.**

**ఎన్నికల కమిషన్ నోటిఫికేషన్‌తో రాష్ట్రపతి ఎన్నికల ప్రక్రియ ఊపందుకుంది. పాలక, ప్రతిపక్షాలు తమ తమ అభ్యర్థులను ఎంపిక చేసుకోవడంలో నిమగ్నమయ్యాయి. నిజానికి, సగం మందికి మౌలిక సదుపాయాలు కూడా లేని భారతదేశంలో రాష్ట్రపతి పదవి అన్నది భారీ వ్యయప్రయాసలతో కూడుకున్న విషయమే.**

రాష్ట్రపతి ఎక్కువ కాలం ఎవరికీ కనిపించరు. రాష్ట్రపతి భవన్‌కే ఎక్కువ కాలం పరిమితమై ఉంటారు. పెట్టమన్న చోట సంతకాలు పెట్టడం తప్ప ఆయన పోషించాల్సిన పాత్రేమీ లేదు. రాజ్యాంగం ఆయన కాళ్లూ చేతులూ పూర్తిగా కట్టి పడేసిందనడంలో సందేహం లేదు. అందువల్ల దేశానికి రాష్ట్రపతి పదవి అన్నది దాదాపు అలంకారప్రాయంగా మారిపోయింది. దేశాధ్యక్షుడి అధికారాల గురించి తరచూ చర్చ జరుగుతుంటుంది కానీ, దాని వల్ల పెద్దగా ఒరిగేదేమీ కనిపించడం లేదు.

ఇంతవరకూ పదమూడు మంది ఈ పదవిని నిర్వహించారు. ఇందులో నలుగురైదుగురే దేశ ప్రజలు ఆశించిన స్థాయిలో తమ విధులు నిర్వర్తించారు. మిగిలినవారంతా ఈ పదవిని మరింత అలంకారప్రాయం చేయడంతప్ప ప్రజలు నిరంతరం గుర్తుంచుకునే సేవలేమీ చేయలేదు. ఇందుకు కారణాలు అనేకం ఉన్నాయి. అధికారంలో ఉన్న పార్టీకి ఈ పదవిలో ఉన్నత ప్రమాణాలు, ఉన్నతాశయాలు, స్వతంత్ర ప్రవృత్తి, నైతిక విలువలు, వృత్తిపరమైన, మేధోపరమైన నైపుణ్యాలు ఉండడం, ప్రభుత్వంలో జవాబు దారీ పెంచడానికి కృషి చేయడం వంటి లక్షణాలు ఉండడం ఏమాత్రం ఇష్టం లేకపోవడం ఇందులో ఒక కారణం. రాష్ట్రపతి ప్రజలకు ఆదర్శంగా, ప్రజల ఆశయాలకు అనుగుణంగా ఉండాలనే ఉద్దేశంతో రాజ్యాంగం ఆయనను పార్లమెంట్‌లో భాగం చేసినప్పటికీ, పాలక పక్షాలు మాత్రం ఆ సదాశయాన్ని పూర్తిగా నీరు కార్చేశాయి. రాష్ట్రపతి తమ చెప్పుచేతల్లో ఉండాలని, తాము ఎటువంటి పాట పాడినా దానికి అనుగుణంగా తాళం వేయాలని, ఆయన అనుభవాలు, మేధో సంపత్తిని వినియోగంలోకి తేకూడదని పాలక పక్షాలు భావించడం మొదలుపెట్టాయి. పాలక, ప్రతిపక్షాలు రాష్ట్రపతి పదవిని తమ ఆధిపత్య పోరాటంలో భాగం చేసేశాయి.

ఈసారి కూడా ఇదే జరుగుతోంది. రాష్ట్రపతి పదవికి అభ్యర్థి ఎంపిక గతంలో కంటే భిన్నంగా ఏమీ జరగడం లేదు. అభ్యర్థుల ఎంపిక విషయంలో వివిధ రాజకీయ పార్టీలు వ్యవహరిస్తున్న తీరు రాష్ట్రపతి పదవికి మరో కీలుబొమ్మ కోసం పార్టీలు ఆరాట పడుతున్నట్టు కనిపిస్తోంది. తమ తమ అహంకారాలు, ఆధిపత్యాలకు తగ్గట్టుగానే అభ్యర్థిని ఎంచుకోవడమనే పద్ధతికి ఈసారి ఎన్నిక ఏమాత్రం భిన్నంగా ఉండే అవకాశం కనిపించడం లేదు. ఈసారైనా ఈ పద్ధతి మారితే దేశానికి ఈ పదవి వల్ల ఉపయోగముంటుందని ఆశిస్తున్న ప్రజలకు, అటువంటి ఆశలేమీ పెట్టుకోవద్దనే రాజకీయ పరిశీలకులు సూచిస్తున్నారు. రాష్ట్రపతి ఎన్నిక కేవలం కొందరు ప్రజాప్రతినిధులకే పరిమితం కావడం వల్లే ఇటువంటి దుస్థితి నెలకొంటోందని పరిశీలకులు చెబుతున్నారు.

### పరిధి పెంచాలి!

పరిశీలకుల అభిప్రాయం ప్రకారం, రాష్ట్రపతి అభ్యర్థి ఎంపిక ప్రక్రియ కేవలం రాజకీయ పార్టీలకు మాత్రమే పరిమితం కాకుండా మరింత విస్తరించాలి. వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు, కార్మిక సంఘాల నాయకులు, వృత్తి నిపుణులు, శాస్త్ర, సాంకేతిక, న్యాయ, వ్యాపార, వాణిజ్య, పరిశ్రమ, మహిళలు, స్వచ్ఛంద సేవా సంస్థలు, విద్య, విద్యార్థి...వంటి రంగాలకన్నిటికీ విస్తరించాలి. ఈ రంగాలవారితో కూడా సంప్రదించాలి. దీనివల్ల రాష్ట్రపతి అభ్యర్థి ఎన్నిక వ్యవహారంలో మొత్తం భారతీయ సమాజం పాల్గొన్నట్టు అవుతుంది. ఇంతవరకూ మౌనంగా, ఎవరికీ పట్టకుండా కేవలం ప్రేక్షకుల్లా ఉండిపోయిన ప్రజలు రాష్ట్రపతి పదవికి ప్రాధాన్యం పెంచడానికి రాజ్యాంగ సవరణ చేపట్టాలని డిమాండ్ చేయాలి. రాష్ట్రపతిని ఎన్నుకునే ఎలక్టోరల్ కాలేజీలో కేవలం ఎంపీలు, ఎమ్మెల్యేలు, మంత్రులు మాత్రమే కాకుండా, స్థానిక పాలనా వ్యవస్థల ప్రతినిధులు కూడా సభ్యులుగా చేయడం వల్ల కూడా ఆశించిన ప్రయోజనం సిద్ధిస్తుంది. దీనివల్ల మరో ప్రయోజనం కూడా అనుభవానికి వస్తుంది. పంచాయతీ రాజ్ సంస్థలు క్రమంగా ప్రజా పార్లమెంట్‌గా మారే అవకాశం ఉంటుంది. పరోక్ష ఎన్నికల్లో ఉండే పరిమితిని తొలగించడానికి కూడా ఇది ఉపకరిస్తుంది. అంతేకాదు, రాష్ట్రపతి ఎన్నికలో తాము కూడా పాల్గొన్నామన్న తృప్తి ప్రజలకు కలుగుతుంది.

అటువంటి అభ్యర్థి రాష్ట్రపతిగా ఎన్నికైతే మంత్రి మండలికి, పార్లమెంటుకు మాత్రమే కాదు, దేశ ప్రజలందరికీ ఓ ముఖ్య స్నేహితుడిగా, మార్గదర్శిగా




గుర్తింపు పొందడానికి వీలుంటుంది. అటువంటి రాష్ట్రపతి ప్రజల ఆశయాలను, దేశ సమైక్యతను ప్రతిబింబిస్తాడు. రాజ్యాంగ నిర్మాతలు ఆశించిన స్థాయిలో ప్రథమ పౌరుడుగా ఉండడానికి కూడా అవకాశం ఉంటుంది. దేశ సుసంపన్న వారసత్వాన్ని, ఉన్నతాశయాలను, దేశ ప్రయోజనాలను కాపాడాలంటే ఆ రాష్ట్రపతి రాజకీయాలకు అతీతంగా వ్యవహరించగలిగి ఉండాలి. దేశానికి ఆదర్శవంతమైన వ్యక్తిగా, మార్గదర్శకత్వం నెరపగలిగిన వ్యక్తిగా రాష్ట్రపతి ఉండాలంటే అందుకు ఈ ఎన్నికల నుంచే పునాది పడాలి.

కొత్త అధికారాలు, బాధ్యతలను నిర్వర్తించే విషయాన్ని అటుంచి, రాజ్యాంగం నిర్దేశించిన బాధ్యతలు, కర్తవ్యాలను నిర్వర్తించడం కూడా రాష్ట్రపతికి అసాధ్యమైపోతోంది. ఈ పదవిని నిర్వహించే వ్యక్తి హీనపక్షంగా నిర్వర్తించాల్సిన బాధ్యతలు మోయలేని భారాలేమీ కాదు. అసలు రాష్ట్రపతికి ఉండాల్సిన లక్షణాలు కూడా సామాన్యమైనవే. రాష్ట్రపతి నిరాడంబర, సాధారణ జీవితం గడపగలిగి ఉండాలి. విలాసవంతమైన, ఆడంబర జీవితానికి ఎలా అతీతంగా ఉండవచ్చో ఏపీజే అబ్దుల్ కలాం తన చేతలు, మాటల ద్వారా నిరూపించారు. రాజకీయంగా, ప్రభుత్వపరంగా ఎన్ని ఆటుపోట్లు, ఒత్తిడి ఎదురైనా ప్రజలకు జవాబుదారీగానే వ్యవహరించాలి. రాజ్యాంగానికి, చట్టాలకు కట్టుబడి ఉంటానని రాష్ట్రపతి ప్రమాణ స్వీకారంలో చెప్పినప్పటికీ, ఆయనకు ప్రజా సేవ పట్ల, ప్రజల సంక్షేమం పట్ల కూడా శ్రద్ధాసక్తులు ఉండాలి. రాజ్యాంగానికి కట్టుబడి ఉంటానంటే దాని ఉద్దేశం ప్రతిదానికీ మౌన ప్రేక్షకుడిలా ఉండిపోవడం కాదు. ప్రభుత్వం, పాలకులు రాజ్యాంగానికి విరుద్ధంగా వ్యవహరించకుండా ఉండడం, రాజ్యాంగం సృష్టించిన వ్యవస్థలు, సంస్థలు నిర్వీర్యం కాకుండా చూడడం కూడా రాష్ట్రపతి బాధ్యతలే.

## ప్రజలే ముఖ్యం

అన్నిటికన్నా ముఖ్యంగా ప్రజల ఆశయాలకు, ఆకాంక్షలకు స్పందించి, అందుకు అనుగుణమైన చర్యలు తీసుకోవడం కూడా రాష్ట్రపతి బాధ్యతే. ప్రజల నుంచి వచ్చే లేఖలు, అభ్యర్థనలు, ప్రాతినిధ్యాలు, వినతులపై వెనువెంటనే స్పందించి, ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చి, అవి పూర్తయ్యేలా, పరిష్కారమయ్యేలా కూడా రాష్ట్రపతి ప్రయత్నించాలి. ప్రజల నుంచి ఏవైనా విజ్ఞప్తులు అందినప్పుడు వాటిని సంబంధిత మంత్రులకో, అధికారులకో రాష్ట్రపతి పంపించి, చేతులు దులిపేసుకోవడం ఇప్పటి వరకూ ఆనవాయితీ. అయితే, ఈ విజ్ఞప్తులను సీరియస్‌గా తీసుకోవడం, అవి పరిష్కారమయ్యేలా చూడడం రాష్ట్రపతికి తిరుగులేని బాధ్యత కావాలి. కేవలం పోస్ట్‌మేన్‌గా వ్యవహరించే రాష్ట్రపతి ఇక నుంచయినా, ప్రజల విజ్ఞప్తుల విషయంలో ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకు రావడం, సంబంధిత ప్రజలకు దాని గురించి తెలియజేయడం రాష్ట్రపతికి అవసరం. ప్రభుత్వం చర్య తీసుకోవడానికి రాష్ట్రపతి కనీసం రెండు నెలల గడువు కూడా నిర్దేశించడం అనివార్యం.



రాష్ట్రపతి దేశ పర్యటనలు చేయడం ఆయన బాధ్యతల్లో ముఖ్యమైన భాగం. ఆయన తరచూ పర్యటనలు చేయడం, మారుమూల ప్రాంతాలకు సైతం వెళ్లడం వల్ల దేశ ప్రజలకు ఉపయోగముంటుంది. దీనివల్ల అన్ని వర్గాల ప్రజలకూ చేరువైనట్లవుతుంది. అందరికీ అందుబాటులో ఉన్నట్టవుతుంది. ప్రజాసేవలో నిమగ్నమై ఉన్న వ్యక్తులకు, సేవా సంస్థలకు స్ఫూర్తి నిచ్చినవారవుతారు. ప్రజల సమస్యలను ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి, బలహీనవర్గాలకు అండగా నిలవడానికి అవకాశం ఏర్పడుతుంది. యువతతో, మహిళలతో మాటా మంతీ నెరపడం వల్ల జాతి నిర్మాణ కార్యకలాపాల్లో వారిని భాగస్థులు చేయడానికి వీలవుతుంది. ప్రభుత్వాలు చేపట్టే పథకాలు, కార్యక్రమాల పురోగతిని ప్రత్యక్షంగా చూడడానికి, వాటిని వేగవంతం చేయడానికి, ప్రభుత్వానికి తగిన సలహాలు, సూచనలు చేయడానికి మార్గం ఏర్పడుతుంది.

ప్రభుత్వానికి సంబంధించిన ప్రతి ఫైలూ తప్పనిసరిగా రాష్ట్రపతి ఆమోదముద్ర పొందాలని రాజ్యాంగం నిర్దేశిస్తోంది. రాష్ట్రపతి తన దగ్గరకు వచ్చే ప్రతి ఫైలునూ క్షుణ్ణంగా పరిశీలించి, మొహమాటం లేకుండా తగిన సూచనలు చేయడం వల్ల అటు ప్రజలకు, ఇటు ప్రభుత్వానికి ప్రయోజనం ఉంటుంది. అవసరమైనప్పుడు, అనివార్యమైనప్పుడు ప్రభుత్వానికి సలహాలివ్వడం, ప్రోత్సహించడం, మంత్రులను హెచ్చరించడం వల్ల దేశ ప్రయోజనాలు మరింత సిద్ధిస్తాయి. తన దగ్గరకు వచ్చే బిల్లులు, ప్రతిపాదనల విషయంలో కూడా రాష్ట్రపతి కచ్చితమైన పంథాను అనుసరించాల్సి ఉంటుంది. పాలక పక్ష ప్రయోజనాలకు కాకుండా దేశ ప్రయోజనాలకు, ప్రజా ప్రయోజనాలకు ఆయన పెద్ద పీట వేయాల్సి ఉంటుంది. దేశంలో జరిగే అభివృద్ధిని ఆయన ఎప్పటికప్పుడు తెలుసుకోవడం కూడా అవసరం. వీలైనంత ఎక్కువ సంఖ్యలో సందర్శకులకు, అతిథులకు ఆయన అవకాశం ఇవ్వడం వల్ల ఆయన ప్రభుత్వానికి తగిన రీతిలో సలహాలు ఇవ్వడానికి, సూచనలు చేయడానికి అవకాశం కలుగుతుంది.



## నూతన ఆవిష్కారాలు

మొత్తం మీద రాష్ట్రపతి రాష్ట్రపతి భవన్‌ను రాజకీయేతరంగా ఉంచి, సరికొత్త ఆలోచనలకు, సృజనాత్మక విధానాల కల్పనకు నెలవుగా చేయాల్సిన అవసరం ఉంది. రాష్ట్రపతి గానీ, రాష్ట్రపతి భవన్ గానీ ఇప్పటి మాదిరిగా అప్రాధాన్యంగా మిగిలిపోవడం సమంజసం కాదు. రాజ్యాంగం నిర్దేశించిన అధికారాలు, బాధ్యతల పరిధిలోనే రాష్ట్రపతి దేశానికి వెలుగు కిరణం కావచ్చు. తాను స్వయంగా నిపుణులు, శాస్త్రవేత్తలు, అధ్యయనపరులు, చరిత్రకారులు, పరిశోధకులతో మాట్లాడుతూ, వారి అభిప్రాయాలను ప్రభుత్వానికి చేరవేయడం వల్ల శాస్త్ర సాంకేతిక రంగాలతో పాటు వ్యవసాయం, పరిశ్రమ, విద్య, సామాజిక సేవ, సాంకేతిక పరిజ్ఞానం వంటి రంగాలు మరింత అభివృద్ధి చెందడానికి దోహదం చేసినట్టవుతుంది. మహారాష్ట్ర గవర్నర్‌గా ఉండగా సి.సుబ్రహ్మణ్యం రాజ్‌భవన్‌ను ఇటువంటి కార్యకలాపాలకే వినియోగించేవారు. దేశ సర్వసైన్యాధికారిగా తనకున్న అధికారాలను ఉపయోగించి సైనిక సంక్షేమంలో కూడా కేంద్ర ప్రభుత్వానికి సలహాలు, సూచనలు ఇవ్వవచ్చు.

రాష్ట్రపతి కొన్ని బిల్లుల ఆమోదంలో తాత్సారం చేయడం దేశ ప్రయోజనాల దృష్ట్యా సమంజసం కాదు. ముఖ్యంగా రాష్ట్రాలకు సంబంధించిన బిల్లులకు ఆమోదముద్ర వేయడానికి గడువును, వ్యవధిని నిర్దేశించుకోవాలి. క్షమాభిక్ష, శిక్ష తగ్గింపు వంటి అభ్యర్థనల విషయంలో కూడా విపరీతమైన ఆలస్యాలు జరుగుతున్న నేపథ్యంలో రాష్ట్రపతి తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. సమయ పాలన, నిరాడంబరత, స్థితప్రజ్ఞతలతో రాష్ట్రపతి దేశ ప్రతిష్ఠను ఇనుమడింపజేయగలరు. కొత్త అధికారాలు, బాధ్యతల మాట అటుంచి, తనకు రాజ్యాంగం నిర్దేశించిన బాధ్యతలు, అధికారాల ద్వారా రాష్ట్రపతి దేశ గతిని, చరిత్రనే మార్చేయవచ్చు. పాలక పక్షంతో ఘర్షణకు అవకాశం లేకుండానే రాష్ట్రపతి దేశ ప్రయోజనాలకు తన వంతు సేవలు అందించవచ్చు.

నవ్య

# CRIME ఇది మల్లెల వేళయనీ...

**మధ్యాహ్నం సరిగ్గా పన్నెండు గంటల సమయం.**

**శివరామ్‌పూర్ స్టేషన్‌లో సబ్ ఇన్‌స్పెక్టర్ షిండే డ్యూటీలో ఉన్నాడు.**

**సరిగ్గా అదే సమయంలో రక్తసిక్తమైన కత్తిపట్టుకుని ఓ ఇరవైఏళ్ళ అందమైన అమ్మాయి పోలీస్‌స్టేషన్‌లో అడుగు పెట్టింది.**

**గేట్ దగ్గర సెంట్రీలు కొయ్యబారిపోయారు. ఇన్‌స్పెక్టర్ గదిముందు నిలబడిన కాని స్టేబుల్స్ భయంగా చూశారు. ఆమెను చూడగానే ఇన్‌స్పెక్టర్ షిండే చప్పున కుర్చీలోంచి లేచాడు.**

చేతిలో కత్తి బల్లమీద ఉంచి, "సార్! నేను ఓ హత్య చేశాను. రాజ్ అనే వ్యక్తిని ఈ కత్తితో పొడిచి చంపేశాను. నన్ను అరెస్ట్ చేయండి" అందామె.

సబ్ ఇన్స్పెక్టర్ షిండే ఆమె మనస్థితి అర్థం చేసుకున్నట్టు ఆమెవైపు సానుభూతిగా చూస్తూ కుర్చీలో కూర్చోమన్నాడు. గ్లాసుతో నీళ్ళు అందించి ఆమె తాగిన తరువాత నెమ్మదిగా ఒక్కొక్క ప్రశ్న వేస్తూ ఆమెనుంచి వివరాలన్నీ రాబట్టాడు.

***

తలుపులు తోసుకుని గదిలోకి అడుగుపెట్టి ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి రూప నిర్ఘాంత పోయింది.

ఎదురుగా...

మంచంపై పరిచిన తెల్లటి దుప్పటిమీద రాజ్, రోజీ! ఇద్దరూ నగ్నంగా ఒకరి కౌగిలిలో ఒకరు బందీలై ఉన్నారు. బలమైన రాజ్‌చేతుల్లో నలిగిపోతున్న రోజీ సుఖంతో చిన్నగా మూలుగు తోంది.

తలుపు తెరచుకున్న చప్పుడు కావడంతో ఇద్దరూ కౌగిలినుంచి వేరయ్యారు. వాళ్ళిద్దరి ముఖాల్లో ఒక్కక్షణం కదలాడిన భయం రూపను చూడగానే మాయమైంది.

"రూప, కాస్త పక్కగదిలో ఉండు ప్లీజ్! క్షణంలో వస్తాను" అంటూ రోజీ ఒంటికి దుప్పటి చుట్టు కుని బాత్‌రూంలో దూరింది. రూప బయటికి నడి చింది.

రూప బయటికి వచ్చిందన్నమాటేగానీ గదిలో చూసిన ఆ దృశ్యం ఆమె కళ్ళముందే నర్తించసాగింది. నరనరాల్లో ఏదో ఉద్రిక్తత. గుండెల్లో కంగారు. స్త్రీ పురుషులను అలాంటిస్థితిలో మొదటిసారి చూసిన ఆమెకు నోటమాట రాలేదు.

రోజీ డ్రెస్ చేసుకుని బయటికి వచ్చి రూప చేతులు పట్టుకుని "ప్లీజ్ రూప, ఈ విషయం ఎవ రికీ చెప్పకు. కావాలంటే నువ్వు కూడా మాతో కలవచ్చు" అంది.

ఒక్కక్షణం ఆమె మాటలు అర్థం కాక అయో మయంగా చూసింది.

తరువాత ఏదో భయంతో 'వస్తాను' అంటూ తన ఇంటికి పరుగు తీసింది.

రోజీ నవ్వుకుంది.

రూప ఎవరికీ చెప్పదని రోజీ ఊహించింది. అంతేకాదు, రూప మళ్ళీ తన దగ్గరకు వస్తుందని కూడా ఊహించింది. ఆమె ఊహించినట్టే రెండు రోజుల తరువాత రూప మెల్లిగా ఆ ఇంట్లో అడుగు పెట్టింది. ఆమె కోసమే ఎదురు చూస్తున్నట్టుగా రోజీ గుమ్మంలోనే నిలబడి నవ్వుతూ రూపను ఆహ్వానించి బెడ్రూమ్‌లోకి తీసుకెళ్ళింది. ఈసారి తడబడుతున్నకాళ్ళతో ఆ గదిలోకి అడుగు పెట్టింది రూప.

రూప ఊహించినట్టే రాజ్ విలాసంగా పక్క మీద పడుకుని ఉన్నాడు.

అతని కళ్ళు రూపను ఆసక్తిగా గమనిస్తు న్నాయి.

చాయ్ తెస్తానంటూ రోజీ గదినుంచి బయ టికి వెళ్ళింది.

రాజ్ ఎదుట తనను ఒంటరిగా వదిలివెళ్ళ డంతో రూప కంగారుపడింది. నేనూ వస్తానంటూ బయటికి వెళ్ళబోయింది. రాజ్ చేయిజాపి ఆమె చేయి పట్టుకున్నాడు.

**మంచంమీద నగ్నంగా ఓ ఇద్దరు. అతడి కౌగిలిలో నలిగిపోతూ ఆ సుఖానికి సన్నగా మూలుగుతోంది ఆమె. సడెన్‌గా తలుపులు తీసుకుని ఆ బెడ్రూములోకి ప్రవేశించిందో యువతి. లోపలి దృశ్యంచూసి తత్తరపడింది. అంతకు ముందు జీవితంలో తనెప్పుడూ అనుభ వించని, చూడని దృశ్యం! అలికిడికి లేచిన వాళ్ళిద్దరూ ఆమెను చూసి కంగారు పడలేదు! కానీ ఆ యువతి మనసు మాత్రం చెదిరిపోయింది. తర్వాత ఏం జరిగింది?**

రూప ఒంట్లో విద్యుత్ ప్రవహించినట్టయ్యింది. స్పృహ కోల్పోతున్నట్టు అనిపించింది.

మరుక్షణం రాజ్ ఆమెను దగ్గరకు లాక్కుని గట్టిగా కౌగలించుకున్నాడు.

తనకు ఏం జరుగుతోందో తెలియకుండానే రూప అతని చేతుల్లో ఒరిగిపోయింది.

పరువాలు పొంగుతున్న ఇరవైఏళ్ళ అందగత్తె దొరికిందన్న ఆనందంతో రాజ్ ఆమెను ఆక్రమించు కున్నాడు.

మరుక్షణం ఆ గదంతా వేడి ఊర్పులతో నిండిపోయింది.

***

ఆ సంఘటన జరిగిన తరువాత రూపకు ఈ కొత్త సుఖంపట్ల పిచ్చి పట్టినట్టయ్యింది.

రోజూ మధ్యాహ్నం కాగానే రోజీ వాళ్ళింటికి వెళ్ళేది. రూప రాకకోసమే ఎదురుచూస్తుండే రోజీ ఆమె రాగానే తలుపులు వేసేది. ఇలా కొన్నాళ్ళు జరిగింది.

ఓ రోజు రాజ్‌తోపాటు మరొక యువకుడిని గదిలో చూసిన రూప కలవరపడింది. ఆ సమ యంలో రాజ్ ఆ యువకుడిని ఎందుకు తీసుకొచ్చాడో ఆమెకు అర్థం కాలేదు. ఇంటికి వెళ్ళిపోవాలని వెనుదిరిగింది. అయితే రోజీ, రాజ్ ఆమెను ఆపారు. తమ ప్రియమిత్రుడే అంటూ రూపను ఆ కొత్త యువకుడిని గదిలో వదిలి బయటికి వెళ్ళారు. మొదట్లో కాస్త బెట్టుచేసినా ఆ కొత్త యువకుడి బలిష్ఠమైన శరీరం, అందమైన రూపం చూసిన రూప మెత్తబడిపోయింది.

ఆ రోజు ఆ కొత్త యువకుడు రూపకు స్వర్గ సుఖాలు అందించాడు.

ఆ తరువాత రూప ప్రతీరోజూ మధ్యాహ్నం రోజీ ఫ్లాట్‌లో అతడిని కలుసుకునేది.

అలా మూడురోజులు గడిచాయి. నాలుగవ రోజు ఆమె తన కౌగిలిలో ఉండగా,

"ఈ ఫిల్మ్‌లో నటించడానికి రాజ్ ఎంతి చ్చాడు?" అన్నాడతను.

"ఫిల్మా! ఏం ఫిల్మ్?" ఉలికిపడి అడిగింది రూప.

"బ్లూ ఫిల్మ్" అన్నాడతను.

"బ్లూఫిల్మా!? నాకేమీ అర్థం కావడం లేదు?" అని అతడిని దూరంగా తోసేసి చేతుల్లో ముఖం దాచుకుని రోదించసాగింది రూప.

"రూప, మనిద్దరం ఈ నాలుగురోజులుగా రకరకాల భంగిమల్లో పొందుతున్న సుఖాల తాలూకు దృశ్యాలను రాజ్ కెమెరాలో బంధిస్తున్న



విషయం నీకు నిజంగా తెలియదా?" అని ఆ యువ కుడు ఆశ్చర్యంగా అడిగాడు.

"లేదు. నాకేమీ తెలియదు" అని రూప ఏడుస్తూ తన బట్టలు తీసుకుని డ్రెస్ చేసుకోసాగింది.

"అంటే నువ్వు మోసపోయావన్న మాట" అతను సానుభూతిగా అంటూ లేచి తన దుస్తులు వేసుకుని బయటికి నడిచాడు.

అదే సమయంలో రాజ్ లోపలికి వచ్చాడు.

రూప కన్నీరుమున్నీరుగా విలపిస్తూ ఆ 'బ్లూ ఫిల్మ్‌లు' తనకు ఇచ్చేయమని అతడి కాళ్ళమీద పడి బతిమిలాడింది.

"భలే దానివే! అప్పుడే అంతా ఇచ్చేస్తే ఎలా? నువ్వు ఇంకా ఎన్నో ఫిల్మ్‌లో నటించాలి. నేను లక్షలు సంపాదించాలి" క్రూరంగా నవ్వుతూ అన్నాడు రాజ్.

"దుర్మార్గుడా! నా జీవితంతో ఎందుకిలా ఆడుకున్నావు? నేను నీకేం అపకారం చేశాను?" అంది.

"నేను చెప్పినట్టు వినకపోయావో ఇప్పుడే మీ నాన్నకు ఈ క్యాసెట్ కానుకగా పంపిస్తాను" బెదిరించాడు రాజ్.

రూప ఎన్ని విధాలుగా బతిమిలాడినా రాజ్ మనసు కరగలేదు.

ఆమె కళ్ళముందు ఒక్కసారిగా చీకట్లు కమ్ముకున్నాయి. ఆ ఫిల్మ్ గురించి తల్లిదండ్రులకు తెలిస్తే వాళ్ళు ఎంత బాధపడతారో, ఏమైపోతారోనని భయపడింది. ఇక ఆత్మహత్య ఒక్కటే శరణ్యం అనుకుంది. ఏడుస్తూ అక్కడి నుంచి బయలుదేరబోయింది.

'తొందరలో మరొక ఫిల్మ్ తీస్తాను రావాలి. రాకపోయావో?" అని రాజ్ కళ్ళెర్ర చేశాడు.

***

ఇంటికివచ్చి తనగదిలో తలుపులు వేసుకుని గుండెలు పగిలేలా రోదించింది రూప. తన తొందరపాటుకు, క్షణికావేశానికి పశ్చాత్తాపపడింది. ఆత్మహత్య చేసుకోవడంతప్ప తనకు మరో దారి లేదనుకుంది. అంతలో ఆమెకు రోజీ గుర్తు వచ్చింది. సాటి అడదై ఉండికూడా ఆమె తనను ఇలా ఈ ఊబిలోదించి మోసగించిందని రూప హృదయం రగిలిపోయింది. తన నిస్సహాయతకు కుమిలిపోయింది. అంతలోనే ఆమెలో ఆగ్రహం పెల్లుబికింది. కోపంతో ఆమె మనసు బుసలు కొట్టింది. వాళ్ళకి బుద్ధి చెప్పాల్సిందే అని గట్టిగా నిర్ణయించుకుంది. ఇంకెవరితోనూ వాళ్ళు అలా చేయకుండా ఉండాలంటే వాళ్ళను శిక్షించాలి, తనే ఏదో ఒకటి చేయాలనుకుంది.

ఆ రోజూ మధ్యాహ్నం పదకొండు గంటల సమయం...

ఎప్పటిలాగే రోజీ ఇంట్లో కాలు పెట్టింది రూప. రాజ్ ఆమెను చూడగానే దగ్గరకు లాక్కున్నాడు.

అరగంట గడిచింది.

ఆమె లేచి బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది.

ఆమెకు తెలుసు తను ఇటు రాగానే రోజీ ఆ గదిలోకి వస్తుందని!

రాజ్‌తో ఏ స్థితిలో ఉంటుందో కూడా ఆమెకు తెలుసు!

కొద్దిసేపటి తరువాత ఆమె బాత్‌రూమ్ తలుపు తెరచుకుని మెల్లగా బయటికి వచ్చింది. పక్క మీద రాజ్ రోజీ ఒకరినొకరు పెనవేసుకుని ఉన్నారు. ఆమె చప్పుడు కాకుండా మెల్లగా నడిచింది. తన హ్యాండ్‌బ్యాగ్ అందుకుంది. అందులోంచి కత్తి బయటకు తీసింది. అడుగు ముందుకు వేసి మంచాన్ని సమీపించింది. కత్తిపట్టిన చేతిని పైకెత్తి సర్రున కిందికి దించింది.

మరుక్షణం రాజ్ కేకతో ఆ గది ప్రతిధ్వనించింది.

ఆమె కసి తీరలేదు. మరొక పోటు పొడిచింది. రాజ్ గిలగిలా తన్నుకుంటూ పక్కమీది నుంచి దొర్లి నేలమీద పడ్డాడు.

మంచంమీద ఉన్న రోజీ కళ్ళు భయంతో పత్తికాయల్లా విచ్చుకున్నాయి.

రూప మళ్ళీ కత్తి పైకెత్తింది.

రోజీ ఏడుస్తూ, "రూప...నన్ను క్షమించు. నేను నీలానే ఈ మోసగాడివలలో చిక్కుకున్నాను. నాకు ఎటూదారిలేక ఇలా చేయాల్సి వచ్చింది. ఈ ఊబిలోంచి బయటికిరావడానికి ఎంత ప్రయత్నించినా సాధ్యపడలేదు. చివరకు నిన్నుకూడా ఈ ఊబిలోకి దించాను. నా పాపానికి నిష్కృతి లేదు, నన్ను కూడా చంపెయ్" అంటూ చేతులతో ముఖం దాచుకుని రోదించసాగింది.

రక్తసిక్తమైన కత్తి చేతపట్టుకుని పోలీస్‌స్టేషన్‌కు వచ్చింది రూప. కత్తి సబ్ ఇన్స్‌పెక్టర్ బల్లమీద పెట్టి, "సార్! నేను ఒక హత్య చేశాను. రాజ్ అనే వ్యక్తిని ఈ కత్తితో పొడిచి చంపేశాను. నన్ను అరెస్ట్ చేయండి" అంది.

***

అలా రాజ్ హత్య జరిగింది.

రూప చెప్పిన వివరాలన్నీ రికార్డ్ చేశాడు సబ్ ఇన్‌స్పెక్టర్ షిండే. మృతదేహాన్ని స్వాధీనం చేసుకుని పోస్ట్‌మార్టం నిమిత్తం ప్రభుత్వ ఆస్పత్రికి తరలించాడు. రోజీని అరెస్ట్ చేసి ఆమెను విచారించి మరిన్ని వివరాలు సేకరించాడు. ఐ.పి.సి. 302 కింద కేసు నమోదు చేసి రూపను కోర్టులో హాజరు పరిచాడు. ప్రస్తుతం రూప జైల్లో ఉంది. బ్లూఫిలిమ్స్ వ్యవహారంపై కూడా దర్యాప్తు ముమ్మరం చేశాడు షిండే.

—సూర్యనేత్ర



4

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**ఎస్సై కాల్ డేటా వివరాలు తెచ్చాడు. అవి దాదాపు లక్ష కాల్స్ వరకూ ఉన్నాయి. వాటిలో నుంచి దొంగతనం చేయడానికి వాడిన సిమ్ ఎవరిదో తెలుసుకోవాలంటే భగీరథ ప్రయత్నమే చేయాలి. దానికోసం టెక్నికల్ ఎక్స్‌పర్ట్స్‌తో కూడిన ఒక టీమ్‌నే ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. అది జిల్లా స్థాయిలో మాత్రమే సాధ్యపడుతుంది.**

**అందుకే, ఒక్క క్షణం ఆలోచించి, ఎస్సై ప్రసాద్‌తో,**

**"ప్రసాద్! ఇన్ని నెంబర్లు ప్రాసెస్ చేయడం మనవల్ల కాదు. ఔనా? కానీ, మనం ఒక పని చేయొచ్చు. ఈ లిస్టులో ఉన్న నెంబర్ల నుండి ఇవాళ ఉదయం నుంచి మాకనూరు నుండి బయటకు వెళ్ళిన కాల్స్ గానీ, మాకనూరు లోపలికి వచ్చిన కాల్స్ గానీ టాలీ అవుతున్నాయో లేదో, ముఖ్యంగా ఆ శనివారం నాటి నెంబర్లతో కాంటాక్ట్ అవుతున్నాయేమో కనుక్కుంటావా? చాలా సులభం. టెలికాం డిపార్టుమెంటులో వీటిని ఫీడ్ చేసి క్రాస్ చెక్ చేస్తే, ఈజీగా వచ్చేస్తాయి. నీ ఇన్ఫర్మేషన్ మీదనే కేసు సాల్వ్ కావచ్చు. బహుమతి నువ్వే కొట్టేయొచ్చు" అన్నాను.**

నగదు బహుమతి ప్లస్ మెరిట్ సర్టిఫికెట్ మంత్రం అందరి మీద బాగా పనిచేసింది. అందరూ ద్విగుణీకృత ఉత్సాహంతో పనిచేస్తున్నారు. నేను ఆషామాషీగా తమాషాగా లక్ష రూపాయల బహుమతి అనౌన్స్ చేయలేదు. ఎందుకంటే, నేరం జరిగి నాలుగురోజులై పోయింది. ఇంకా ఆలస్యమైతే ఆనవాళ్లు, ఆధారాలు మరుగున పడిపోయే ప్రమాదముంది. ఒకవేళ నేరం జరిగిన వెంటనే అయితే ప్రజల మనసుల్లో ఆ సంఘటన తాలూకు జ్ఞాపకాలు తాజాగా ఉంటాయి. వాటిని కోరిలేట్ చేసుకుని ప్రొసీడ్ కావచ్చును. ఇప్పుడు కొంచెం కష్టమే. అందుకే వారి అదనపు శ్రమకు గానూ తాయిలం ప్రకటించాను.

ఇప్పుడు మూడు నాలుగు కోణాల్లో నిజమైన పరిశోధన సాగుతుంది. ఏ ఒక్క చోటు నుంచి చిన్న సమాచారం వచ్చినా ముందుకు వెళ్ళవచ్చును.

నేను ప్రకటించిన లక్ష రూపాయల ఇనాము ఊళ్ళో కూడా సంచలనం సృష్టించింది. అందుకే, ఇందాక బయట నాతో మాట్లాడిన చిన్న మల్లయ్య బెరుకు బెరుకుగా బ్యాంకులోకి ప్రవేశించాడు. నేను అతన్ని చూసి చటుక్కున లేచి అతని భుజంమీద చెయ్యివేసి మేనేజర్ రూములోకి తీసుకెళ్ళి తలుపులు గట్టిగా మూశాను.

"చెప్పు చిన్న మల్లయ్యా! ఇంకా ఏమైనా తెలిసిందా?" అని ఆత్రుతగా అడిగాను.

అతను తలూపాడు.

"నేను చెప్పింది ఖచ్చితంగా నిజం సార్! ఇంకో ఇద్దరు ముగ్గురు గూడా చూసిన్రంట" అన్నాడు.

"ఏ టైంలో?"

చిన్న మల్లయ్య మాట్లాడలేదు. మౌనంగా నిలబడిన అతన్ని చూసి,

"ఏమైంది?" అని అన్నాను.

"సార్! గదీ... మరి..." అంటూ సంశయంగా ఆగిపోయాడు.

"చెప్పు, పర్లేదు."

"సార్! మీరు ఏక్ లాక్ ఇనాం ఇస్తరంట. మరి గది నాకొస్తదా సార్!" అన్నాడు ఆశగా.

నేను నవ్వుకున్నాను.

"తప్పకుండా మల్లయ్యా! నువ్వు చెప్పిన విషయం నిజమే అయితే నగలూ, నగదూ దొరికినా దొరక్క పోయినా, లక్ష రూపాయలు నీకే వస్తాయి. కానీ, ఇంకొన్ని వివరాలు సేకరించు. నాకు చెప్పిన విషయం ఎవ్వరికీ చెప్పకు. మిగతా వాళ్ళు కూడా నీ లక్ష రూపాయల్లో వాటా కావాలంటారు. ఇంకా



## జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో మిడిల్ మేనేజ్‌మెంట్ స్థాయి అధికారి అతను. కేసులోకి ఎంటరయ్యాడంటే మొదటిరోజే ఫైల్లో సక్సెస్ అని రాసుకోవచ్చు. వైట్‌కాలర్ నేరాలను ఎన్నింటినో ఛేదించాడు. ఓ బ్యాంక్ రాబరీ కేసు అతడికప్పగించారు. ఫైలంతా ఒకసారి తిరగేసి, తన సెక్రటరీ వనజతో కేసు డిస్కస్ చేస్తాడు ఆ అధికారి. హైదరాబాద్ వెళ్ళి, తన బ్యాచ్‌మేట్ దగ్గర్ని కలుసుకుంటాడతను. తరువాత బ్యాంకు దోపిడీ జరిగిన మాకనూరు బయలుదేరుతాడు. అక్కడంతా పరిశీలించి, కొన్ని వివరాలు సేకరిస్తాడు. ప్రణాళిక ప్రకారం ఆ ఊరిప్రజలను, పోలీసులను మోటివేట్ చేస్తాడు. అవసరమైన సమాచారం తెచ్చినవారికి ఒక లక్షరూపాయల రివార్డ్ ప్రకటిస్తాడు.

ఆ తర్వాత...

ఏమైనా సమాచారం దొరుకుతుందేమో ప్రయత్నించు. ఈ కేసు నీ వల్లే పరిష్కారం అవుతుందని నాకు గట్టి నమ్మకముంది" అన్నాను.

అతను పొంగిపోయాడు.

"మొత్తం విషయమంతా కూపీ లాగుత సాబ్! గరీబోణ్ణి. గా ఇనాం మాత్రం నాకే ఇప్పించండి దొరా!" అంటూ చేతులెత్తి మొక్కాడు. నేను అతని మొబైల్ నెంబరు తీసుకుని నా నెంబరు ఇచ్చి పదేపదే నన్ను కలవొద్దని, ఏదైనా ముఖ్య విషయముంటే ఫోన్‌లోనే చెప్పమని చెబుతూ జేబులో నుంచి ఐదువేలు తీసి అతనికి ఇచ్చాను. మల్లయ్య మబ్బుల్లో తేలుతూ బయటకు నడిచాడు.

పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో 'సీక్రెట్ ఫండ్' ఉంటుంది. ప్రతీ యస్పీ కంట్రోల్‌లో ఈ మొత్తం కొన్ని కోట్ల రూపాయల వరకూ ఉంటుంది. ఈ మొత్తాన్ని ఖర్చు చేసి నేరస్థుల గురించి, సంఘ విద్రోహుల గురించి, తీవ్రవాద కార్యకలాపాల గురించి సీక్రెట్ ఇన్ఫర్మేషన్ సేకరిస్తుంటారు. పోలీసు డిపార్ట్‌మెంట్ ఇందుకోసం ఇన్ఫార్మర్ల వ్యవస్థను పెంచి పోషిస్తుంది. వారందించిన సమాచారం నేరస్థులను పట్టుకోవడంలో తోడ్పడితే వాళ్ళకు కొంత మొత్తం నగదు రూపంలో చెల్లిస్తుంటారు. లేదా ఇన్ఫార్మర్లు చేసే చిన్న చిన్న నేరాలను చూసీ చూడనట్టు వదిలేస్తుంటారు. ఈ సీక్రెట్ ఫండుకు ఆడిట్ ఉండదు. పై అధికారులకు గానీ, ఆడిటర్లకు గానీ సమాధానం చెప్పాల్సిన అవసరం కూడా ఉండదు.

నేను పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో సిటీ డీసీపీగా పనిచేసినప్పుడు, నా కోసం స్పెషల్‌గా ఒక వేగుల వ్యవస్థను డెవలప్ చేశాను.

ఇప్పుడు కూడా అదే ట్రిక్ ప్రయోగించాను. ఈ నగదు బహుమతుల ఖర్చు ముందుగా మా కంపెనీ భరిస్తుంది. చివరికి, అల్టిమేట్‌గా, ఈ ఖర్చులన్నీ బ్యాంకే భరించాల్సి వస్తుంది.

పదిమందికి ఒక్కో లక్ష రూపాయల చొప్పున పదిలక్షల రూపాయలు ఖర్చయినా మా కంపెనీకి అదో పెద్ద మొత్తం కాదు. కానీ, శీఘ్రంగా కేసు సాల్వ్ చేయడం మా కంపెనీ రెప్యుటేషన్ పెరగడానికి తోడ్పడుతుంది. బ్యాంకు పరువు నిలబడుతుంది. మా విలువా పెరుగుతుంది. మాకు కొత్త క్లయింట్లు వస్తారు. కాబట్టి, 'వీ డోంట్ మైండ్ స్పెండింగ్ సమ్ ఎమౌంట్ ఆన్ ఇన్ఫార్మర్స్' అని మా బాస్ ఇందాకే మెయిల్ చేశాడు.

సాయంత్రానికల్లా కేబుల్ టీవీల్లో సింహాద్రి ఫోటో చూపించారు. చుట్టుపక్కల ప్రజలందరూ బాధితులే కాబట్టి మంచి రెస్పాన్స్ వచ్చింది. దానికి తోడు లక్ష రూపాయల నగదు బహుమతి ప్రకటన కూడా బాగా పనిచేసింది.

నేను ఎక్కడికి వెళ్తే అక్కడికి డీయస్పీ వెంబడిస్తున్నాడు. నేను చిన్న మల్లయ్యతో మాట్లాడిన తర్వాత మేనేజర్ రూములోకి వచ్చి కూర్చుంటే తనూ నా ముందు కూర్చున్నాడు. ఏదో ఒక విధంగా పరిశోధనలో తన జోక్యం ఉండేలా జాగ్రత్త పడుతున్నాడు.

నా దగ్గరకు ఐదారుగురు వచ్చి ఏవో వివరాలు చెప్పారు. మరిన్ని వివరాలు తీసుకురమ్మని చెప్పాను.

నేను వాళ్ళందరికీ బహుమతి గురించి చెబుతుంటే, డీయస్పీ ఆశ్చర్యంగా చూసి,

"సార్! వచ్చిన వాళ్ళందరికీ లక్ష ఇస్తామంటున్నారు. ఏం ప్రాబ్లం కాదు కదా? మా వాళ్ళు కూడా కష్టపడుతున్నారు. వాళ్ళకు కూడా ఇవ్వాల్సి వస్తుంది. మీరు బహుమతులు అనౌన్స్ చేసేసి తరువాత వెళ్ళిపోతే, వీళ్ళంతా నా పీక పట్టుకుం



టారు సార్!" అన్నాడు.

నేను చిన్నగా నవ్వి,

"నో ప్రాబ్లం సార్! వాళ్ళందరికంటే ముందుగా ఒక లక్ష రూపాయల బహుమానం నా తరఫున మీకు ఇప్పించే పూచీ నాది. మనకు సమాచారం ముఖ్యం. ఈ రోజుల్లో అన్నింటికన్నా విలువైనది సమాచారం. ఇన్ఫర్మేషన్ ఈజ్ మనీ. ఓ పది లక్షలు పోయినా ఫర్వాలేదు కానీ, తెల్లారేసరికి మనకు దొంగ దొరుకుతాడు చూడండి" అన్నాను విశ్వాసంగా.

అంతే, డీయస్పీ వికెట్ కూడా పడిపోయింది. ఇక నేను చేయమన్న ఫీట్లన్నీ చేస్తాడు. నన్ను ఫాలో కావడం మానేస్తాడు.

ఇంతలో కాల్ లిస్టు పట్టుకుని వెళ్ళిన ఎస్సై ప్రసాద్ పరుగు పరుగునవచ్చి నా పక్కన డీయస్పీ కూర్చుని ఉండడం చూసి టక్కున ఆగిపోయాడు. లక్ష రూపాయల మహిమ! వాళ్ళ డీయస్పీ దగ్గరే రహస్యాలను మెయింటెయిన్ చేస్తున్నాడు. నేనే లేచి బయటకొచ్చి ప్రసాద్‌ను పక్కకు తీసుకుపోయాను.

"సార్! మీ ఆలోచన కరెక్టే సార్! ఈ నెంబర్ నుండి ఇవాళ ఉదయం నుంచి ఐదారు కాల్స్ వెళ్ళాయి. ఈ రెండు నెంబర్లనే శనివారం నాటి అర్ధరాత్రి వరకూ వాడారు" అన్నాడు గుసగుసగా.

"ఎవరివీ నెంబర్లు?"

"సార్!" అంటూ నా చెవిలో ఒక పేరు చెప్పాడు. నేను ముందుగా ఆశ్చర్యపోయినా, నా అంచనా తప్పు కానందుకు నవ్వుకున్నాను.

"మరి, ఇంకో నెంబర్?"

"అది కూడా ఒక గంట క్రితమే తెలిసింది సార్! ఇవాళ పొద్దుటినుంచి దాని లొకేషన్ సూర్యాపేట సార్! పొద్దుటి నుంచీ సూర్యాపేట చుట్టుపక్కల ఊళ్ళల్లో తిరుగుతోంది సార్. నిన్నంతా యాదగిరిగుట్టలో ఉన్నట్టు కాల్ డేటా లొకేషన్ చూపిస్తుంది సార్. ఈ ఒక్క నెంబరు నుంచి తప్ప వేరే కాల్స్ లేవు. బహుశా, ఇంకో నెంబరు ఉండి ఉండవచ్చు సార్!" అన్నాడు.

"ఆ నెంబర్ ఎవరి పేరుమీద రిజిస్టర్ అయిందో, ఎక్కడ రిజిస్టర్ అయిందో కనుక్కున్నారా?"

"ఎస్సార్! ఆ సిమ్ ఎవడో రాజేశ్ అనేవాడి పేరు మీద రిజిస్టర్ అయింది సార్! హైదరాబాద్, గచ్చిబౌలిలోని రోడ్ సైడ్ వెండార్ దగ్గర కొన్నారు సార్! ప్రీ పెయిడ్."

"సార్! సార్!" అనే పదం విని నా బుర్ర వేడెక్కి పోతోంది. కానీ, ఇది సమయం కాదు.

"గుడ్ జాబ్ ప్రసాద్! ఆ రెండు నెంబర్లను అబ్జర్వేషన్‌లో ఉంచమని చెప్పు."

"చెప్పాను సార్! అనఫీషియల్‌గా చేస్తామన్నారు. అఫీషియల్‌గా చేయాలంటే యస్పీగారి లెటర్ కావాలన్నారు సార్! ఇది వాళ్ళ మెయిల్ ఐడీ సార్! అంటూ ఓ పేపర్ ఇచ్చాడు.

పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో ఇట్లాంటి చురుకయిన కుర్రాళ్ళు చాలా మందే ఉన్నారు. కానీ, వారు ఈ కర్కశమైన వ్యవస్థలో సృజనాత్మకతను ప్రదర్శించలేక నలిగిపోతున్నారు. నేను కొంచెం అవకాశం ఇచ్చేసరికి ప్రసాద్ చాలా యాక్టివ్‌గా... మరీ మాట్లాడితే ప్రోయాక్టివ్‌గా ఆలోచించి, చాలా ఇన్ఫర్మేషన్ సేకరించాడు. మంచి నాయకత్వ లక్షణాలున్న అధికారి. ఇలాంటి వాళ్లను వెతికి పట్టుకుని తన టీమ్‌లో చేర్చుకుంటే గొప్ప ఫలితాలు సాధించగలుగుతారు. వీలైనప్పుడు ప్రసాద్ గురించి దుగ్గల్‌కు రికమెండ్ చేయాలని నిర్ణయించుకున్నాను.

నేను ప్రసాద్ భుజం మీద చెయ్యి వేసి, దుగ్గల్‌తో మాట్లాడి టెలికాం కంపెనీలకు లెటర్స్ మెయిల్ చేయమని చెప్పాను.

"ప్రసాద్ మరి....?"

ప్రసాద్ నా మాట పూర్తి కాకుండానే,

"సార్! వీడు ఇక్కడే ఉన్నాడు. బ్యాంకు చుట్టుపక్కలే ఉండి అన్నీ గమనిస్తూ ఎప్పటికప్పుడు సమాచారాన్ని చేరవేస్తున్నాడు సార్! వాణ్ణి ఫాలో చెయ్యమని మఫ్టీలో ఉన్న మా కానిస్టేబుల్‌కు చెప్పాను సార్!" అన్నాడు.

"అయ్యో వద్దు ప్రసాద్! మీ వాణ్ణి చూస్తే వాడు అలర్ట్ అవుతాడేమో!" అన్నాను కంగారుగా.

ప్రసాద్ ముసిముసిగా నవ్వుతూ, ఒక వ్యక్తిని చూపించి,

"సార్! వాడు కాదు సార్! మా లేడీ కానిస్టేబుల్ సార్! మఫ్టీలో పల్లీలు అమ్ముతుంది. ఆమె ఎవరో నాకు తప్ప మరెవరికీ తెలియదు" అన్నాడు.




**చిమ్మచీకటి. కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసల ధ్వని భీకరమైన చప్పుడుగా మారి అతనికే వినబడుతోంది. ఉద్వేగంగా ఉన్నాడు. ఆందోళనగా ఉన్నాడు. నమ్మకంగా ఉన్నాడు. ఎందుకంటే తాను వేటాడబోయే జంతువు తప్పకుండా వలకు చిక్కుతుందని అతని సిక్త్ సెన్స్ పదే పదే హెచ్చరిస్తోంది. అందుకే ఎదురుచూస్తున్నాడు. మరి అతను ఎదురుచూస్తున్న ప్రే అతని వలలో చిక్కిందా?**

నేను కూడా నవ్వుతూ,

"సరే అయితే, మా అందరికీ టీ పంపించు" అని మేనేజర్ రూములోకి నడిచాను.

ఐదు నిమిషాల్లో బ్యాంకులోకి టీ వచ్చింది.

డీయస్పీ టీ గ్లాసు అందుకుంటూ,

"ఏమిటి సార్! మా ఎస్సై మీకు రహస్యాలు చెబుతున్నాడు. నాకు కూడా తెలియకూడని సీక్రెట్సా?" అన్నాడు రుసరుసలాడుతూ.

నాకు ఆ మాటలు వినపడ్డాయి కానీ మెదడులో రిజిస్టర్ కాలేదు. నా చూపూ, కాన్సన్‌ట్రేషన్ అంతా మరో దిక్కుగా ఉంది. ఎంతో అమాయకంగా కనపడే ఈ పల్లెటూరివాళ్ళల్లో కూడా ఇంతటి క్రిమినల్స్, నేరగాళ్ళుండడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

"సాబ్!" అని మరాఠీ, హిందీ కలగలిసిన యాసలో పిలిచాడు టీ అందించే వ్యక్తి. నాక్కూడా ఒక టీ గ్లాసు ఇవ్వబోయాడు. ఆ మురికి గ్లాసులు, మురికి టీ గుత్తి, మురికి చేతులు చూస్తేనే నాకు డోకొచ్చింది. నేను నవ్వుతూ 'వద్ద'ని చెప్పాను.

"మీరు టీ తాగరా?"

నేను అడ్డంగా తలూపుతూ, "నీ పేరేంటి?" అని హిందీలోనే ప్రశ్నించాను.

"మేరా నామ్ పాటిల్ హై సాబ్!" అన్నాడు.

"నువ్వు ఈ చుట్టుపక్కలే తిరుగుతుంటావు కదా? ఈ బ్యాంకు దొంగతనం గురించి నీకేమైనా తెల్సా?" క్యాజువల్‌గా అడిగాను.

వాడు నవ్వుతూ, "నాకేం తెలుస్తది సాబ్! నాకు తెలిస్తే మా ఎస్సై సాబ్‌కు చెప్పేటోణ్ణి కదా సాబ్!" అన్నాడు.

నేను "ఔనౌను అంటూ లక్ష రూపాయల ఇనాం గురించి విన్నావా నువ్వు? దొంగలను పట్టుకోవడంలో సహాయం చేసినవాళ్ళకు లక్ష రూపాయల బహుమతి దొరుకుతుంది." అన్నాను అతని ముఖ కవళికలను జాగ్రత్తగా గమనిస్తూ.

వాడు నవ్వుతూ, "ఔను సార్! బయట అందరూ చెప్పుకుంటున్నారు. అయితే నిజంగానే లక్ష రూపాయలిస్తారా సాబ్?" అన్నాడు ఆశగా.

"ఆc! కానీ కచ్చితమైన సమాచారం కావాలి. నీకు తెలిస్తే చెప్పు. లక్ష నీకే. నువ్వే సొంతంగా టీ స్టాల్ పెట్టుకోవచ్చు" అన్నాను నవ్వుతూ.

పాటిల్ కూడా పకపకా నవ్వాడు.

తన ప్రమేయం లేకుండానే, తన ముందే, ఒక చాయ్‌వాలా నాతో అంత క్లోజ్‌గా మాట్లాడటం

డీయస్పీకి నచ్చలేదు. అందుకే, కొంచెం ముఖం మాడ్చుకుని,

"పోనివ్వండి సార్! వాడో పాగల్ గాడు" అని నాతో అని, పాటిల్ వైపు తిరిగి,

"అరేయ్! తూ ఛల్ యహాఁ సే!" అంటూ, గద మాయించాడు. పాటిల్ పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇంతలో బ్యాంకులో లైట్లు వేశారు. నాకు చటుక్కున శనివారం రాత్రి లైట్ల వెలుతురులో వెలిగిపోతున్న బ్యాంకు దృశ్యమే కళ్ళముందు మెదిలింది.

గంటలు గంటలు గడిచిపోతున్నాయి. చీకట్లు ముసురుకుంటున్నాయి. ఇక ఈ రోజుకి ఏ సమాచారం రాదని తేలిపోయింది. డీయస్పీ తన పటాలంతో వెళ్ళిపోయాడు.

ప్రసాద్ లోకల్ ఎస్సై కాబట్టి మాకనూరులోనే ఉండిపోయాడు.

మధ్యాహ్నం నుంచి, దుగ్గల్ రెండు మూడు సార్లు ఫోన్ చేసి మహబూబ్‌నగర్‌కు రమ్మని ఆహ్వానించినా నాకెందుకో వెళ్ళాలనిపించలేదు. దాంతో నాకు కావలసిన వసతి, తిండి విషయాలు దగ్గరుండి చూసుకోమని దుగ్గల్, ప్రసాదుకు పురమాయించాడు.

రాత్రి ఎనిమిదింటికి బ్యాంకు నుండి బయలుదేరాను. బెంగుళూరు హైవేమీద ఉన్న ఒక హోటల్లో రూమ్ బుక్ చేశాడు ప్రసాద్. రెండు గంటల పాటు నన్ను డిస్టర్బ్ చేయొద్దని చెప్పడంతో ప్రసాద్, నాకు తన ఇంటి నుంచి భోజనం తెస్తానని వెళ్ళాడు. నాకు కొంచెం పెరుగన్నం మాత్రం చాలన్నాను. ఒక కానిస్టేబుల్‌ను అక్కడ ఉంచి, ప్రసాద్ వెళ్ళాడు.

అది ఆ ప్రాంతంలో చాలా పేరున్న హోటలే. ఏసీ గది. అయినా, హైవే మీది వాహనాల రణగొణ ధ్వనుల మూలంగా ప్రశాంతంగా యోగా చేసుకోలేక పోయాను. చాలాసేపు తంటాలు పడిన తర్వాత మనసు కొంచెం ఆధీనంలోకి వచ్చింది. రెండు గంటల పాటు యోగా చేసి ఆ తర్వాత DRT ఆడియో పెట్టుకుని ఇరవైమూడు నిమిషాల పాటు గాఢమైన మెడిటేషన్‌లోకి వెళ్ళాను.

మెడిటేషన్ నుండి బయటకు వచ్చిన తరవాత మనసు, శరీరం పునరుత్తేజితమయ్యాయి. ప్రసాద్ పంపిన పెరుగన్నంలో దానిమ్మ గింజలు కలుపుకుని తిన్నాను.

రోడ్డు మీది వాహనాల వల్ల శబ్దకాలుష్యం ఇంకా పెరిగింది. ఒక్కోసారి భారీ వెహికల్ ఏదైనా వెళితే బిల్డింగ్ మొత్తం అదరసాగింది. దానికి తోడు పరిశోధనకు సంబంధించిన ఆలోచనలతో నిద్ర రావడం లేదు. రాత్రిపూట ఎనిమిది గంటల పాటు నిద్రపోవడం వల్ల కలిగే విశ్రాంతి నాకు ఇరవై నిమిషాల DRT వల్ల లభిస్తుంది. కాబట్టి శరీరం పూర్తిగా యాక్టివ్‌గా ఉంది.

ఇవాళ జరిపిన పరిశోధన వివరాలూ, రేపు పాటించవలసిన వ్యూహం గురించిన అన్ని వివరాలూ, టాపిక్ వారీగా విభజించి ల్యాప్‌టాప్‌లోకి ఫీడ్ చేసి వాటిని మా బాస్‌కు, వనజకు మెయిల్ చేశాను. దాంతో పాటు 'నేను సరైన దిశలోనే, సరైన కోణంలోనే పరిశోధన కొనసాగిస్తున్నానా?' అని ప్రశ్నించాను కూడా.

వారి అభిప్రాయం, నా ఆలోచనా విధానానికి సరిపోతే సత్వర ఫలితం లభిస్తుందని నా ఆశ.

ఎప్పుడైనా, గూఢచార పరిశోధనలో స్ట్రాటజిక్ ప్లానింగ్ అవసరం. సినిమాల్లో లాగా తుపాకీ తీసి, పేల్చేసి, అందమైన విదేశీ లేడీ గూఢచారి ఒళ్ళో తేలడం కాదు గూఢచర్యం అంటే. ఇదొక మైండ్ గేమ్. చాలా సందర్భాల్లో అసలు చెయ్యెత్తాల్సిన పని లేకుండానే కేసులు సాల్వ్ అయిపోతుంటాయి.

అందుకే, నా కంపెనీ వాళ్ళు ఇక్కడ లేరు కాబట్టి వారి ఒపీనియన్ కూడా మెయిల్ ద్వారా పంపమని అడిగాను.

ఇలా కేసు విషయాలన్నీ మెయిల్‌లో రాయడం మూలంగా మరో ప్రయోజనం కూడా ఉంది. నా మనసులో అస్పష్టంగా ఉన్న కొన్ని సందేహాలు స్పష్టమౌతాయి. అపరిపక్వంగా ఉన్న కొన్ని ఆలోచనలు పూర్తి రూపాన్ని సంతరించుకుంటాయి.

నిజంగానే, అలాగే జరిగింది.

మొత్తం పరిశోధన అంతా ఒక క్రమపద్ధతిలో అమర్చేసరికి, నాకెందుకో కేసులో చిక్కుముడి విడిపోతున్నట్టనిపించింది.

పేకాటలో, పదమూడు కార్డులు పడ్డ తర్వాత, వాటిని క్రమపద్ధతిలో అమరిస్తేనే మన దగ్గర ఉన్న తురుపు ముక్కలెన్ని, ఏ ముక్కలు వేస్తే ఎదుటివాడి ఆట పూర్తవుతుందో తెలుసుకుని వాటిని తొక్కి పట్టి మనకు కావలసిన ముక్కలను లాగేయడంలో ప్రదర్శించే లాఘవమే విజయానికి మూలం. అందుకు ముందుగా మన దగ్గరున్న ముక్కలను అమర్చుకుని ఆట, వేట ప్రారంభించాలి.

---

**ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## లాకర్ నెం. 369-2 (5-7-2017)

మా ప్రశ్న: **కేబుల్ టీవీల్లో ఎవరి ఫొటో చూపించారు?**

మీ జవాబు------------------------------------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------------------------------------

------------------------------------------------------------------------------------------

------------------------------------------------పిన్-----------------------ఫోన్‌నెం.--------------------------------

**ఈ కూపన్‌ను 4 జూలై 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

**వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్ స్టోర్స్ మెయిన్‌రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...**

*నిబంధనలు వర్తిస్తాయి

నేను కూడా ఇప్పుడు ఆ దశకు చేరుకున్నాను. నా ముక్కలన్నింటినీ కలిపేసరికి దొంగ రూపం స్పష్టంగా గోచరించసాగింది.

ప్రసాద్ తెచ్చిన సమాచారం ప్రకారం, ఇక్కడి వ్యక్తి ఫోన్ ద్వారా సంప్రదిస్తున్న ఆగంతకుడు సింహాద్రే అని నాకు నమ్మకం కలిగింది.

ఈ తరుణంలో, దుగ్గల్‌కు చెప్పి సింహాద్రిని అరెస్ట్ చేస్తే మంచిదా?

లేక సింహాద్రి ఒక్క చోట నిలకడగా ఉండ కుండా తిరుగుతున్నాడు. అంటే అతని దగ్గర సొమ్ము లేదన్నమాట. అంత బరువైన, విలువైన నగలు, నగదు వెంటపెట్టుకుని తిరగడం ప్రాక్టి కల్‌గా సాధ్యం కాదు. కాబట్టి సింహాద్రి దగ్గర నగలు, నగదు లేవు అంటే వాటిని ఎక్కడో భద్రంగా దాచి పెట్టాడన్నమాటే! అందుకే, సింహాద్రి నగలు, నగదు దాచిన చోటుకు వెళ్ళే వరకు ఆగితే మంచిదా?

సింహాద్రి నగలు, నగదు దొంగతనం చేసిన వెంటనే తీసికెళ్ళాల్సి ఉంది. అలా చేయలేదంటే, ఏదో కారణం చేత వాటిని ఇక్కడే ఎక్కడో భద్ర పరచి ఉంటాడు.

ఎక్కడ దాచి ఉంటాడా అని ఆలోచిస్తుంటే, చిన మల్లయ్య చెప్పిన విషయం గుర్తుకొచ్చింది. అంటే చిన మల్లయ్య చెప్పిన సమాచారం కరెక్టే నన్న మాట. అంటే... గుండె వేగంగా కొట్టుకోవడం మొదలయింది. అంటే నగలు, నగదు ఇన్ని రోజులూ తమందరి కనుచూపు మేరలోనే ఉన్నా యన్నమాట. ఆ విషయం ఊహించుకుంటేనే థ్రిల్లింగ్‌గా ఉంది.

"వావ్! ఎంత గొప్ప మలుపు..."

నిజానికి సింహాద్రి నేరస్థుడే అయినా అతడి చోరకళా నైపుణ్యాన్ని, ఇన్జెన్యూనిటీనీ మెచ్చుకోవా ల్సిందే. ఏ హాలీవుడ్ సినిమాలోనూ దొంగ ఇంత నేర్పుగా సొమ్మును దాచిపెట్టలేదు.

వెంటనే నా పరిశోధనా ఫలితాన్ని ఎవరితో నయినా పంచుకోవాలనిపించింది. కానీ, ఈ టైములో... అవునూ... టైం ఎంతయింది? అని చూశాను. తెల్ల వారుజామున మూడుగంటలు. దాదాపు ఐదు గంటలుగా ఆలోచనల్లో మునిగిపోయానన్న మాట. మొత్తానికి చిక్కుముడి విడిపోబోతుంది. దొంగ దొరుకుతున్నాడనుకునే సరికి మనసు ఉద్విగ్న మయింది.

చిమ్మ చీకటి.

కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి.

నేను తీస్తున్న గాఢమైన శ్వాస, ఉచ్ఛ్వాస నిశ్వా సల ధ్వని రాను రానూ పెరుగుతూ, చెవులు చిల్లులు పడేంత భీకరమైన చప్పుడుగా మారి నాకే వినిపిస్తోంది.

మనసంతా ఉద్వేగంగా ఉంది.

నా సిక్స్త్ సెన్స్ చెబుతోంది.

నేను వేటాడబోయే జంతువు, నా 'ప్రే', నా వలలో చిక్కబోతుందని. అందుకే ఉత్సాహంగా ఉంది. ఒకింత ఆందోళనగా కూడా ఉంది.

మనం వల పన్నాము.

దానికి మరో గత్యంతరం లేదు.

మృగం, పాశానికి చిక్కాల్సిందే.

కానీ, వలలో పడినప్పుడు దాని కళ్ళల్లో కని పించే అదో రకమైన విస్మయం... అది భయం కాదు, విభ్రాంతి చూసి తీరాల్సిందే.

తనంతటి మహావీరుణ్ణి, నక్కజిత్తుల వాణ్ణి గెలిచిన మొనగాడెవ్వడా అని ఆ జంతువు నన్ను చూసినప్పుడు, నా ముఖం మీద చిరునవ్వు మొల కెత్తాల్సిందే.

నా మానసిక పరిస్థితికి తగ్గట్టుగానే, ఎవరో కర్ఫ్యూ విధించినట్టుగా, చీమ చిటుక్కుమన్నా విని పించేంత నిశ్శబ్దంగా ఉంది వాతావరణం. చెట్ల ఆకులు కూడా గలగలలాడడం లేదు. గాలి స్తంభించి పోయి, ఏం జరుగుతుందా? అని వేయి కళ్ళతో నా వంకే చూస్తున్నట్టుగా అనిపించింది నాకు.

చిమ్మ చీకటిలోనూ నా కళ్ళు తెరుచుకునే ఉన్నాను. ఏం కనబడటం లేదు. అయినా నాకు తెలుసు, ఎక్కడ ఎవరెవరున్నారో? ఏం చేస్తు న్నారో? ఎందుకోసం ఉన్నారో? ఎవరి కోసం ఉన్నారో? ఎందుకంటే వాళ్ళకు ఆ ఆజ్ఞలు ఇచ్చింది నేనే కాబట్టి.

నేనయితే, గత 96 గంటల్లో కనురెప్ప వాల్చిన క్షణం లేదు. అయినా నా కంటికి కునుకు రావడం లేదు.

వేటగాడి కనురెప్పే వాలితే,

వేటాడి ఏం ప్రయోజనం?

అందుకే కనురెప్ప వాల్చకుండా చూస్తున్నాను. దూరంగా చీకట్లను చీల్చుకుంటూ పరుగు పరు గున వస్తున్న మహా రాక్షసి ఒంటికన్ను లాగా, ప్యాసెంజర్ రైలు హెడ్ లైటు కనిపించింది.

పల్లె జీవితాల్లో జరిగిన దారుణానికి సంతాపం తెలుపుతున్నట్టుగా వాతావరణం కూడా స్తబ్దంగా ఉంది. చీమ చిటుక్కుమంటే ఉలికిపడేంత నిశ్శబ్దంగా ఉంది.

ఇంతలో నా జేబులోని వాకీటాకీ గుర్రుమంది.

"సార్! డ్రాగన్ లేచింది" అన్నాడు ప్రసాద్.

నాకు నవ్వొచ్చింది అలా కోడ్ భాషలో మాట్లాడే సరికి.

ప్రసాదును ఈ ఆపరేషన్‌లో చేర్చుకున్నప్పటి నుంచి, అతనితో సాన్నిహిత్యం ఏర్పడింది. మా ఇద్దరి వయసు ఒకటే కావడంతో మరింత క్లోజ్ అయ్యాడు. నేను ఇప్పుడు సర్వీసులో లేను కాబట్టి హైరార్కియల్ సంకోచం కూడా లేదు. కేవలం దుగ్గల్ స్నేహితుణ్ణనే ఒక్క ప్రతిబంధకం మాత్రం పూర్తి స్నేహితుడుగా మారేందుకు అతని మనసు ఒప్పుకోవడం లేదు.

అందుకే, ప్రసాద్ ఈ ఆపరేషన్‌కు "ఆపరేషన్ యస్" అని, సింహాద్రికి "డ్రాగన్" అని, నాకు "ఈగిల్" అని పేర్లు పెట్టాడు. యస్పీకి "ఫీనిక్స్" అనీ, డీయస్పీకి "జాకాల్" అనీ, మిగిలిన వాళ్ళందరికీ "గూర్ఖాస్" అనీ పేర్లు పెట్టడం గుర్తొచ్చి నాకు నవ్వొచ్చింది.

ఇప్పుడు "డ్రాగన్" లేచింది అంటే, రైలులో ప్రయాణిస్తున్న సింహాద్రి లేచి దిగడానికి తయారవు తున్నాడన్న మాట.

నేను కూడా నవ్వుతూ,

"ఈగిల్ వేచి చూస్తుంది" అన్నాను.

జోక్స్ అపార్ట్, "ఎట్టి పరిస్థితుల్లోనూ నీ కళ్ళ ముందు నుంచి సింహాద్రి మాయం కాగూడదని" స్ట్రిక్ట్ వార్నింగ్ ఇచ్చాను.

"కృష్ణా" రైల్వే స్టేషన్ మొత్తం చిమ్మ చీకటిలో ఉండాలని నేనే ఉత్తర్వులను ఇప్పించాను. ఎందు కంటే, సింహాద్రి మనుషులు ఒక్కడో ఇద్దరో ఇక్కడ ఉండి ఇక్కడ జరుగుతున్న విషయాలన్నీ అతనికి చేరవేస్తున్నారు.

ఆ విషయాన్ని నిర్ధారించుకోవడానికే, మేము రెండు మూడు ఫాల్స్ వార్తలను ప్రచారం చేశాము. అవి మరుక్షణంలో సింహాద్రికి చేరడం మేము ఫోన్ సంభాషణల్లో విన్నాము.

అందుకే, ఈ రోజు సాయంత్రమే, ఇక లాభం లేదని చెప్పి మూటా ముల్లే సర్దుకుని, మాకనూరు వదిలిపెడుతున్నామనే వార్త వదిలాము. ప్రజ లంతా నిజంగానే కేసు సాల్వ్ కాలేదనుకుని ఏడుపు ముఖాలు పెట్టుకున్నారు. కొంత మంది యువకులు మేనేజర్‌ను, హెడ్ క్యాషియర్‌ను పట్టు కుని చితకబాదారు. పోలీసులు కూడా వారిని పెద్దగా వారించలేదు.

వాళ్ళకు బ్యాంకు ఏ శిక్ష విధించినా, ఆ విషయం ఎప్పటికో గానీ తేలదు. అది, అప్పటి లాయర్ల మీద, న్యాయమూర్తుల మీద ఆధారపడి ఉంటుంది. కానీ, ప్రజలకు జరిగిన నష్టాన్ని ఎవ్వరూ పూడ్చ లేరు. అందుకే, వాళ్ళది ధర్మాగ్రహం. న్యాయం ఉంది. నేను కూడా మౌనంగా ఉండిపోయాను.

**(ఇంకా వుంది)**



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'ఆస్టియో ఆర్థరైటిస్' నివారణ సులభం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



**'ఆస్టియో ఆర్థరైటిస్' అనగా:** కీళ్ళలోని కార్టిలేజ్ అనే మృదులాస్థి అరుగుదలకు గురి అయి, తద్వారా చుట్టూ ఉన్న కణజాలంపై ప్రభావం చూపడాన్ని ఆస్టియో ఆర్థరైటిస్ అని అంటారు. ఈ సమస్యను మనం ముఖ్యంగా 40 సం॥ల వయస్సు పైబడినవారిలో ఎక్కువగా చూస్తుంటాం. కానీ ప్రస్తుత మానవుని జీవనశైలి కారణంగా – ముఖ్యంగా ఆహారంలో పౌష్టికాహారలోపం, వ్యాయామం లేకపోవడం మరియు ఇతరేతర కారణాలు, కీళ్ళు సంక్రమణకు గురికావడం, కీళ్ళకు దెబ్బ తగలడం మరియు మరికొన్ని ఇతర కారణాల వలన ఈ సమస్య చిన్న వయస్సు వారిలో కూడా ఏర్పడుతున్నందువలన, వారు ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తోంది. కొందరిలో దీనివలన క్రింద కూర్చోలేకపోవడం మరియు క్రింద కూర్చొని లేచే క్రమంలో తీవ్ర ఇబ్బందులు ఎదుర్కోవడం, మెట్లు ఎక్కలేకపోవడం, కీళ్ళనొప్పుల వలన రాత్రుళ్ళు నిద్ర కూడా సరిగా పట్టక పోవడం వంటి సమస్యలను ఎక్కువగా గమనించవచ్చు.




అయితే ఈ సమస్యను మొదట్లోనే గుర్తించి, సరైన చికిత్సను అందించకపోయినట్లయితే ఇది కీళ్ళను పూర్తిగా దెబ్బతీసి, అంగవైకల్యానికి కూడా గురిచేసే ప్రమాదం ఉంటుంది. కానీ కాన్స్టిట్యూషనల్ హోమియోవైద్య విధానం ద్వారా ఈ సమస్య నుండి పూర్తి ఉపశమనం లభించే అవకాశం ఉంది.

సాధారణంగా కీళ్ళలోని రెండు ఎముకల చివరి భాగాలు కలిసే ప్రాంతం 'కార్టిలేజ్' అనే నున్నటి మృదులాస్థితో కప్పబడి ఉంటుంది. ఈ రెండు ఎముకలు ఒకదానిపై మరొకటి తేలికగా, పరస్పరం మృదువుగా కదలడానికి ఆ మృదులాస్థి సహాయపడుతూ – ఒత్తిడిని తట్టుకునే ఒక "షాక్ అబ్‌సార్బర్"గా పనిచేస్తుంటుంది. మోకాలి జాయింట్‌ను చుడుతూ సైనోవియం అనే పొర ఉంటుంది. ఈ పొర సైనోవియల్ ఫ్లూయిడ్ అనే ముఖ్య ద్రవాన్ని విడుదల చేస్తుంది. ఈ సైనోవియం పొరను చుడుతూ క్యాప్సుల్ అనే మరొక గట్టి పొర ఏర్పడి ఉంటుంది. ఇది మోకాలి జాయింట్‌ను స్థిరంగా ఉంచేందుకు దోహదపడుతుంది. ఇవేకాకుండా మోచిప్ప లేదా పటెల్లా, టెండాన్‌లు, లిగమెంట్లు మరియు వివిధ కండరాలతో మోకాలి జాయింట్ ఎంతో పటిష్టంగా నిర్మితమై ఉంటుంది.

ఆస్టియో ఆర్థరైటిస్ మొదలైన కొన్ని రోజులకు కార్టిలేజ్ క్రమంగా అరిగిపోవడం ప్రారంభం అవుతుంది. దీంతో క్రమేణా అది పలుచగా మారుతుంది. దీనివలన ఎముకలలోని కణజాలం శోథమునకు గురి కావడం వలన ఎముకల చివరి భాగాలు అదనంగా పెరుగుతాయి. వీటిని 'ఆస్టియో ఫైట్స్' అని అంటారు. వీటి ప్రభావం చేత సైనోవియం పొర కొద్దిగా ఉబ్బిపోయి అదనపు ద్రవాన్ని విడుదల చేయడంతో – కీలు ప్రాంతంలో వాపు ఏర్పడుతుంది మరియు రెండు ఎముకలు ఒకదానితో మరొకటి రాపిడికి గురికావడం వలన తట్టుకోలేనంత స్థాయిలో తీవ్రమైన నొప్పి కలుగుతుంది.

**కారణాలు:** 40 సం॥ వయస్సు పైబడటం, ముఖ్యంగా పురుషులతో పోలిస్తే స్త్రీలలో ఇది ఎక్కువగా ఏర్పడుతుంది. • అధిక బరువును కలిగి ఉండటం • కీళ్ళపై అధిక ఒత్తిడి కలిగించే పనులు చేయడం, పూర్వం కీళ్ళకు దెబ్బ తగలడం, కీళ్ళ ఎదుగుదలలో హెచ్చుతగ్గులు ఉండటం • కీళ్ళ కార్టిలేజ్‌లో జన్యుపరమైన లోపాలు ఉండటం • కొన్ని ఇతర వ్యాధులు (ఉదా: రుమటాయిడ్ ఆర్థరైటిస్) వంటి అంశాలన్నీ ఈ వ్యాధికి గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** కీళ్ళలో నొప్పి, వాపు, చేతితో తాకితే కీళ్ళు వేడిగా అనిపించడం • కీళ్ళు బిగువుగా మారడం, ముఖ్యంగా ఉదయాన్నే నిద్రలేచిన తరువాత కొంత సమయం వరకు నడక కష్టంగా అనిపించటం • క్రింద కూర్చునేటప్పుడు మరియు లేచేటప్పుడు ఇబ్బంది కలగడం • కీళ్ళ దగ్గర రాపిడి శబ్దాలు వినిపించడం • తీవ్రనొప్పి వలన నడిచే తీరులో వ్యత్యాసం కనిపించడం వంటి లక్షణాలను గమనించవచ్చు. • వెన్నెముక 'ఆస్టియో ఆర్థరైటిస్'కు గురి అయితే చేతులు మరియు కాళ్ళలో బలహీనతలు ఏర్పడటం, మొద్దుబారటం, తిమ్మిర్లు వంటి లక్షణాలు కనపడతాయి.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానంతో – 'ఆస్టియో ఆర్థరైటిస్'ను తగ్గించడంలోను, తద్వారా కీళ్ళ కదలికలను సురక్షితంగా ఉంచడంలో మంచి ఫలితాలను రాబట్టడం జరుగుతోంది. కేవలం నొప్పి, వాపు వంటి లక్షణాలను తగ్గించడమే కాకుండా, రోగి మానసిక, శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకున్న అనంతరం – ప్రభావవంతమైన చికిత్సను అందించడం ద్వారా ఈ వ్యాధిని సంపూర్ణంగా నయం చేయవచ్చు మరియు వ్యాధి తీవ్రత పెరగకుండా కాపాడవచ్చు.

# టెర్రర్ బీచ్
# డ్యుమాస్

**బీచ్ అనగానే గుర్తుకొచ్చేది అలల చిరు సవ్వడులు, ఆహ్లాదంగా అనిపించే చల్లని గాలి, ప్రశాంతంగా కనిపించే సముద్రం. అలాంటి అందమైన బీచ్‌లో అలలు భయపెడితే... సవ్వడి చేసే గాలి వణికిస్తే....మన నీడే మనల్ని భయపెడుతుంటే...ఎలా ఉంటుంది? అక్కడ ఒక్క క్షణం కూడా ఉండాలనిపించదు కదూ....ఎంత అందమైన బీచ్ అయినా ఇలాంటి సంకేతాలు దయ్యాలు ఉన్నాయన్న భయాన్ని కలిగిస్తాయి. పై భయాలన్నీ అనుభూతి చెందాలంటే గుజరాత్‌లోని డ్యుమాస్(Dumas) బీచ్‌ని సందర్శించాల్సిందే....గుండెనిండా దమ్మున్న వారిని సైతం భయపెట్టే ఈ బీచ్ గురించి.....**

## ఈ బీచ్ ఎక్కడుందంటే....

గుజరాత్‌లోని సూరత్‌కి 21 కిలోమీటర్ల దూరంలో ఉంది. అక్కడ ఉన్న నాలుగు బీచ్‌లలో మిగతా మూడు బీచ్‌లు ఎప్పుడూ జనంతో కళకళ లాడుతుంటే ఈ బీచ్‌లో మాత్రం సాయంత్రం ఆరు అయ్యిందంటే చాలు జన సంచారం ఉండదు. మిగతా బీచ్‌లకు లేని ప్రత్యేకత ఒకటి దీనికి ఉంది. ఈ బీచ్‌లో దయ్యాలు తిరుగుతాయనే ప్రచారం. దీనికి తోడు ఈ బీచ్‌లోని ఇసుక నల్లగా ఉంటుంది. ఈ బీచ్‌లో తిరగడానికి టూరిస్టులు భయపడడానికి ఇదొక కారణంగా చెబుతారు. ఈ బీచ్‌లోని ఇసుక నల్లగా మారడానికి ఒక కారణం ఉంది అంటారు. గతంలో ఈ బీచ్‌లోనే చనిపోయిన వారి దహనసంస్కారాలు పూర్తి చేసేవారు. ఆ కారణంగా ఈ బీచ్‌లోని ఇసుక నల్లగా మారి ఉండవచ్చని నమ్ముతారు. అంతే కాకుండా కోరికలు తీరకుండా చనిపోయిన వారి ఆత్మలు ఇక్కడే తిరుగుతుంటాయని స్థానికుల నమ్మకం.

## నిజంగా దయ్యాలున్నాయా?

ప్రత్యక్షంగా ఇక్కడ దయ్యాలు తిరగడాన్ని ఎవరూ చూడకపోయినా, వాటిని ఉనికిని గమనించామనీ, అనుభవించామనీ చాలా మంది టూరిస్టులు అంటూంటారు. స్నేహితులతో కబుర్లు చెప్పుకుంటూనో, లేకపోతే ఏదో ఆలోచించుకుంటూ ఈ బీచ్‌లో నడుస్తున్న వారి చెవిలో ఎవరో గుసగుసగా మాట్లాడిన అనుభూతి కలుగుతుందట! అంతేకాకుండా ఏదో గాలి తమను తాకుతూ వెళ్ళడం చాలా మందికి అనుభవమే! అలాంటి సమయంలో గాలి హోరు ఎక్కువగా ఉండడం, తమ వెనకనే అడుగులో అడుగు వేసుకుంటూ ఎవరో వస్తున్న భావన కలగడం చాలా మందికి ఎదురయ్యిందని అంటూంటారు. ముఖ్యంగా సాయంత్రం ఆరు తరువాత ఇలాంటి అనుభవాలు చాలా మందికి ఎదురయ్యాయని చెబుతుంటారు. 'కొన్ని సార్లు తమను ఎవరో వెంబడిస్తున్న భావన కలుగుతుందనీ, తీరా వెనక్కి తిరిగి చూస్తే ఎవరూ ఉండరనీ' అంటారు పర్యాటకులు. ఇలాంటి అనుభవాలు చాలా మందికి ఎదురయ్యాయట! ఇక కుక్కలను తీసుకుని ఈ బీచ్‌లో తిరగడం ఓ భయంకరమైన అనుభవం అంటారు ఇక్కడి వారు. కుక్కలు ఈ బీచ్‌లోకి ప్రవేశించగానే విపరీతంగా అరవడం, పిచ్చిపట్టినట్టు పరిగెట్టడం చేస్తూంటాయట! కొన్ని సార్లు గొలుసులు తెంపుకుని పారిపోతుంటాయట. అవి ఏ వైపు చూసి అరుస్తున్నాయో...ఎటు వైపు పరిగెత్తుతున్నాయో ఆ దిశగా పరిశీలించి చూస్తే అక్కడ శూన్యం తప్ప ఎవరూ కనిపించరనీ, కానీ అవి మాత్రం మొరగడం ఆపవని చెబుతారు. ఈ బీచ్ నుంచి బయట పడేవరకూ అవి అలా మొరుగుతూనే ఉంటాయట. ఈ అనుభవం ఒక్కసారో రెండు సార్లో కాకుండా పదుల సంఖ్యలో చాలా మందికి ఎదురైంది అంటారు.

## రహస్య పరిశోధన..

ఇక్కడ ఉన్న నాలుగు బీచ్‌లలో ఈ ఒక్క బీచ్ లోనే ఇలాంటి అనుభవాలు ఎందుకు ఎదురవుతున్నాయన్న అన్న విషయాన్ని పరిశీలించడానికి కొందరు ఔత్సాహికులు రాత్రి సమయంలో బీచ్‌లో తిరుగుతూ రహస్యాన్ని ఛేదించడానికి ప్రయత్నించారట! అయితే సంవత్సరాలు గడుస్తున్నా వారి జాడ మాత్రం తెలియరాలేదట! అలా వెళ్ళిన వారి జాడే కాకుండా, ఈ బీచ్ గురించి తెలియక సాయంత్రం ఆరు తరువాత ఇక్కడ తిరుగాడే జంటల జాడ కూడా కనిపించలేదంటారు. ఇక్కడ దయ్యాలే వీరిని చంపేసి ఉంటాయని కొందరు అంటారు. అలాంటిదేమీ జరిగి ఉండదనీ, రహస్య

శోధన కోసం సముద్రం లోపలి దాకా వెళ్ళి ఉంటారనీ, అప్పుడు వాళ్ళు సముద్రంలో మునిగి ఉండవచ్చన్నది కొందరి నమ్మకం. ఏది ఏమైనా సాయంత్రం ఆరు తరువాత ఎవరూ ఇక్కడ ఉండడానికి ఇష్టపడరు. రాత్రి సమయంలో సముద్రాన్ని చూడడానికి వచ్చిన కొందరు ఇక్కడి భయానక వాతావరణం చూసి భయపడి వెనక్కి వచ్చేశారట! వారు చెప్పిన అనుభవాలను స్థానికులు ఇప్పటికీ మరిచిపోలేకపోతున్నారు.



### దయ్యాల కోట

ఈ బీచ్‌లో కోటలాంటి ఓ భవనం ఉంది. దీనికి దయ్యాల కోట అన్న పేరు వాడుకలో ఉంది. ఈ భవనంలోనే దయ్యాలు తిరుగుతూ ఉంటాయని స్థానికుల నమ్మకం. కొన్ని సంవత్సరాల క్రితమే ఇది పాడుపడిన భవంతిగా పేరు గాంచింది. పగటి సమయంలో కూడా ఈ భవనం చుట్టుపక్కలకి వెళ్ళడానికి ఎవరూ సాహసించరు. సుమారు పదిపదిహేను సంవత్సరాల క్రితం ఓ జంట ఈ భవనంలోకి వెళ్ళారనీ, వాళ్ళు తిరిగి రావడం ఇంత వరకూ తామెవ్వరూ చూడలేదని ఇక్కడి వారు చెబుతుంటారు. భవనంలో నివాసం ఉన్న దయ్యాలు వారిని చంపి వేసి ఉంటాయన్నది వీరి అనుమానం. కొన్ని సమయాలలో భవనం పై భాగాన వింత ఆకారాలు కూర్చుని ఉండడాన్ని కొందరు చూశామని చెబుతుంటారు. ఆ ఆకారాన్ని కెమెరాలో బంధించాలని ప్రయత్నించినా ఫలితం లేకపోయింది అంటారు.

### ఇవన్నీ అబద్ధాలే!

బీచ్‌లో దయ్యాలు ఉన్నాయన్న వాదనను కొందరు కొట్టి వేస్తున్నారు. దయ్యాలు ఉన్నాయన్నది కేవలం భ్రమ మాత్రమేనని, దయ్యాలు లేవని వారు స్పష్టం చేస్తున్నారు.

ఇసుక నల్లగా ఉండడం అనేది ప్రకృతి సహజమని వారు అంటున్నారు. ప్రపంచంలోని కొన్ని బీచ్‌లలో ఇసుక నల్లగా ఉంటుంది అని వారు స్పష్టం చేస్తున్నారు. ఇసుక నల్లగా ఉండడానికి మరొక కారణాన్ని కూడా వారు చూపుతున్నారు. సంవత్సరాల తరబడి ఈ బీచ్‌లో దహనసంస్కారాలు నిర్వహించడం వలన ఆ బూడిద, మసి ఇక్కడ ఇసుకలోనూ, నీటిలోనూ కలిసి రంగు మారి ఉండవచ్చని వారు అభిప్రాయపడుతున్నారు. దయ్యాలు అనేవి ఇక్కడ లేవని వారు స్పష్టం చేస్తున్నారు.

మనుషులు అదృశ్యం కావడం వెనుక గల కారణాలను వారు కొట్టిపారేస్తున్నారు. ఆడుతూ ఆడుతూ సముద్రం లోపలి దాకా వెళ్ళినవారు నీటిలో మునిగి చనిపోయి ఉండవచ్చనీ, వారి శరీరాలను అలలు ఎంతో దూరం తీసుకుపోవడం వలన వారి మృతదేహాలు కనిపించకపోవచ్చని వారు చెబుతున్నారు. అంతే తప్ప దయ్యాలు వారిని చంపి ఉంటాయన్నది కేవలం అపోహ మాత్రమేనని వారు స్పష్టం చేస్తున్నారు.

కుక్కలు మొరగడం అనే విషయంలో వింతేమి ఉందని వారు ప్రశ్నిస్తున్నారు. కొత్త ప్రదేశంలోకి వెళ్ళిన సమయంలోనూ, కొత్త వారిని చూసినప్పుడు కుక్కలు ఆపకుండా మొరుగుతూనే ఉంటాయి. అది వాటి సహజ లక్షణం. దాన్ని చూసి కుక్కలు దయ్యాలను చూసి మొరుగుతున్నాయని భ్రమపడుతున్నారని అంటున్నారు.

గాలి శబ్దాలు కూడా సహజమేనన్నది వారి వాదన. ప్రశాంతమైన, నిశ్శబ్ద వాతావరణంలో చిన్న శబ్దం కూడా స్పష్టంగా వినవచ్చనీ, అలాంటప్పుడు గాలి శబ్దం పెద్దగా వినిపించడంలో వింతేమీ లేదనీ, అది కూడా చాలా దగ్గరగా అంటే చెవి పక్కన వినిపించడానికి కారణం సముద్రం అంచున నడిచి వెడుతుంటే శబ్దాలు చెవి దగ్గరే వినిపిస్తాయనీ, ఇది అందరికీ తెలిసిన విషయమేననీ చెబుతున్నారు. ఆ శబ్దాలకు దయ్యాలు ఉన్నాయని అనడం ఎంత వరకు సమంజసమని వారు ప్రశ్నిస్తున్నారు.

సముద్రం దగ్గర ఉన్నది మామూలు భవంతే తప్ప దయ్యాల కోట కాదని వారు అంటున్నారు. భవనం లోపలి నుంచి వెలుపలికి రావడానికి వేరే మార్గం ఉందనీ, దాని ద్వారా లోపలికి వెళ్ళినవారు బయటకు వచ్చి ఉండవచ్చనీ అంటున్నారు. ఈ దిశగా ఊహించకుండా దయ్యాలు వారిని చంపి ఉంటాయని అనుమానించి, తమ అనుమానాల్ని ఇతరులకు వ్యాపింపచేయడం అమానుషమని వారు చెబుతున్నారు. ఇక ఆ భవనం మీద ఏదో ఆకారం ఉన్నట్టు కనిపించడం కూడా భ్రమేనన్నది వారి వాదన. భవనం ఆకృతి నీడను చూసి దయ్యం అని భయపడుతున్నారని అంటున్నారు. దాన్ని ఫోటో తీయాలనుకోవడం కూడా భ్రమేనన్నది వారి వాదన.

–దేవి

## చచ్చి బతికాం....



*డ్యుమాస్ బీచ్‌లో దయ్యాలు లేవు అని కొందరు వాదిస్తుంటే...దయ్యాలు ఉన్నాయని మరి కొందరి నమ్మకం. ఓ జంట అనుభవం కూడా ఈ బీచ్‌లో దయ్యాలు ఉన్నాయనే అనుమానాన్ని బలపరుస్తోంది. దయ్యాన్ని చూశామంటున్న ఆ జంట అనుభవాలు వారి మాటల్లోనే...'నా పేరు అభిషేక్. ఈ బీచ్‌లో దయ్యాలు ఉన్నాయన్నది నా స్వీయానుభవం.*

*సుమారు నాలుగు సంవత్సరాల క్రితం నేనూ నా గర్ల్ ఫ్రెండూ కలిసి సరదాగా ఈ బీచ్‌కి బయలుదేరాం. మాకు బీచ్ ఎంట్రన్స్‌లో ఓ ముదుసలి కనిపించాడు. ఏవో గాలి బుడగలు పట్టుకుని ఉన్నాడు. అతని ఆకారం చూడగానే కొద్దిగా భయం అనిపించింది. మా వంక నవ్వుతూ చూశాడు. అతడిని పట్టించుకోకుండా నేనూ నా గర్ల్ ఫ్రెండూ కబుర్లు చెప్పుకుంటూ నెమ్మదిగా ఇసుకలో నడక ప్రారంభించాం. కొద్ది దూరం వెళ్ళేసరికి గేటు దగ్గర చూసిన ముదుసలి మా ముందు నవ్వుతూ నిలుచున్నాడు. అంత తక్కువ వ్యవధిలో అతను మా దగ్గరికి రావడం చూసి షాక్ తిన్నాం. ఆ ముదుసలి మా వంక చూస్తూ నవ్వుతూ, చేత్తో ఏవో సైగలు చేస్తూ సముద్రం లోపలికి నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.*

*అతను తిరిగి బయటకురావడం మేం చూడలేదు. అంతేకాదు ఆ సమయంలో గాలి చేసే శబ్దాలు కూడా వినలేకపోయాం. ఇంక ఒక్క క్షణం కూడా అక్కడ నిలబడలేకపోయాం. వెంటనే వడివడిగా బయటకు వచ్చేశాం. మా వెనకే ఎవరో వస్తున్నట్టు అడుగుల శబ్దం వినిపించినా మేం వెనుతిరిగి చూడలేదు. ఆ తరువాత ఎప్పుడూ ఆ బీచ్‌కి వెళ్ళలేదు.'*




**'సుశీలా...! బెడ్రూములో నా సెల్లు మోగుతున్నట్టుంది కొంచెం తెచ్చిపెట్టు' ఆఫీసు నుండివచ్చి టీవీలో న్యూస్ చూస్తున్న ప్రసాదరావు భార్య సుశీలతో అన్నాడు.**

**'అవ్వ... ఆఫీసు నుండి ఇలా వచ్చారో లేదో అప్పుడే ఫోనులు. రోటరీ క్లబ్ సెక్రటరీ కాదుగానీ, ఇది మొదలు ఇంక రాత్రి పడుకునేవరకు మీకా ఫోనుతోనే సరిపోతోంది' చిన్నగా విసుక్కుంటూ అంది సుశీల.**

**'అబ్బా ఏంటి సుశీలా, ఊరికే ఎవరు ఫోను చేస్తారుచెప్పు, ఏదో అవసరం ఉండో లేక ఏదైనా ఇబ్బందితోనో మనకి ఫోను చేస్తారు. అయినా నలుగురికీ చేతనైన సహాయం చెయ్యమని మా తాతయ్య నాతో అనేవాడు. పెళ్లైన దగ్గర నుండి అది నీకు నేను చెబుతూనే ఉన్నాను' నవ్వుతూ అన్నాడు ప్రసాదరావు.**

'అవునులెండి, రోటరీక్లబ్ సెక్రటరీగారు ఊరికే సాయం చేస్తానంటే దారిన పోయే దానయ్య కూడా మీ సాయం కోసం వస్తాడు' భర్త చేతికి ఫోను ఇస్తూ అంది సుశీల.

'ఏమోయ్ ఇది నువ్వు అనుకుంటున్నట్టు వేరె వరి ఫోనో కాదు, స్వయానా మన పుత్రరత్నం ఫోను అమెరికా నుండి, 'అమెరికా' అన్న మాట సాగ దీస్తూ అన్నాడు ప్రసాదరావు.

'చాల్లెండి, వేళాకోళాలు ఆపి ముందు ఆ ఫోను ఎత్తండి, వాడు మాత్రం ఊరికే చేస్తాడా ఏమిటి' అంది సుశీల.

'నిజమే... నువ్వన్నది కరక్టే. ఓ... ఇవాళ శని వారం కదా! వీకెండ్... అందుకే పాపం అబ్బాయి గారికి తీరిక దొరికి మనం గుర్తొచ్చి ఉంటాం. అందుకే ఫోను చేశాడు. వారమంతా గుర్తురాని తల్లిదండ్రులు వారాంతంలో మాత్రం గుర్తుకు వస్తారు' భార్యతో అని, 'ఊ...చెప్పరా రవీ, ఎలా ఉన్నారు? మనవడు ఏం చేస్తున్నాడు? వాడి తెలుగు ఎంతవరకు వచ్చింది?' కొడుకు రవిని అడి గాడు.

'అంతా బాగానే ఉన్నాం నాన్నగారు. వాడు ఇప్పుడు తెలుగు బ్రహ్మాండంగా మాట్లాడుతున్నాడు. మొన్న వాడికి భగవద్గీత శ్లోకాల్లో ప్రైజు కూడా వచ్చింది, మీరెలా ఉన్నారు?' అడిగాడు రవి.

'అందరం కులాసాగానే ఉన్నాం. అయినా ఏమిట్రా రవీ, వారంలో ఒక్కనాడు అదీ శనివారం నాడు మాత్రమే ఫోను చేస్తావు. మిగతా రోజుల్లో చెయ్యవేంటని అడిగితే 'అసలు ఖాళీ ఉండదంటావు. ఇక్కడ పగలైతే అక్కడ రాత్రి, అక్కడ పగలైతే ఇక్కడ రాత్రి, అందుకే రాత్రిళ్ళు ఫోన్ చేసి మిమ్మల్ని ఇబ్బంది పెట్టలేను, అలా అని పగలు చేసి మిమ్మల్ని ఆఫీసులో డిస్టర్బ్ చెయ్యలేనంటూ ఏవో కుంటిసా కులు చెబుతావు. అవునూ ఇంతకీ మీరు ఇండి యాకి ఎప్పుడొస్తున్నారు?' అడిగాడు ప్రసాదరావు.

'ఎప్పుడో ఏమిటి నాన్నగారూ, అన్నీ బావుంటే వచ్చే నెలలో వస్తాం. అదీగాక మొన్న మా అత్త గారి కాలు విరిగింది, మీకు తెలుసుకదా! అందు చేత ముందు ఆవిణ్ణి చూసి అప్పుడు మనింటికి వస్తాం' చాలా క్యాజువల్‌గా అన్నాడు రవి.

'బావుందిరా... క్రిందటిసారి కూడా ఇలాగే చెప్పావు. ఇదిగో ఇండియాకి బయలుదేరుతున్నాం అంటూ మమ్మల్ని ఎంతో ఆశపెట్టి చివరికి ఏం చేశావు... 'సారీ నాన్నగారూ, మేం రావడం లేదు, నాకు సెలవు దొరకలేదన్నావు. ఇలా ప్రతి ఏడూ ఇండియాకి రాకుండానే తప్పించుకుంటున్నావు.

**మనవడితో కలిసి ఓ తాతగారు విహారయాత్రకు వెళ్ళారు. ఆ పర్వతాలు, ప్రకృతి వారిని ఎంతో పరవశింపజేశాయి. ఆ కొత్త వాతావరణంలో కేరింతలు కొడుతూ ఆడుకున్నారు తాతా మనవడు. అంతలోనే మనవడు కాలుజారి గాయపడ్డాడు. కేరింతలు కాస్తా వికటించి ఏడుపు ప్రారంభించాడు మనవడు. ఆ కొండలన్నీ తనను పరిహసిస్తున్నాయని తాతకు చెప్పాడు. నిజంగా అది నిజమే అయితే ఆ మనవణ్ణి కొండలెందుకు పరిహసించినట్టు?**

మాకు మాత్రం ఇక్కడ ఎవరున్నారు చెప్పు. అయినా నీకు అమ్మానాన్నల్ని చూడాలని ఉండక పోవచ్చును. కన్నవారు మాత్రం కొడుకు తమ ఎదుటే ఉండాలని కోరుకుంటారు. సరేలే ఇవన్నీ నీకు ఎంత చెప్పినా ఇప్పుడు అర్థం కావు' బాధగా అన్నాడు ప్రసాదరావు.

'నాన్నగారు నేను మీ బాధ అర్థం చేసుకో గలను. నాకు మాత్రం మిమ్మల్ని చూడాలని ఉండ దని మీరెందుకనుకుంటున్నారు? మీ మనవడు కూడా మిమ్మల్ని చూడాలని తెగ ఆరాట పడుతు న్నాడు. వాడికి మీరు చెప్పే మంచిమాటలు వినా లని ఎప్పటినుండో ఉంది. వాడు కొంచెం పెద్దవా డయ్యాడు కదా, ఇప్పుడు వాడికి అన్నీ తెలుస్తు న్నాయి. అందుకనే వాడు కూడా ఎప్పుడెప్పుడు ఇండియాకి వద్దామా, మీతో సరదాగా గడుపు దామా అనుకుంటున్నాడు' మరోసారి చెప్పాడు రవి.

'చాలా సంతోషం నాయనా! అయినా మన దేశమంత గొప్పదేశం, మన ప్రాంతమంత గొప్ప ప్రాంతం మరొకటి లేదు. మన పల్లెటూరి అందా లను ఏ కవి వర్ణించగలడో చెప్పు. అలాగే ఇక్కడ అన్ని కులాల వారు, మతస్థుల వారు కలసిమెలిసి హాయిగా అన్నదమ్ముల్లా ఒకటిగా ఉంటూ ఇతర దేశాలకు ఆదర్శంగా ఉంటున్నారు. అటువంటి గొప్పదేశం వదిలి 'డాలర్ల మోజులో' మీరందరూ విదేశాలకు వెళ్ళి అక్కడ నోరు కట్టుకుని ఊడిగం చేస్తున్నారు. ఏమిటోరా తల్చుకుంటే ఎంతో బాధగా ఉంటుంది' అన్నాడు ప్రసాదరావు.

'అందుకే నాన్నగారు, మీరు ఇలా అంటారనే నేను తరచుగా ఫోను చెయ్యడం లేదు. మీ అభిప్రా యాలు మీవి, మా అభిప్రాయాలు మావి. ఎప్పుడూ పొంతన కుదరదు. తరాల మధ్య అంత రాలు సమాంతరరేఖల్లా ఎప్పటికీ కలవవు. మా అభిప్రాయాలతో మీరు ఏకీభవించరు, మీ అభిప్రా యాలతో మేం రాజీ పడలేం. నిజంగా ఇది ఒక ప్రాక్టికల్ ప్రాబ్లెం' అంటూ ఎంతో చక్కగా తనను తాను సమర్థించుకున్నాడు రవి.

రవి తెలివితేటలకు ఆనందపడాలో, బాధ పడాలో తెలియని ప్రసాదరావు కొద్దిసేపు మాట్లాడి ఫోను పెట్టేశాడు.

వారి సంభాషణ విని 'ఎందుకండీ వాడు ఫోను చేసిన ప్రతీసారీ ఇండియాకి వచ్చేయమని సతాయిస్తారు. అయినా మేం రాం మొర్రో అంటుంటే మీరు అంతలా బ్రతిమాలడం నాకేం నచ్చలేదు. వాళ్ళకి మనసులో రావాలని లేనప్పుడు మీరు ఎన్ని సార్లు చెప్పినా వృథానేకదా. ఇప్పుడు వాడు స్వతం త్రంగా సంపాదించుకుంటున్నాడు. అదీకాక కోడలు ఇక్కడికి వస్తే మనతో పాటే ఉండాలి. అది ఆవిడగారికి ఇష్టం లేదాయే! ఆ విషయం చెప్ప డానికి వీడికి గుండె ధైర్యం సరిపోవడం లేదు. అందుకే ఎప్పుడూ ఇదిగో అదిగో అంటూ మూడేళ్ళ నుండి ఒకేపాట పాడుతున్నాడు. మీ ధోరణే మీది గానీ అర్థం చేసుకోరు. ఇప్పుడు మనకొచ్చిన లోటేంటి, హాయిగా మీరు ఉద్యోగం చేస్తున్నారు. నేనేమో ఇంట్లో గోమాత సేవ, మొక్కల సంరక్ష ణలో రోజంతా గడుపుతున్నాను. నిజంగా వాళ్ళొస్తే మన ఈ నిత్యకృత్యాలకు ఇబ్బంది కూడా కలుగు తుంది. వాళ్ళకి ఈ వాసనలు పడవు. అయినా ఎక్కడివాళ్ళు అక్కడేవుంటే ఏ ఇబ్బందులూ లేకుండా ఎవరి మానానవాళ్ళు హాయిగా ఉండొచ్చు' కొంచెం ఉక్రోషంగా అంది సుశీల.

అయితే సుశీల ఉక్రోషానికి వేరే కారణం ఉంది. అదేంటో ప్రసాదరావుకి బాగా తెలుసు. ఓసారి కొడుకు, కోడలు వచ్చినప్పుడు వాళ్ళతో పాటు అమెరికా వస్తానని అడిగింది సుశీల. 'ఏంటమ్మా అమెరికా రావడమంటే అనకాపల్లి వెళ్ళడ మనుకున్నావా! నువ్వు అక్కడికి రావాలంటే పాస్ పోర్టు, వీసా ఇవన్నీ కావాలి. అప్పుడే నువ్వు అమె రికా రాగలుగుతావు' విసుక్కున్నాడు రవి. పోనీ ఆ పాస్‌పోర్ట్, వీసా సంగతి చూడరా అని సుశీల అంటే 'ఎందుకమ్మా, నేను త్వరలోనే ఇండియాకు శాశ్వతంగా వచ్చేస్తాను కదా' అని ఆ అమాయకు రాలు ఇంక అమెరికా ఊసెత్తకుండా చేశాడు. పొర పాటున ఎప్పుడైనా సుశీల 'ఒరేయ్ నువ్వు ఇప్పట్లో వచ్చేలా లేవు, నువ్వు ఇండియా వచ్చేలోగా నాకొ క్కసారి అమెరికా చూపించరా' అని మనసు చంపు కోలేక అడిగితే, 'అమ్మా ఇప్పుడు వీసా దొరకడం చాలా కష్టం' అని చెబుతాడు. అయితే ప్రతిఏడాదీ వాళ్ళ అత్తగారికి మాత్రం వీసా ఎలా దొరుకుతుం దన్నది వేరే విషయం. ఎప్పుడైనా కొడుకు దగ్గర ఆ మాటే అంటే 'అబ్బా ఊరుకోమ్మా మీ కోడలు వింటే బాగోదు' అని ఆమె నోరు నొక్కేస్తాడు. ఆ

## ఐష్‌ని నక్క అనేసింది

*ఐశ్వర్యారాయ్ గురించి చెడుగా కానీ, వ్యతిరేకంగాకానీ మాట్లాడడానికి పరిశ్రమలో ఎవ రికీ మనసు రాదు. అమితాబ్ కోడలిగానే కాకుండా తన వ్యక్తిత్వం ద్వారా కూడా ఐష్ చాలామందికి సన్నిహితురాలు. అందుకే ఆమె గురించి ఎవరూ తప్పుగా మాట్లాడరు. కానీ కత్రినా మాత్రం ఐష్‌ను నక్కతో పోల్చే సింది. ఇదంతా సినిమా ప్రమోషన్లో భాగంగా జరిగినా, కత్రినా నోటి దురుసు తనాన్ని ఇప్పుడు బాలీవుడ్‌లో అందరూ తప్పు పడుతున్నారు. ఇంతకీ అసలు సంగతేమి టంటే రణబీర్, తనూ కలిసి నటించిన 'జగ్గా జాసూస్' సినిమా ప్రమోషన్లో కత్రినా ఐష్ గురించి ఈ పదం వాడింది. ఈ ప్రమోషన్ కార్యక్రమంలో రణబీర్ కత్రినాను సరదాగా, బాలీవుడ్‌లో ఎవరినైనా నక్కతో పోల్చాల్సి వస్తే ..." అన్న మాటను పూర్తి కాకుండానే కత్రినా వెంటనే ఐష్ అంటూ టక్కున సమా ధానం చెప్పేసింది. ఈ సమాధానం విన్న రణబీర్ తెల్ల ముఖం వేశాడు. దాంతో బాలీ వుడ్ జనాలు ఆమె మీద కారాలు మిరి యాలు నూరుతున్నారు.*





విషయం తలుచుకున్న ప్రసాదరావు మనసులోనే నవ్వుకుంటూ 'ఏమోయ్ ఈసారి వాడితో అమెరికా వస్తానని అనలేదే' అంటూ ఆటపట్టించాడు.

'మీరు చూస్తూ ఉండండి. నా కొడుకు నన్ను తప్పకుండా అమెరికా తీసుకెళతాడు. అప్పుడు తెలుస్తుంది మీకు నా విలువేంటో' ఉడుక్కుంటూ అంది సుశీల.

ఏమిటో సుశీలా, నువ్వు అమెరికా వెళ్ళడానికి ఎందుకంత ఉబలాటపడుతున్నావో నాకు అర్థం కావడం లేదు. మన దేశంలో లేనిది, విదేశాలలో ఉన్నది ఏమిటి? ఇక్కడ ఎన్నో అందమైన ప్రదేశాలు, ఎన్నెన్నో పుణ్యక్షేత్రాలు, మరెన్నో జీవనదులు ఉన్నాయి. వాటిని వదిలి వేరే చోటకు వెళతానంటావేమిటి? అవునులే 'దూరపుకొండలు నునుపని ఊరికే అనలేదు' నవ్వుతూ అన్నాడు ప్రసాదరావు.

'అబ్బా ఊరుకోండి! ఏదైనా అంటే చాలు లేడికి లేచిందే పరుగు అన్నట్టు ఇట్టే మాట్లాడతారు. ఇప్పుడు తీర్థయాత్రలకు, విహార యాత్రలకు వెళితే గోమాతను ఎవరు చూస్తారు? మన మొక్కల సంరక్షణ ఎలాగ? ఆలోచించండి. అయినా ఇది జరిగేపని కాదుగానీ, వంటైంది భోజనం చేద్దురుగానీ లేవండి' అంది సుశీల. ఇద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఆనందంగా భోజనం ముగించారు.

***

ప్రసాదరావు వైజాగ్ స్టీల్‌ప్లాంటులో సీనియర్ ఇంజనీరు. వైజాగ్ రోటరీ క్లబ్ సెక్రటరీ కూడా. ప్రతి వారం రోటరీ క్లబ్ ఏర్పాటుచేసే వివిధ సమాజ సేవా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటూ చాలా మంచి పేరు తెచ్చుకున్నాడు ప్రసాదరావు. అలాగే ఎన్నో మంచి విషయాలు కూడా ప్రసంగంలో చెబుతాడు. అతను చెప్పే విషయాలు అందరూ చాలా ఆసక్తిగా వింటారు. ఆయన సేవలకు గుర్తింపుగా వైజాగ్ రామకృష్ణ మఠంలో సన్మాన కార్యక్రమం ఏర్పాటుచేశారు. ఆ నగర మేయర్‌ను ముఖ్య అతిథిగా పిలిచారు.

***

ఆదివారం. ప్రసాదరావు సన్మానానికి అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయి. ముఖ్యఅతిథులు, ఆహూతులు ఒక్కరొక్కరుగా రావడంతో సన్మాన కార్యక్రమం ప్రారంభమైంది.




రోటరీక్లబ్ ప్రెసిడెంట్ దివాకరం మైక్ ముందు కొచ్చి అతిథుల్ని పేరుపేరునా వేదికపైకి ఆహ్వానించారు. ఆ ఏడాది రోటరీ క్లబ్ చేసిన ముఖ్యమైన కార్యక్రమాలు, వృద్ధాశ్రమాల్లో ఉంటున్న వారికి ఉచిత వైద్యశిబిరాలు, చలికాలంలో పేదలకు రగ్గుల పంపిణీ, అనాథ ఆశ్రమం పిల్లలకు ఉచిత దుస్తులు, పుస్తకాల పంపిణీ, రక్తదాన శిబిరాలు, నేత్రవైద్య శిబిరాలతోపాటు, దేశ ప్రధాని చేపట్టిన 'స్వచ్ఛభారత్' కార్యక్రమంలో భాగంగా వారు ఏఏ ప్రాంతాలలో ఆ కార్యక్రమం నిర్వహించిందీ వివరించారు. ఈనాటి సన్మానకర్త ప్రసాదరావుగారు చేసిన సేవలు గురించిచెప్పి ఆయన్ను ప్రసంగించాల్సిందిగా కోరుతున్నాం' అని చెప్పి దివాకరం తన సీటులో కూర్చున్నాడు.

దివాకరం గారికి కృతజ్ఞతలు చెప్పిన ప్రసాదరావు మాట్లాడుతూ ఇక్కడకొచ్చిన పుర ప్రముఖులందరికీ నా వందనాలు. అలాగే మా రోటరీ క్లబ్ నిర్వహిస్తున్న అనేక సమాజహిత కార్యక్రమాలకు తమవంతు సహకారం అందిస్తున్న ప్రతిఒక్కరికి పేరు పేరున నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను' అని ఉపన్యాసం కొనసాగించాడు.

"మనిషి సంఘజీవి. ప్రతి ఒక్కరు మన సమాజ పురోగతికి తమవంతు సహకారం, తమవంతు కృషిని ఎప్పటికప్పుడు అందిస్తే సమాజానికి కావాల్సిన సదుపాయాలన్నీ సమకూరతాయి. సమాజం బాగుంటే దేశం బాగుంటుంది. దేశం బాగుంటే ప్రజలు ఆనందంగా ఉంటారు. నిత్యజీవితంలో మనం చేసే పనులే మన జీవిత దర్పణంలో 'ప్రతిబింబాలై' కనిపిస్తాయి. మనం మంచి పనులు చేస్తే మంచే జరుగుతుంది. చెడ్డపనులు చేస్తే ఏం జరుగుతుందో మీకు నేను ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. మనలో చాలామంది, 'నేను అన్నీ మంచి పనులే చేస్తున్నాను. నాకు తప్పకుండా మంచే జరుగుతుంది' అనుకుంటూ ఉంటారు. అలాగే తాను చనిపోయిన తర్వాత స్వర్గానికే పోతానని అనుకుంటారు. నిజానికి స్వర్గం–నరకం అనేవి వేరే ఎక్కడో లేవని నా ఉద్దేశం. మనం మంచి పనులు చేస్తే అంతా మంచే జరిగి మన జీవితం హాయిగా ఆనందంగా సాగుతుంది. అటువంటి జీవితం మనకి స్వర్గ సమానమే కదా!

మనం చేసే చెడ్డపనులు ఇతరులకు తెలియక పోయినా మన అంతరాత్మకు తెలుసు, ఆ చింతనతోనే సుఖశాంతులు లేక జీవితం ఎంతో దుర్భరమవుతుంది. దాంతో ఆనందంగా ఉండలేరు. అటువంటి జీవితం 'నరకం' తో సమానం. స్వర్గంలాంటి జీవితమే కావాలనుకుంటే అందరూ వీలైనంతవరకు మంచి పనులే చెయ్యాలి. ఒకవేళ మంచిపనులు చెయ్యలేకపోయినా, కనీసం చెడ్డపనులు మాత్రం చెయ్యొద్దు. ఆ విధంగా మనం సమాజానికి ఎంతో మేలుచేసిన వాళ్ళమవుతాం.

ఎవరు ఎన్ని చెప్పినా మనిషి చివరకు 'కర్మ' సిద్ధాంతాన్నే నమ్ముతాడు. నాకు తెలిసీ ఏ పాపం చెయ్యలేదు. మరి నా జీవితం ఎందుకిలా తయారైంది? అన్ని కష్టాలూ నాకే ఎందుకొస్తున్నాయి? అనుకుంటాం. అయినా నాకు ఇలా జరిగే 'యోగం' ఉంది కాబట్టే ఇలా జరిగింది, దాన్ని ఎవరూ తప్పించలేరని సరిపెట్టుకుంటాం. అంటే అన్నింటికీ వేదాంతమే కదా!

తెలియక 'చెడు' చేస్తే అది తప్పు, తెలిసిచేస్తే అది 'పాపం'. కాబట్టి పాపపుణ్యాలు మన చేతల్లోను, చేతుల్లోను ఉంటాయి. పాపపు పనులు చెయ్యకుండా ఉండాలంటే 'భగవత్ ధ్యానం' ఎంతో అవసరం. భగవత్ ధ్యానంలో పడ్డవాడు పాపపు పనుల గురించి ఆలోచించడు.

అన్ని జన్మలలోకి మానవజన్మ ఉత్తమమైనది అంటారు. నలుగురికి మంచి చేసే అవకాశం ఒక్క ఈ మానవ జన్మలోనే సాధ్యం కాబట్టే అలా అంటారు. అలాగే ఆ భగవంతుడు మనిషికిచ్చిన ఓ రెండు గొప్ప వరాలు వివేకం, విచక్షణ. అందుకే ఈ రెంటినీ మనం సక్రమంగా ఉపయోగించుకోవాలి. లేకపోతే మనకీ పశువుకూ తేడా ఉండదని పెద్దలు ఏనాడో చెప్పారు. వ్యక్తి మారితే, వ్యవస్థ దానంతట అదే మారుతుంది. మనిషి ఆశకు అంతే లేదు. అడ్డూ ఆపూలేకుండా ధనం సంపాదిస్తున్నాడు. 'ఎలా సంపాదించాం' అనికాదు, 'ఎంత' సంపాదించాం' అనేదే ఈ రోజుల్లో ముఖ్యమై పోయింది. ప్రేమించడానికి మనిషినీ, వాడుకోవడానికి డబ్బునీ సృష్టించాడు దేవుడు. కానీ మనం తెలివిగా మనిషిని వాడుకుంటూ డబ్బుని ప్రేమిస్తూ ఆ విధాత నిర్ణయాన్నే మార్చేశాం.

బ్రతకడానికి 'డబ్బు' అవసరమే. ప్రతి మనిషి తన సంపాదనలో కొంత దైవ కార్యాలకు, మరి కొంత సమాజానికి పనికొచ్చే పనుల కోసం వెచ్చిస్తే ఆ సంపాదనకు ఓ అర్థం, ఆ ధనానికి సార్థకత ఏర్పడుతుంది.

సమయం సందర్భం వచ్చింది కాబట్టి మీ అందరికీ ఓ విషయం చెప్పదలచుకున్నాను. మేము మా క్లబ్ తరపున ఎన్నో వృద్ధాశ్రమాలు తిరిగాం. అక్కడున్న తల్లిదండ్రుల బాధ, వేదన వర్ణనాతీతం.

ఒక్కొక్కరిది ఒక్కోరకమైన గాథ. నిజంగా వాళ్ళ బాధలు విన్న తర్వాత లోకంలో ఇటువంటి కసాయి కొడుకులు కూడా ఉంటారా అనిపించింది. కానీ వాళ్ళను చూసిన తర్వాత ఉంటారని నమ్మక తప్ప లేదు. వాళ్ళ బాధలు చూస్తే ఏ సంబంధమూ లేని నా గుండె తరుక్కుపోయిందంటే, మరి వాళ్ళ రక్తం పంచుకుపుట్టి, తల్లిదండ్రుల్ని అంత అమానుషంగా వదిలేసిన ఆ కొడుకులది గుండెనా లేక రాయా అన్నది ఆ కొడుకులకే తెలియాలి.

ఈ సభాముఖంగా నేను మీ అందరినీ కోరేది ఒక్కటే...! దయచేసి ప్రతి ఒక్కరు పెద్దలను, వృద్ధులను గౌరవించడం అలవాటు చేసుకోవాలి. ఎందుకంటే నేడు చాలామంది వృద్ధుల్ని, తల్లిదండ్రుల్ని ఎంతో నిర్లక్ష్యం చేస్తున్నారు. పెద్దవాళ్ళను చక్కగా చూసుకోవడం ప్రతి ఒక్కరి కర్తవ్యం. వారి చల్లని ఆశీస్సులే మనకు శ్రీరామరక్ష. మనలో చాలాకొద్ది మందికే ఇటువంటి అవకాశం వస్తుంది. మరి అటువంటి అవకాశాన్ని మనమెందుకు వదులుకోవాలి. ఒక్కొక్కసారి ఆలోచిస్తుంటే ఈ లోకంలో 'అత్తమామ'లంత అదృష్టవంతులు 'తల్లిదండ్రు'లంత దురదృష్టవంతులు ఇంకెవరు లేరేమో అనిపిస్తోంది. ఎందుకంటే, తన తల్లిదండ్రులను హేయభావంతో చూసే నేటి కొడుకులు తమ అత్తమామల అడుగులకు మడుగులొత్తుతున్నారు. ఎందుకీ వివక్ష? దానికి సమాధానం కొడుకులే చెప్పాలి. నేడు చాలా మంది పిల్లలు తల్లిదండ్రులను పట్టించు కోవడం లేదు, దాంతో అందరూ ఉండి కూడా వాళ్ళు అనాథల్లా బ్రతుకుతున్నారు. వారిని జేరదీసి మేమున్నా మన్న మనోధైర్యం కలిగిస్తే శేష జీవితాన్ని వాళ్ళెంతో ఆనందంగా గడుపుతారు. ఇప్పుడు మన తల్లిదండ్రులు ఉన్న స్థితికే రేపు మనమూ జేరతాం. మనం మన తల్లిదండ్రుల్ని ఆదరిస్తే, అదిచూసి మన పిల్లలు మనల్నీ అలాగే ఆదరిస్తారు. ఇప్పటి మన చేతల్నే రాబోయే తరమూ అనుసరిస్తుంది కాబట్టి మనం మంచి పనులు చేస్తూ తర్వాతి తరానికి సంస్కారం నేర్పాలి. ప్రతి ఒక్కరు గత జీవితాన్ని సింహావలోకనం చేసుకుంటూ ఉండాలి. మనిషి జీవితం క్షణభంగురంలా బుద్బుద ప్రాయం. అందుకే అవకాశం ఉన్నప్పుడు నలుగురికి మేలు చేసే పనులు చెయ్యాలి. ధనం కాదు, సంపాదించుకున్న 'కీర్తి' శాశ్వతం.

ఇందాక నేను చెప్పాను మనం చేసే పనులు మన జీవితానికి అద్దం లాంటివని. ఇప్పుడు మీకు ఒక తాతామనవడి కథ చెబుతాను, ఓసారి ఓ తాతగారు తన కొడుకు, మనవడితో విహారయాత్ర కెళ్ళారు. అదొక అందమైన కొండప్రాంతం. ఆ ఎత్తైన కొండలు చూసి మనవడు ఎంతో మురిసిపోయాడు. అక్కడి ప్రకృతి అందాలను పరవశంతో చూస్తూ పరధ్యానంగా నడుస్తున్న మనవడు రాయి తగిలి పడిపోతే బాధతో 'అమ్మా' అని గట్టిగా అరిచాడు. తాత, అతని కొడుకు కంగారుగా అక్కడికి వచ్చారు.

అతని అరుపు ఆ కొండ ప్రాంతంలో ప్రతిధ్వనించింది. ఆశ్చర్యపోయిన మనవడికి ఆ ప్రతిధ్వని వింతగా అనిపించింది. 'తాతగారూ, నా మాటలే తిరిగి వినిపిస్తున్నాయేమిటి' అని అడిగాడు.

దాన్ని 'ప్రతిధ్వని' అంటారు అని నవ్వుతూ చెప్పారు తాతగారు. ఉడుక్కున్నాడు ఆ మనవడు. 'దెబ్బతగిలి బాధతో అమ్మా అంటే ఊరడించవలసింది పోయి ఈ కొండలు నన్ను వెక్కిరిస్తున్నాయేంటి తాతగారూ' చిన్నగా ఏడుస్తూ అన్నాడు మనవడు.

'అది కాదు బాబూ, ఈ కొండల్లో మనం ఏదంటే అదే మనకు తిరిగి వినిపిస్తుంది. దాన్నే 'రీ సౌండ్' అంటారు. కావలిస్తే చూడు అంటూ 'నేను బాగున్నాను, నువ్వు బాగున్నావా' అని గట్టిగా అరిచాలు తాతగారు. అతనికి వెంటనే 'నేను బాగున్నాను, నువ్వు బాగున్నావా' అని తిరిగి ఆ కొండల్లో నుండి ప్రతిధ్వనించడం చూసి ఆశ్చర్యపడ్డాడు మనవడు. 'ఐ లైక్ యూ' అని గట్టిగా అనడంతో అదే ధ్వని అతనికి తిరిగి వినిపించింది. ఆనందంగా తాతగారివంక చూశాడు. మనవడి ఆనందం చూసిన తాతగారు 'చూశావా నాయనా, బాధతో నువ్వు 'అమ్మా' అని అరిస్తే ప్రకృతి నీ బాధ పంచుకుంది. తను కూడా అదే జవాబిచ్చింది. మనం ప్రకృతికి ఏమిస్తే ప్రకృతి నుండి తిరిగి దాన్నే పొందుతాం. అందుకే మనిషి ప్రకృతి విరుద్ధంగా ఏం చెయ్యకూడదు, ఒకవేళ చేసినా పూర్తిజయం ఎన్నడూ లభించదు. మనం ఇతరులకు సాయం చేస్తే తిరిగి సాయపడతారు. నలుగురి గౌరవం పొందాలంటే ఆ నలుగురినీ గౌరవించడం నేర్చుకోవాలి. లోకంలో ఏ మనిషీ చెడ్డవాడు కాదు. మనిషిలోని మంచి చెడ్డలు మన దృక్పథంలోనే ఉంటాయి. జీవితం 'యాదృచ్ఛికం' కాదు మన చేష్టలకు దర్పణంలోని 'ప్రతిబింబం' లాంటిది. ఇది తెలుసుకుని ప్రతిమనిషి చెడ్డ పనులు చెయ్యడం మానుకోవాలి. అప్పుడే కక్షలు, ద్వేషాలు లేకుండా 'ఒకరికొకరు' గా జీవిస్తారు. అలాంటి జీవితంలోని ఆనందమే వేరు. వయసు పెరిగేకొద్దీ అనుభవంమీద నువ్వే తెలుసుకుంటావు. కాబట్టి నేను చెప్పిన విషయాలు అర్థం చేసుకుని ఇతరులపట్ల భూతదయ కలిగివుండు, నీకు అంతా మంచే జరుగుతుంది, అంటూ తాతా మనవల కథతో ఉపన్యాసం ముగించాడు ప్రసాదరావు. అక్కడివారు కరతాళ ధ్వనులతో అభినందనలు తెలుపుతూ ఆయన్ని ఘనంగా సత్కరించారు.

**సెల్: 094153 68475**




ఎవరి ప్రపంచంలో వాళ్ళుంటున్నారు
మనుషులై బతికి పోతూనే ఉన్నారు
గుండ్రమయిన భూమి మీద బందీలుగా
ఈ నాలుగు గోడల లోపలే దాక్కుని

## మహానదిలోకి

వాటిని బద్దలు కొట్టే శక్తి లేక అసహాయులై
దారి తప్పిపోయి అటూ ఇటూ తిరుగుతున్నారు
మాటలు కలపటం మర్చిపోయి
కలల అడుగు జాడల్ని తుడిచి పెట్టుకుంటూ
సాగుతున్న సమయపు ముల్లుల్లో ఇరుక్కుని
మనుషులు ఖండ ఖండాలుగా విడిపోతున్నారు

దేహమంతా ఏదో దుఃఖం కలయ తిరుగుతోంది
మనసు లోపలి ముల్లుని ధైర్యంగా తీసి
తోరణాలు కట్టిన వాకిలి ముందు
ధైర్యంగా నుల్చుని నవ్వే సాహసి లేడు
కలలు పొంగుతున్న నదిఒడ్డున నడిచిన మనిషే లేడు
అందరూ ఒరిగిపోతున్న కాలాన్ని నిలబెట్టలేని శక్తిహీనులు
రాలిన కన్నీళ్ళని మరలా దోసిళ్ళకెత్తుకోగలరా
బ్రతుకుని జూదంలో పెట్టి తిరుగుతున్నాం
అనుబంధాల్నీ ఆత్మసంబంధాల్నీ వదిలి పెట్టి
మట్టి శిలలై కదిలిపోతున్నాం.

కాదు... కాదు... మనుషులమవ్వాలి
దేహంమీదికి కొత్త కవచాన్ని తెచ్చుకోవాలి
బ్రతుకులోంచి మరలా మరలా
ధైర్యంగా మొలకెత్తడం నేర్చుకోవాలి



నడుస్తున్నంతమేరా ప్రేమ విత్తనాల్ని
చల్లుకుంటూ
విస్తరిస్తూ సాగిపోవాలి

నేను మనిషిని నీటి తొట్టెలోంచి
మహానదిలోకి వదులుతాను
విచ్చుకున్న పుష్పంమీద సీతాకోకచిలకని చేసి
ప్రపంచానికి ప్రేమగా బహూకరిస్తాను
మనిషికి మనిషిలా జీవించడమెలాగో నేర్పిస్తాను
అతడిని మానవ ప్రపంచంలోకి ప్రవేశ పెడ్తాను.

**—ఖాదర్ షరీఫ్**
***సెల్. 94419 38140***






**డి. వెంకట్రామయ్య కథలు**

**ధర:** 175 రూపాయలు,

**పేజీలు:** 288

**ఆకాశవాణిలో నా అనుభవాలు**

డి.వెంకట్రామయ్య

**ధర:** 175 రూపాయలు

**పేజీలు:** 302



**ప్రచురణ:** ఎమెస్కో బుక్స్, దోమల్‌గూడ, హైదరాబాద్-29 బ్రాంచి చంద్రం బిల్డింగ్స్ సి.ఆర్.రోడ్, చుట్టుగుంట, విజయవాడ-04

కవిత్వం మినహా అన్ని సాహితీ ప్రక్రియల్లోనూ దాదాపు యాభైఏళ్ళ అనుభవజ్ఞులు డి.వెంకట్రామయ్యగారు. తన రచనలతో సమాజాన్ని ఉద్ధరించేయాలనే ఆశయాలకు అతీతుడు. సమాజంలో అధికసంఖ్యాకుల మేలుకోరే వ్యవస్థ ఏర్పాటుకు పాఠకుల్లో అవగాహన కల్పించడానికి చేతనైనవాడి చేతిలో సాహిత్యం ఒక ఆయుధంగా ఉపకరిస్తుందని మాత్రమే భావిస్తానని సుస్పష్టంగా చెబుతారు. ఆయన 80కిపైగా కథలు రాశారు. పోయినవి పోగా, మిగిలిన ఆయన కథలు మూడు సంపుటాలుగా వెలువడ్డాయి. కవిత్వం మినహా అన్ని సాహితీ ప్రక్రియల్లోనూ ఆరితేరిన వెంకట్రామయ్య కథా రచయితగానే ఎక్కువ పేరు తెచ్చుకున్నారు. ఆయన రాసినవన్నీ నిర్భాగ్యుల కథలే. ఎన్నటికీ తీరని సామాన్యుల బతుకు కష్టాలే ఈ కథలన్నీ. కథనంలో ఎన్నో ప్రయోగాలు చేశారాయన. ఈ సంపుటిలో నలభై కథలూ దాదాపు ఇరవై, పాతికేళ్ళనాటివే అయినా ఆ కథా వస్తువులు మాత్రం పాతబడలేదు. మచ్చుకు ఇందులోని మొదటి కథ 'మల్లీశ్వరి'. మహాపతివ్రత. కాలేజీ రోజులనుండీ మహా చలాకీ. ఏరికోరి చేసుకున్న భర్తను కీలుబొమ్మను చేసి పక్కకు నెట్టిన పతివ్రతాశిరోమణి. మహాదైవభక్తురాలు. ఆమె పూజగదిలో ఎన్నో మహిమలు జరిగేవి. అనతికాలంలోనే అవి ఊరంతా ప్రచారమై ఆమె మాతాశ్రీగా, మహిమాన్వితురాలుగా గణుతికెక్కింది. మంత్రులు, నగర ప్రముఖుల సేవలో ఆమె, ఆమె భక్తబృందం తరించేది. కొందరు గిట్టనివారు ఆమెను కాల్‌గర్ల్ రాకెట్ నడిపే నాయకురాలుగా అభివర్ణించారు. నిందలు భరించలేక తర్వాత ఆమె ఆ అవతారం చాలించింది!! అద్భుతమైన కథనంతో వాక్యాలవెంట పాఠకుల్ని పరుగులు తీయిస్తుంది ఆయన శైలి.

ఇక ఆకాశవాణితో ఆయనకు విడదీయరాని అనుబంధం. ఎంతో మంది రేడియో ప్రముఖులను సన్నిహితంగా చూశారాయన. అనౌన్సర్, న్యూస్ జర్నలిస్టు, న్యూస్ రీడర్, వ్యాఖ్యాత, నాటక రచయిత, నటుడు, నాటక ప్రయోక్తగా ఎంతో అనుభవం గడించారు.

ఆకాశవాణిలో ఆయన అపూర్వ అనుభవాలు, వ్యవస్థాపరమైన లోటుపాట్లు, విధినిర్వహణలో ఎదురైన కష్టనష్టాలు, దుష్టసంప్రదాయాలు, ఎదురైన దుస్సంఘటనలు కూడా 'ఆకాశవాణిలో నా అనుభవాలు' పుస్తకంలో ఉటంకించారు వెంకట్రామయ్య. మూడున్నర దశాబ్దాలు రేడియో జర్నలిస్టుగా పరిశ్రమించారు. ఎందరో క్యాజువల్ న్యూస్ రీడర్లకు శిక్షణ ఇస్తూ రేడియో జర్నలిజానికి ఒరవడి దిద్దారు. వీరిలో నూటికి ముప్పాతికమంది ఆయన దగ్గర శిక్షణ పొందిన వారే. న్యూస్ డివిజన్‌లో బల్లలు తుడవడంతప్ప అన్ని పనులూ చేశాను అని రాసుకునేంతగా ఆకాశవాణితో ఆయనకున్న గాఢానుబంధం మనకు రేడియో చరిత్రను రేఖామాత్రంగా కళ్ళకు కడుతుంది.

**గౌతమీపుత్ర శాతకర్ణి**

ఈమని శివనాగిరెడ్డి

**ధర:** 99 రూపాయలు

**పేజీలు:** 76

**ప్రతులకు:** యస్.ఆర్.బుక్‌లింక్స్, మాచవరం, విజయవాడ-4, శ్రీరాఘవేంద్ర పబ్లిషర్స్, మెయిన్ బజారు, విజయవాడ-01 ఫోన్ 0866-2421052

అశోకుని తర్వాత తెలుగు నేలను ఏకచత్రాధిపత్యంలోకి తెచ్చుకున్నవారు శాతవాహనులు. రెండువేల సంవత్సరాల నాటి చక్రవర్తి శాతకర్ణి. ఈ పుస్తక రచయిత శివనాగిరెడ్డి ఎన్నో నాణేలు, శాసనాలు పరిశోధించి రాసిన గ్రంథమిది.





**నీలిమాలినవాళ్ళ నీతి కథలు**

మోహనరావు దురికి

**ధర:** 100 రూపాయలు,

**పేజీలు:** 176

**ప్రతులకు:** సాహితీ ప్రచురణలు, చంద్రం బిల్డింగ్స్, సి.ఆర్. రోడ్, చుట్టుగుంట, విజయవాడ-4 ఫోన్: 0866-2436642

వరల్డ్ రికార్డు సృష్టించిన 'ది ఎక్సరేమెన్' ఆంగ్ల నవలా రచయిత మోహనరావు. దాదాపు 300 హాస్య, వ్యంగ్య కథలు రాశారు. సమాజం వావివరసలు తప్పుతోందనీ, వికృతపోకడలతో అవినీతికే పెద్దపీట వేసిందనే ఆవేదన ఈ తాజా సంకలనంలోని కథల్లో కనిపిస్తుంది. రొటీన్‌కు భిన్నంగా ఉండే ఈ 29 కథలు చదివితే ఎలాంటి తప్పులు చెయ్యకూడదో మనకు తెలుస్తుంది.

—లలితా త్రిపురసుందరి

## రోదసీలో సెక్స్

భూ వాతావరణం మానవ నివాసయోగ్యం కాకుండా పోతోంది. ఇక 200 సంవత్సరాల్లో ఈ గ్రహాన్ని వదిలి మరో గ్రహం వెతుక్కోవాలన్న హెచ్చరికల నేపథ్యంలో రోదసీలో సెక్స్ ప్రయోగాలు, అధ్యయనం తక్షణ కర్తవ్యాల్లో ఒకటిగా శాస్త్రవేత్తలు గుర్తించారు.

అంతరిక్షంలో సెక్స్‌వల్ల అక్కడ జన్మించే కొత్త తరం చాలా భిన్నంగా ఉంటుందని వారు అంచనా వేస్తున్నారు. చంద్రుడు లేదా అంగారక గ్రహం (కుజగ్రహం) మీద 2027 నాటికి దీర్ఘకాలిక ఆవాసాలు ఏర్పాటు చేసుకోవాలనే స్పేస్ ఏజెన్సీల సన్నాహాల నేపథ్యంలో సెక్స్ అధ్యయనంపై శాస్త్రవేత్తల ప్యానల్ డిస్కషన్ జరిగింది. జార్జి వాషింగ్టన్ యూనివర్సిటీ ఎమర్జెన్సీ మెడిసిన్ డిపార్ట్‌మెంట్ అసిస్టెంట్ ప్రొఫెసర్ Kris Lehnhardt మాట్లాడుతూ, బయాలజీ, న్యూట్రిషన్‌లపై హ్యూమన్ స్పేస్ ఫ్లయిట్ ఎలాంటి ప్రభావం చూపిస్తుందనే విషయాలపై ఇప్పటికీ మనం ఇంకా ఎంతో తెలుసుకోవాల్సిన అవసరం ఉందన్నారు. భారరహిత స్థితిలో శరీర బరువును, కాల్షియమ్‌ను కోల్పోతారని, ఫ్లూయిడ్స్ పునఃపంపిణీవల్ల అవన్నీ శరీర పైభాగంలోకి జేరతాయని ఈ ప్రభావాలపై అధ్యయనం చేయాలని అన్నారు. మైక్రో గ్రావిటీవల్ల కింది అవయవాలకు తక్కువ రక్త ప్రసరణ, ముఖభాగం ఉబ్బిపోవడం, నైట్రోజన్ కొరతవల్ల కండరకణాలు దెబ్బతిని మనిషి ఎత్తు-బరువులకు సంబంధించిన body mass నిష్పత్తి క్షీణించిపోయే పరిస్థితుల్లో రోదసీలో పుట్టే బిడ్డ మైక్రోగ్రావిటీ (భారరహితం)లో ఉంటుందో లేక అక్కడి పరిస్థితుల్ని తట్టుకునే శరీరమే ఉద్భవిస్తుందో చెప్పలేమని Kris Lehnhardt చెప్పారు. అక్కడ పుట్టే బిడ్డ మనలాగా ఎముకల్ని అభివృద్ధి చేసుకోగలదా? లేచి నిలబడగలదా? తిరిగి భూమ్మీదకు రాగలదా? వంటి ప్రశ్నలకు సమాధానాలు లేవన్నారు. అసలు మౌలికంగా అక్కడికి వెళ్ళే సాహసం చేసేవాళ్ళెవరు? తట్టుకుని జీవించగలరా? అనే ప్రశ్నలు మనముందున్నాయన్నారు.



అయితే ఎలుకల స్పెర్మ్‌ను గడ్డకట్టించి తొమ్మిది నెలలపాటు అంతర్జాతీయ అంతరిక్ష కేంద్రంలో ఉంచి ఆరోగ్యకరమైన పిల్లలు పుట్టేలా చేసినట్టు జపాన్ పరిశోధకులు చెప్పారు. కాగా 80 రోజుల ప్రయాణంతో కుజగ్రహంమీదకువెళ్ళి అక్కడ కాలనీలు నిర్మించుకునే డ్రీమ్ ప్రాజెక్ట్ "గ్రహాలమధ్య రవాణావ్యవస్థ" (ఇంటర్ ప్లానిటరీ ట్రాన్స్‌పోర్ట్ సిస్టమ్)ను గత ఏడాది Elon Musk ఆవిష్కరించారు. 56 అడుగుల చుట్టుకొలత, 400 అడుగుల ఎత్తు గల 49 ఇంజన్ల స్పేస్ షటిల్ ఇది. అయితే ఇందులో వెళ్ళాలనుకున్నవారు మరణానికి సిద్ధంగా ఉండాలని ఆయన పేర్కొన్నారు.




**మళ్ళీ నా శరీరంలో ఏదో మార్పు కనబడటం మొదలైంది. నెలతప్పాను.**

**అయితే ఇది మామూలే అనుకుంటే చక్కగా, హాయిగా ఆడుకుంటున్న పసిది మిన్నీ ఉన్నట్టుండి ఒకరోజు విపరీతమైన జ్వరంతో తెలివి లేకుండా మంచానికి అడ్డం పడి ఏడవడం మొదలు పెట్టింది. ఇరుగు లేదు. పొరుగు లేదు. మాట సాయం అసలే లేదు. ఏం చేయాలో నా చిన్న బుర్రకు అస్సలు తట్టలేదు. అలాగే ఒడిలో వేసుకుని, తడిగుడ్డ నుదుటి మీద వేస్తూ, ఆకలితో అల్లల్లాడిపోతే పాలు పడుతూ కూచున్నాను. అదృష్టవశాత్తు అవి వారాంతపు రోజులు... అబ్రహం ఏ క్షణాన్నయినా రావచ్చు. గుండెల్లో ఏదో మూల చిన్న ఆశ.**

మిన్నీ చంక దిగట్లేదు. ఒకటే ఏడుపు.

నాకూ ఏడుపు ఆగడం లేదు. తల్లిగా నేను ధైర్యం చిక్కబట్టుకోకపోతే ఎలా? కొద్దికొద్దిగా మొండి ధైర్యాన్ని తెచ్చుకుంటూ నా మిన్నీని ఓదార్చుతూ ఆ రాత్రంతా గడిపాను. ఆ రాత్రి రావలసిన అబ్రహం ఉదయాన్నే వచ్చాడు. పరిస్థితి అంతా చూశాడు. పిల్ల నీరసంతో నీలంగా మారిపోయిందని గమనించి డాక్టర్‌ని ఇక్కడికి రప్పిస్తానని బయలుదేరి వెళ్లిపోయాడు. ఇక్కడ రోగమొస్తే ఇంతే గతి అని ఇప్పుడే తెలుస్తోంది. డాక్టర్ కోసమన్నా, మందు కోసమన్నా ముప్పయి మైళ్లలో ఉన్న టౌన్‌కి పోవాలి. ఆ చుట్టు పక్కల అదొక్కటే పెద్ద ఊరు. ఆ డాక్టర్ కాళ్ల మీద పడ్డాడో, మరేం చేశాడో గానీ అబ్రహం సాయంకాలానికల్లా డాక్టర్‌ని తీసుకొచ్చాడు.

అతడు నా చిట్టితల్లిని అంతా పరిశీలించి ఏవేవో కొన్ని మందులు రాసి, కొన్ని అతని సంచిలోంచి తీసి ఇచ్చాడు. ఆ డాక్టరుగారి బిల్లు చూస్తే అబ్రహం సంగతి తెలియదు గానీ నేను హడలిపోయాను.

75 డాలర్ల బిల్లు!

రానూపోనూ మైలుకి ఒక డాలర్ చొప్పున ఈ ముప్పయి మైళ్లకు మరో ముప్పయి డాలర్లు దానికి కలిపాడు. అబ్రహం అంతా ఆయనకు చెల్లించాడు. అయితే ఇలా చేసినా నా చిన్నారి బతుకుతుందన్న ఆశ సడలిపోతోంది క్షణం క్షణం. ఎక్కడో ప్రాణం ఆడుతోంది. అబ్రహం నా కన్నీరు చూసి నాకు ధైర్యం చెబుతున్నాడు గానీ తనకూ నమ్మకం లేదనిపిస్తోంది. ఇదంతా చూసి నాలో అనుమానం పిచ్చి లేచిపోయింది. పిశాచాలు నా బుర్రలో ప్రవేశించాయి.

తన చిట్టి చేతుల్తో నాకవీ ఇవీ అందిస్తూ చిన్న చిన్న కబుర్లు చెబుతున్న నా చిన్నారి కొన్ని గంటల్లోనే ఇలా అయిపోవాలా? నిజంగా చనిపోతుందా? ఎక్కడో చూశాను. చనిపోయిన వారిని తెల్లగుడ్డల్లో చుట్టి (టచీ చిమ్) అందరూ దుఃఖంలో ఉంటే చాలా దూరం తీసుకెళ్లి ఖననం చెయ్యడం. ఇప్పుడు నా చిన్న తల్లిని అలాగే తెల్లగుడ్డలో చుట్టాలా? చుట్టి ఖననం చేస్తారా? నేను దుఃఖంతో తట్టుగోలనా? ఈ గడ్డిమైదానాల్లో అలా ఖననం చేయబడ్డ శవాలను ఎంత లోతుగా పాతినా సరే! ఇక్కడ తిరిగే తోడేళ్లు ఆ శవాలను బయటకు తవ్వి తీసి తింటాయట. ఇక్కడందరూ వాటిని 'బచ్చేర్స్' అని అంటారే!

ఇప్పుడు నా చిన్నారి మిన్నీని అలాగే చేస్తాయా? నాకు దుఃఖం ఆగడం లేదు. అబ్రహంను పట్టుకొని ఆ రోజంతా ఏడ్చాను. అబ్రహం నా కన్నీరు తుడుస్తూ 'అలా జరగదు. బతుకుతుంది' అని ధైర్యం చెబుతున్నా నాకు పట్టిన పిచ్చి తగ్గలేదు.

నాకు ధైర్యం చెబుతూనే నా బిడ్డకు అన్ని సేవలూ కళ్లల్లో ఒత్తులేసుకుని చేశాడు. ఆమెలో కొంచెం కొంచెం కదలికలు మొదలయ్యాయి. కనురెప్పలు ఎత్తి చూస్తోంది. జ్వరం తగ్గిపోయింది. నా ఒడిలో చేరబడింది. ఇక నాకు ధైర్యం వచ్చింది. అబ్రహం పనిలోకి వెళ్లకుండా ఓ వారం రోజులు ఇంటి దగ్గరే ఉండిపోయాడు. ఇంకా అదృష్టమేమంటే ఈ వారం రోజులూ చక్కటి ఎండ కాసింది. ఆ ఎండలో వేడిమి ఉంది. మిన్నీ త్వరగానే కోలుకుంది.

ఇక్కడ ఈ గడ్డిమైదానాల్లో ఏమిటో గానీ చక్కటి వేసవి రోజుల కన్నా చలికాలమే ఎక్కువ ఉంటుంది. ఇంకా చలి సరిగ్గా తగ్గనే లేదు.

మా అత్తగారికి ఒంట్లో ఏమాత్రం బాగోలేదట. మామగారు మామూలే! అబ్రహం వారిని మా ఇంటికి తీసుకొచ్చాడు. వచ్చిన దగ్గర్నుండీ మా అత్తగారు గది మధ్యలోనున్న చెక్క మంచం దిగలేదు. ఒళ్లునొప్పులూ, జ్వరం, వీటికి తోడు విపరీతమైన దగ్గు. చలికీ, మంచుకీ తలుపులు తెరవని ఇంట్లో ఉండాలి. నేను గర్భవతిని. నెలలు పూర్తిగా నిండకపోయినా మా అత్తగారు ఇంట్లోనే ఉంటుంది కాబట్టి నాకు చాలా సహాయంగా ఉంటుందని అనుకున్నాను. అయితే ఈమె పరిస్థితి చూస్తే ఇలా ఉంది. ఎప్పటికి తేరుకుంటుందో ఏమో!

ఆరోజు అబ్రహం ఇంట్లోనే ఉన్నాడు. మా మిన్నీ దగ్గడం మొదలుపెట్టింది. మొన్న మొన్ననే కదా! అనారోగ్యం పాలయి ఆరోగ్యాన్ని కూడగట్టుకుంటోంది. అబ్రహం ఏమాలోచించాడో ఏమో... మా అత్తగార్ని మా బావగారింటికి తీసుకుపోయాడు, దగ్గు తగ్గిన తరువాత తీసుకువస్తానంటూ. అది డెవిల్‌లేక్ ప్రాంతం. ఆ ప్రాంతంలో ఆమెకు పరిచయస్థులు చాలామంది ఉన్నారు. మందుల విషయంలో ఆమెకు సాయం చెయ్యకపోరు.

అబ్రహం ఇంట్లో ఉన్న గుర్రాలలో నాలుగు చక్రాలుండే (వేగన్) బండిని మధ్య మధ్య అద్దెకు

### జరిగిన కథ

*రాచెల్ కలోఫ్ ఉక్రెయిన్‌లో పుట్టి పెరిగింది. తరువాత అమెరికా చేరింది. ఆమె రాసుకున్న ఆత్మకథే ప్రయాణం. రాచెల్ చిన్నతనంలోనే తల్లి మరణించటంతో తండ్రి తన నలుగురు పిల్లలని బంధువుల పంచనచేర్చి, అమెరికా వెళ్ళిపోతాడు. అమెరికాలో ఉంటున్న అబ్రహం రాచెల్‌ను అమెరికా రప్పించి, ఆమెను పెళ్ళి చేసుకుంటాడు. మిన్నీని ప్రసవిస్తుంది రాచెల్. భర్త, అత్తగారు వెళ్ళిపోవడంతో రకరకాల భయాలతో ఒంటరిగా పసిదాన్ని పెట్టుకుని గడుపుతుంటుంది. ఆమె పరిస్థితి గమనించి అబ్రహం తన మేనకోడలు దోబాను ఆమెకు తోడుగా ఇంటికి తీసుకొస్తాడు. దోబా చెప్పిన మాటలతో రాచెల్ భయాలన్నీ పటాపంచలైపోతాయి.*

*ఆ తర్వాత....*

తెస్తూ మా ఇంటి సొంత పనులతో పాటు అద్దెకు తిప్పుతున్నాడు. ఆ గుర్రాలు కొంచెం ముసలి గుర్రాలట. అందులో ఒకదానికి చెముడు.

ఇక ఆ సంవత్సరం పడినంత మంచు మరె ప్పుడూ పడలేదు. ఆ గడ్డిమైదానాల్లో మంచు తెల్లని పిండి పోసినట్లయ్యింది. ఇలాంటి మంచు చలి వేళల్లో చాలా మంది రక్తప్రసరణ జరగక అంటే సరైన ఉన్ని దుస్తులు ధరించక ఆరుబయట మొండిగా పనులు చేస్తే ఎలా ఉన్న మనుషులు అలానే క్షణాల్లో రక్తం గడ్డకట్టి నేలన పడి చనిపో తారు. అబ్రహాంకు చిన్న చిన్న పనులు ఇప్పుడు దొరుకుతున్నాయి. నాలుగు డబ్బులు వస్తున్నం దుకు ఆశపడి అతను ఆ మంచులో, చలిగాలిలో తనకీ, ఆ గుర్రాలకీ సరైన తిండి లేక నానా తిప్పలూ పడుతున్నాడు.

అబ్రహాంకు ఏదన్నా జరిగితే...

అందులో ఏ గుర్రం చనిపోయినా అంతే! నేను అడిగితే 'ఫరవాలేదు' అంటాడు. అదీ నిజమే! ఇంట్లో ఏ మాత్రం సరుకులు లేవు. త్వర లోనే నాకు డెలివరీ అయ్యే పరిస్థితి ఉంది. ఆ వేగన్ బండిలో ఏదన్నా బాడుగ ఎక్కించుకుని టౌన్‌కి తీసుకుపోతే ఆ ముప్పయి మైళ్లకూ ఒక డాలర్ ఐదు సెంట్లు ఇస్తారు. దాంతో రెండు గేల న్ల కిరసనా యిలు, ఒక పౌను పంచదార, ఒక పౌను కాఫీపొడి, రెండు పెట్టెల అగ్గి పుల్లలు వస్తాయి. ఇందులోనే మా అత్తగారు, మరిది, ఏ పనీ చేయని బావగారి కుటుంబమూ తినాలి. నా భర్త మొండి మనిషి అనుకోవాలో, కుటుంబం కోసం ప్రాణాలకు తెగి స్తున్నాడని అనుకోవాలో తెలియదు. అతను క్షేమంగా ఇంటికి చేరుకోవాలని ప్రార్థించడం తప్ప నేను చేసేదేముంది?

నా ప్రార్థనలు ఆ దేవదేవుడు విన్నట్లుంది. ఆ నాలుగవరోజునే అబ్రహం తన బండిలో మా అత్త గార్ని తీసుకొచ్చాడు. ఆమె ఆరోగ్యం కుదుట పడింది. బండి దిగి లోపలకి వచ్చింది. ఇంకా ఆమె ముఖంలో నీరసం కనిపిస్తోంది. నేను సంతోషంగా వెళ్లి అబ్రహం చేతుల్ని నుదుటకు చేర్చుకున్నాను.

మరో నాలుగు రోజులు గడిచాయి.

ఆరోజు గురువారం. ఉదయం ఎనిమిది గంట లయినట్టుంది. ఎండుగడ్డి పరిచి పైన కంబళి కప్పిన చెక్కబల్ల మీద నా రెండవ కూతురు హన్నాను కన్నాను. దాని బొడ్డుతాడు కత్తిరింపులో మటుకు ఈ మాటు అబ్రహం తన తల్లి మాట వినక, అతని మేనకోడలు దోబా మాట విన్నాడు. నాకు సుఖప్రసవమయ్యింది. మా అత్తగారు నాకు చేదోడు వాదోడుగానే ఉంది. అయితే నేనే చూసు కోలేదు. మా అత్తగారూ గమనించలేదు.

నా పక్క పక్కనే తన చిన్న పాదాలతో బుల్లి బుల్లి అడుగులు వేస్తూ ముద్దు ముద్దు కబుర్లు చెబుతున్న నా పెద్ద కూతురు మిన్నీ నాకోసం మా అత్తగారు వెలిగించి ఉంచిన వేడి స్టవ్ మీద పడింది. నా భుజాన్ని పట్టుకోబోయిందో ఏమిటో...

పెద్దపెట్టున కేక పెట్టింది. వీపు భాగం ఎర్రగా కాలిపోయింది. చటుక్కున దగ్గరకు తీసుకున్నాను. ఆ బాధకు ఒకటే ఏడుపు. దానికి మందు ఏమి



వెయ్యాలో తెలియదు. ఇంట్లో అసలు ఏమన్నా మందులు ఉంటే కదా! గొడ్ల దగ్గర శుభ్రం చేస్తున్న మా అత్తగారు పరుగున వచ్చింది. అంతా చూసి, వంట ఇంట్లోకి పోయి పై బల్ల మీద మూతపెట్టి ఉంచిన వెన్న గిన్నె తెచ్చింది. అందులో కొంచెం వెన్న ఉంది. దానిని వేలుతో తీసి మిన్నీ కాలిన వీపు భాగంలో రాసింది. అది బాగానే పనిచేసింది కాబోలు సాయంకాలానికి ఏడుపు మాని ఆడు కుంటోంది. నేను మరికొంత వెన్నను రాశాను. ఆ రాత్రి ఆమె ముఖం కొంచెం ప్రశాంతంగా ఉంది. ఈ చిట్కా వైద్యం గుర్తు పెట్టుకున్నాను. మా అత్త గారే ఆరోజు అక్కడ లేకపోతే ఏం చేసేదాన్నో?

ఇంటి అవసరాలకు ఇన్నాళ్లుగా పాలిస్తున్న ఒక్క ఆవూ చూలులో ఉంది. ఇంట్లో గుక్కెడు ఆవు పాలన్నా లేవు. ఎద్దు మాంసం మేం ఆహారంగా ఉపయోగించడం అలవాటే. మా మామగారికి ఒక సారి మాంసం తినాలని అనిపించింది కాబోలు అబ్రహాంకు గుర్తు చేస్తూ, "టౌను నుంచి వచ్చేట ప్పుడు తెచ్చిపెట్టమని" చెబుతూంటే మా అత్తగారు మధ్యలోనే వారించింది. "అలా అమ్మేవారెప్పుడూ పవిత్రతను (కష్రట్) పాటించరనీ, దానివలన రోగాలు వంటి అపవిత్రత (ఘచ్చాన్ ఆర్ఫ్)లు వస్తాయని" ఆమె కొట్టిపారేసింది. కొడుకుతో అలాంటివి తేవద్దని గట్టిగా చెప్పింది. ఇదంతా నాకు గుర్తొచ్చింది. నేనేం మాట్లాడలేదు.

ఇక పాలూ లేవు, మాంసమూ లేదు.

ఈ సంవత్సరం చేతిలో గుర్రాలున్నాయి కాబట్టి మా పొలంలో అబ్రహం ఒక్కడే కొంచెం మడి చెక్క దున్నాడు. రెండు బస్తాల గోధుమలు అయితే, రెండు బస్తాల బార్లీ గింజలు పండాయి. విత్తనాలు కావలసి వస్తే కొనుక్కోవచ్చు, వీటిని ఇంటి అవసరాలకు ఉపయోగించమన్నాడు.

నేను ఈ రోజు బార్లీ గింజల మూట విప్పాను. కాస్త ఎర్రగా వేయించి, నీటిలో మరిగించాను. రవ్వంత ఉప్పు చేరిస్తే గొప్ప రుచిగా ఉంది. ఆ రుచి మా అత్తగారికీ, మామగారికీ నచ్చింది. ఆ రాత్రి అందరం గోధుమ అన్నంతో పాటు ఈ బార్లీ కాఫీ తాగాం. మిన్నీ వీపు భాగంలో కాలిన గాయం మానుడు పడుతోంది. అయితే ఈ మధ్య మిన్నీ సరిగ్గా తినడం లేదు. బార్లీ కాఫీ నచ్చింది కాబోలు,

అదే మూడుపూటలా తాగి హాయిగా నిద్రపోతోంది. మరో రెండు రోజుల తరువాత అబ్రహం వచ్చాడు. అతని చేతుల్లో బరువుల్ని చూసి హమ్మయ్య అనిపించింది. ఆ సమయంలో ఆ పరిస్థితి అలాంటిది. ఇంట్లోనూ తిండి లేదు. బయటా దొరకదు. పెన్నీ అప్పు కోసం వెళ్లాలంటే పాతిక మైళ్లు పోవాలి. రెండు బక్కెట్ల నిండా బొగ్గులు, ఇరవై ఐదు సెంట్లు ఖరీదు చేసే పంచదార, పౌను కాఫీపొడి, ఎండిన పండ్ల ముక్కలు, అలాంటిదే ఎండిన పంది మాంసపు తొడ ముక్కలు (యూదు మత పద్ధతిలో పవిత్ర దినాల్లో పంది మాంసం తినడం నిషేధం. పందిది వేడి నెత్తురు జాతి అంటారు. అయితే మామూలు దినాల్లో స్వీకరించవచ్చు). అన్నింటికన్నా ముఖ్యంగా మిన్నీ కాలిన గాయానికి రాయడానికి ఆయింట్‌మెంట్ తెచ్చాడు. చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాం. మా అత్తగారు ఓపికగా పదార్థాలు నానబెట్టి సరిపడా ఉప్పు, మిరియాల పొడి చేర్చి రాత్రి భోజనాలకు వంట మొదలు పెట్టింది. బాగా అలసిపోయాడేమో అబ్రహం కూతురు వీపుమీద మందురాస్తూ ఆమెను జోకొడుతూ పెందరాళే నిద్రపోయాడు. మధ్య మధ్య లేచినప్పుడల్లా ఫైర్ ప్లేస్ నిప్పులను కెలుకుతూ కొత్తగా ఎండుగడ్డి వేస్తూ నేను చిన్నది హన్నాతో నిద్రపోయాను. మరుసటి రోజు ఉదయం చూద్దును కదా నా చిన్నారి మిన్నీ గాయం ఇంచుమించు మానిపోయింది.

**మిన్నీ చలిజ్వరంతో బాధపడుతోంది. ఒకటే ఏడుపు. చంక దిగట్లేదు. ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి అలానే మంచం మీద వాలిపోయింది. ఒక్కతే ఉందేమో ఏం చేయాలో తెలియక తానూ ఏడుస్తూ కూర్చుంది రాచెల్. భయపడుతోంది. దగ్గర్లో ఎవరూ లేరు. మొండిధైర్యంతో అబ్రహం కోసం ఎదురుచూస్తూ కూర్చుంది. మరి అబ్రహం వచ్చాడా? పిల్లను హాస్పిటల్‌కు తీసుకెళ్ళాడా?**

రోజులు గడుస్తూనే ఉన్నాయి.

అబ్రహం తన అన్నగారు ఛార్లీకి ఏం చెప్పాడో తెలియదు. ఎలా ఒప్పించాడో అంతకన్నా తెలియదు. ఇక్కడ శాలలో ఉన్న గుర్రాలనూ, బండినీ తీసుకెళ్లి అప్పుడప్పుడు అతను కూడా అక్కడక్కడ రైతులు పండించిన పంటను టౌన్ మార్కెట్‌కు తీసుకెళ్లడం చేస్తున్నాడు. దానివల్ల ఆయనకూ కొద్దిపాటి మొత్తం వస్తోంది. అంటే ఆయనకూ బాధ్యత తెలుస్తోంది.

అబ్రహం ఏదన్నా సంపాదిస్తే అది తిన్నగా మా ఇంటికే వస్తోంది. అయితే ఈ సంవత్సరం ఫరవాలేదు... ఇక పూర్తిగా వ్యవసాయం మీదే దృష్టి పెడదామనుకున్న రోజుల్లో, ఏ క్షణాన్న వాతావరణంలో మార్పు వస్తుందో తెలియదన్నట్లు విపరీతమైన వర్షం కురిసింది. ఎంత వర్షం అంటే, ఇంట్లోకి నీరు వచ్చేసింది. పిల్లలిద్దరూ ఆ వర్షానికీ, చలికీ గోల పెట్టేశారు. నా ఒడిలో పెట్టుకొని చెక్కల అటక ఎక్కించాను. మరో పక్క ఆ ముందురోజే అబ్రహం తెచ్చిన విత్తనాల బస్తాలు నేలమీదే ఉన్నాయి. అయితే నేను అనుకున్నట్టు ఈ వర్షం రావడం మా మంచికే అయ్యింది. రేప్పొద్దున పండిన పంటను దాచుకోవాలంటే ఎత్తయిన గాదెలను కట్టుకొని అందులో నిల్వచేసుకోవాలనీ, ముఖ్యంగా ఆ గాదెలను ఎత్తయిన ప్రాంతంలో నిర్మించాలనీ అబ్రహం నిర్ణయించాడు. నేల మీద కొంచెం పదును తగ్గిందన్నప్పుడు మరో ఇద్దరు పనివాళ్లను పెట్టుకొని ఇనుప నాగలి అద్దెకు తెచ్చి మా వాటాకి వచ్చిన



## అంజలి అడ్డంకులను అధిగమిస్తుందా?

*అంజలి, జై పెళ్ళి విషయంలో చాలా మందికి కలుగుతున్న అనుమానం ఇది. వీరిద్దరి పెళ్ళికి అంజలి కుటుంబం నుంచి అడ్డంకులు రావచ్చన్నది కొందరి సంశయం. ఇప్పటి వరకూ పెళ్ళయితే జరగలేదు కానీ, అంజలి, జై ఇద్దరూ తిరుపతిలో పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నారట! ఇటీవల ఇద్దరూ తమతమ పుట్టినరోజులకు స్పెషల్‌గా గ్రీట్ చేసుకొని ఒకరంటే ఒకరికి ఎంత ప్రేమ ఉందో బాహాటంగా చాటుకున్నారు.*

*దీంతో ఇద్దరి మధ్యా ప్రేమ వ్యవహారం ఉందన్నది స్పష్టంగా తేలిపోయింది అంటున్నారు తమిళతంబీలు. ఇక మిగిలింది పెళ్ళే కనుక ఇద్దరూ తిరుపతిలో పెళ్ళి చేసుకొని టాలీవుడ్, కోలీవుడ్‌లలో రెండుసార్లు రిసెప్షన్ ఏర్పాటు చేసే ఆలోచనలో పడ్డారట! రెండు భాషల సెలబ్రిటీలకు విడివిడిగా పార్టీలివ్వడం ద్వారా రెండు చోట్లా లాభపడాలన్నది ఇద్దరి ఆలోచన అంటున్నారు.*

కొన్ని ఎకరాలలో కొంత ప్రాంతంలో గోధుమ నాటాడు. మరికొంత ప్రాంతంలో బంగాళాదుంపను వేశాడు. నీటి జాడ పుష్కలంగా ఉంది. పంట కూడా బాగా ఎదుగుతోంది. సందట్లో సడేమియా అన్నట్టు ఆవు ఈనింది. మా అత్తగారి సలహాలూ, సూచనలూ తీసుకుంటూనే నేనూ కోడిగుడ్లను పొదిగించాను. నక్కలూ, తోడేళ్ళూ తప్ప ఈ మైదానాల్లో గద్దలు లేవు కాబట్టి అవి, అలా అలా యాభై వరకూ అయిపోయాయి. మరికొన్ని నెలలు కోడి మాంసానికి గానీ, వెన్నకు గానీ, పాలకు గానీ లోటు లేదు. పిల్లలు ఆరోగ్యంగా ఉన్నారు. వాళ్ల నాన్నను చూడగానే చేతుల్లో ఒదిగిపోయి కబుర్లే కబుర్లు. నా పెద్ద కూతురు మిన్నీ అప్పుడే నాకు చేదోడు వాదోడుగా తయారవుతోంది. కోళ్లకు మేత పెట్టడం, డ్రమ్ముల్లోని నీటిని వాటి ముందు డబ్బాల్లో పోయడం చేస్తోంది. మధ్య మధ్య తన చెల్లెల్ని ఆడిస్తోంటే నాకు శ్రమ తగ్గుతోంది. ముందు ముందు ఎలా ఉంటుందో అని చాలా వెన్న దాచాను.

పండిన పంట చేతికొచ్చింది.

మాకు సంవత్సరానికి సరిపడా గింజలను గాదెల్లో పోసి, మిగిలినవి టౌన్‌లో అమ్మేద్దామన్నాడు అబ్రహం. పైన రేకులు పరిచి, లోన చెక్కలు బిగించి, గాలీ, నీరూ ఏ మాత్రం చొరబడని గాదెలు చేయించాడు. దాన్లో ఎంత గింజ పోసినా చెక్కు చెదరవు. కొంత గింజ విత్తనాల కోసం మూటకట్టి, మిగిలినవి అంటే గోధుమ, జొన్న, బార్లీలతో గాదెలు నింపాడు. అయినా కొంత గింజ మిగిలింది. బంగాళాదుంప, గోధుమ బస్తా ముప్ఫయి సెంట్లకు టౌన్ మార్కెట్‌లో అమ్మకానికి వెళ్లింది. కొంత వెన్ననూ, కొన్ని కోడిగుడ్లనూ అమ్మేయమని ఇచ్చాను. వెన్న ఒక పౌండు ఏడు సెంట్లకు అమ్ముడు పోగా, గుడ్లు డజను ఏడు సెంట్లకు అమ్ముడుపోయాయి.

తిండి మాట దేముడెరుగు. బొగ్గు, కర్ర ఈ చలిలో మాకెంతో అవసరం. అబ్రహం టౌను నుండి వస్తూ రెండు బస్తాల బొగ్గులు, పొయ్యిలోకి కొంత కర్ర తెచ్చాడు. అయితే ఈ కర్ర ముక్కలు ఆకుపచ్చగా ఇంకా పూర్తిగా ఎండినట్టుగా కనపడ లేదు. పచ్చికర్ర ముక్కలు. అడిగితే అంతకు మించిన కర్ర మార్కెట్‌లో దొరకలేదన్నాడు అబ్రహం. ఈ నార్త్ డకోటా రాష్ట్రంలో డెవిల్స్ లేక్ అనే దక్షిణ ప్రాంతంలో పెద్ద అడవి ఉంది. ఆ ప్రాంతంలో ఉండేది రెడ్ ఇండియన్స్. వారికి డబ్బు కావాలంటే అడవిలోని చెట్లు నరికి ఇలా ఆరీ ఆరని కర్రను గుర్రాలపై తాళ్లతో కట్టి తెచ్చి టౌన్‌లో అమ్మడం అలవాటే! అబ్రహంకు మార్కెట్‌లో అదే దొరికి ఉంటుంది. ముందుగా ఉపయోగించ వచ్చన్న ఉద్దేశంతో నేను కొంత కర్రను తీసి పొయ్యి వెనుక పేర్చాను.

నా రెండవ బిడ్డ పెంపకం విషయంలో మొదటి బిడ్డ అంత భయపడలేదు. పురుటి మంచం మీద ఓ పక్క మతపరమైన పుస్తకం, బొడ్లో కత్తి పెట్టుకుని తిరిగాను కానీ దోబా చెప్పిన ధైర్యం వల్ల నాకు తోచినట్టు పెంచాను. పాపం మా అత్తగారు ఇదంతా చూసీ చూడనట్టు ఊరుకునేది. చివరకు ఆమె గ్రహించి "అప్పటి పరిస్థితులు వేరమ్మా! అప్పటికీ ఇప్పటికీ పిల్లల పెంపకంలో చాలా తేడా ఉంది" అన్నది.

ఇలాగే మరో సంవత్సరం గడిచిపోయింది.

అబ్రహం బయట పనుల్లో కన్నా ఇంటిపట్టునే ఎక్కువగా ఉండి, పొలం మీదే శ్రద్ధ చూపడం మొదలెట్టాడు. పిల్లలూ తండ్రిని వదలడం లేదు.

తిరిగి నేను గర్భవతినయ్యాను.

అప్పటికి చలికాలం వెళ్లిపోయింది. ఎప్పటిలాగే ఈ చిన్న ఇంటిలో మా అత్తగారూ, మామగారూ, మరిదీ వీళ్లతో మా పిల్లలూ ఉన్నారు. బయట అడుగు పెట్టలేని ఆ పరిస్థితుల్లో ఇల్లు చాలా ఇరుకుగా ఉన్నట్లు అనిపించేది. అయితే మరిది వాళ్ల అన్న గారికి పొలం పనిలో సాయపడడానికి వెళ్లడం, పిల్లలు వాళ్ల తాతగారు, నాయనమ్మ చేతుల్లోకి చేరడం వల్ల నాకూ వెలుసుబాటు కలిగేది.

అబ్రహం నా గర్భాన్ని చూసి ఒకరోజు "మనకీ సారి మగపిల్లవాడే పుడతాడని" హాస్యం ఆడాడు. నాకు నవ్వొచ్చింది అబ్రహం జోస్యానికి. "నాకూ మగ పిల్లాడే పుడతాడని నమ్మకం కలుగుతోంది" అన్నాను ఏదో అనాలని.

అబ్రహం ఇక ఆగలేదు. టౌన్ మార్కెట్ నుంచి వచ్చేటప్పుడు మగపిల్లలు వేసుకునే రెండు చొక్కాలు కొని తెచ్చేశాడు. ముందు ముందు ఇంటికి సున్నాలు వేయడం కుదరదేమోనని ఇంటికి సున్నాలు వేశాను. అబ్రహం మా పెళ్లప్పుడు కొనుక్కున్న పాత షర్ట్ ఒకటి ఉంది. అది తను పెద్దగా వాడడం లేదు గానీ ముదురు ఆకుపచ్చ మీద తెల్ల గీతలతో బాగుంటుంది. న్యూయార్క్‌లో కొనుక్కున్నాడు. దాన్ని జాగ్రత్తగా కత్తిరించి, పుట్టబోయే నా కొడుక్కి చిన్న చొక్కా లాగూ కుట్టాను. తేలిగ్గా ఉండి, వేసుకోవడానికి వీలుగా కొన్ని డైపర్లు సిద్ధం చేశాను.

ఒక శుభముహూర్తాన నా ముద్దుల కొడుకు మాక్ జన్మించాడు. అబ్రహం ఆనందానికి హద్దు లేదు. కొడుకు బారసాల వేడుకలు ఘనంగా చేయదలచుకున్నాడు కాబోలు మా ఆచారం ప్రకారం మగ పిల్లవానికి ఎనిమిది రోజుల తరువాత జరిపే పురుటి స్నానం వేడుకల్లో వాడికి ఆశీర్వాదాలు అందాలని(మొహిల్) పది డాలర్లు కట్టి యూదు మతప్రవక్తను పిలిపించాడు.

ఆయన ఈ డెవిల్స్ లేక్ ప్రాంతంలోనే ఉంటాడట. కానీ తనకు రానూపోనూ ఖర్చులు ఇమ్మన్నా

డట. దానికోసం ఐదు డాలర్లు ఇచ్చాడు. ఇదిగాక అతను సంతోషంగా ఉండాలని మరో ఐదు డాలర్లు బహుమతిగా ఇచ్చాడు. అయితే ఇదంతా ఘనంగా చేయదలచాడు. కానీ ఆ క్షణంలో ఆయన దగ్గర పెన్నీ అన్నా లేదు. పొలం ఖర్చులు అయ్యాయి. నేను ఎందుకు? ఏమిటి? అని ప్రశ్నించలేదు. అతని సరదా అతనిది. ఎవరి దగ్గరో అప్పు చేసినట్టుంది. వచ్చిన మతప్రవక్త ఇచ్చే ఆశీర్వచనాలు, నా బిడ్డ అదృష్ట రేఖల్లో ఫలిస్తాయో లేదో తెలియదు గానీ ఈ అప్పు మాత్రం తొందరగానే పుట్టింది.

అయితే మగపిల్లవాడు పుట్టిన నెలరోజుల్లో జరిపే “కోవెనెన్ట్” అనే చిన్న పండుగలాంటి తంతు ఉంది. మాకు వారసుడు పుట్టాడని చుట్టాలకు, బంధుమిత్రులకు చెప్పుకోవడమే దాని ఉద్దేశం. వచ్చిన అతిథులకు విందు ఏర్పాటు చేయాలి. ఇది మరీ ముఖ్యమైనది. ఇంట్లో నేను దాచిన వెన్న ఉంది. ఆ ముందు రోజున కొంత చీజ్ తెస్తానన్నాడు అబ్రహం. ఇంట్లో ఎలాగూ కోళ్లున్నాయి. చికెన్‌తో విందు భోజనాలు ఏర్పాటు చేద్దామనుకున్నాం. అయితే అబ్రహం వాళ్ల అన్న దగ్గరా, అమ్మ దగ్గరా ఈ మా ప్రపోజల్ చెప్పినట్టున్నాడు. వారు మరో ఆలోచన చెప్పారు. ఇన్నాళ్లకు కొడుకు పుట్టాడు. వట్టి చికెన్‌తో విందు భోజనం ఏం బాగుంటుంది. దగ్గర దగ్గర మూడు సంవత్సరాలయ్యింది గొడ్డు మాంసం తిని. ఇదే మంచి అవకాశం. ఓ ఎద్దునన్నా కోసి విందు చేయవలసిందే.

అయితే ఇందులో మరో తిరకాసు ఉంది. నిజానికి గొడ్డు మాంసం ఎంతమంది అతిథులొచ్చినా కూడా ఎక్కువైపోతుంది. ఒక గొడ్డును కొనాలంటే ఆర్థికంగా ఆలోచించుకోవాలి. మా అత్తగారి, బావగారి ఆలోచన ప్రకారం కొంత మాంసం ఇంట్లో ఉంచుకొని, మిగిలిన దాన్ని టౌన్‌లో అమ్మేయాలి. కొంత డబ్బు కలిసి వస్తుంది. అంటే పవిత్రమైన దాన్ని (కోషర్) మనం ఉంచుకొని, మనకు అవసరం లేని దాన్ని బయట అమ్మితే మూడు సెంట్లకు ఒక పౌండు మాంసం చొప్పున కొంటారట. అబ్రహం అంగీకరించాడు.

ఈ విషయాలన్నీ నా చెవిన వేశాడు. అబ్రహం ఆనందమే నా ఆనందం. అయితే ఈ పండుగ జరిగే ముందూ, ఆ తరువాతా అబ్రహం టౌన్‌కీ, ఇంటికీ చాలా సార్లు తిరగవలసి వస్తుందనుకున్నాను. ఆ పండుగ పేరుతో గొడ్డును చంపాలంటే, మా ఆచారంలో మంచి ఆచారవంతుడైన అధికారపూర్వకము (షెహిటాహ్) కలవాడైన మనిషి ఉండాలి. అతనికి ఆ గొడ్డును ముందు చూపాలి. అతని నిర్ణయమే తుది నిర్ణయం.

ఆ గొడ్డు పవిత్రమైన మాంసం (కోషర్) గురించి పవిత్రుడికే (షెహిటాహ్) తెలుస్తుందని చెప్పుకున్నాం కదా! ఆ జంతువు ఏ జబ్బూ లేనిదీ ఇంతకుముందు ఏ దెబ్బలూ తగలనిదీ, అంగవైకల్యం కానిదీ అవునో కాదో ముందు తెలుసుకోవాలి. ఇలాంటివన్నీ షెహిటాహ్ గమనిస్తాడు.

చక్కగా ఆరోగ్యంగా ఉన్న గొడ్డును 'ట్రాయిఫ్' అంటారు. అతడు దాన్ని బాగా పరిశీలించి కొవ్వు పట్టని బొడ్డు నరం పక్కకు తప్పించి లేక దాన్ని వేరుచేసి పవిత్రమైన మాంసాన్ని బయటకు తీస్తాడు.

అయితే అబ్రహం ఓ నాలుగురోజులు అదే పనిగా తిరిగి మంచి షెహిటాహ్‌నే పట్టుకున్నాడు చివరకు. ఇతడు మంచి ఎద్దునే ఎంచి, పవిత్రమైన మాంసాన్నే మాకు ఇవ్వగలిగాడు. అన్ని విధాలా అనుకూలమైన గొడ్డు ట్రాయిఫ్ మా ఇంటికి తోలుకుని తీసుకొచ్చారు. తెల్లారింది. ఇక ఆరోజే ఈ కార్యక్రమం జరగాలి. ఇంటిపనంతా నేను ఒక్కదాన్నే చేసుకోవాలేమో, పిల్లలతో నాకు నీరసం వచ్చింది. బావగారు ఛార్లెస్, వారి పిల్లలూ, మా అత్తగారూ, మామగారూ కొంచెం పొద్దెక్కాక దిగారు.

నాకు అప్పటికే అలసటగా ఉంది.

**(ఇంకా వుంది)**

## మనమీదేసర్రోయ్!

సరసి








జూన్ 28 నుంచి
జూలై 4 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో బదిలీలు, ఇల్లు మార్పునకు అనుకూలం. విందు వినోదాల్లో పాల్గొంటారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తిచేస్తారు. పరిశ్రమలు, హోటల్స్, రియల్ ఎస్టేట్ రంగాల వారికి శుభప్రదం. 1, 2 తేదీల్లో వేడుకల్లో శ్రమాధిక్యం, ఖర్చులు అధికం. భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 3, 4 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో మీ వైఖరిని సమీక్షించుకుంటారు.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

విద్య, పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలకు ఈ వారం ప్రాధాన్యత ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. పొదుపు పథకాలు లాభిస్తాయి. విద్యాసంస్థలు, చిట్‌ఫండ్ రంగాలవారికి శుభప్రదం. 1, 2 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో పాల్గొంటారు. 3, 4 తేదీల్లో సమావేశాలు, వేడుకల్లో పాల్గొంటారు. ప్రియతములతో చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో నిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. కుటుంబ సభ్యుల సహకారంతో ఆర్థిక విషయాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 1, 2 తేదీల్లో ఆర్థికవ్యవహారాల్లో ఆచితూచి ముందడుగు వేయాలి. ఖర్చులు అధికం. చిన్నారులు ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 3, 4 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. వైద్యం, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం.

## కర్కాటకం (జూన్ 22 - జూలై 22 మధ్య పుట్టినవారు)



బదిలీలు, ప్రేమానుబంధాలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. 1, 2 తేదీల్లో కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. బదిలీ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. గృహనిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు. 3, 4 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. చిన్నారులు, ప్రియతముల విషయాలపై శ్రద్ధ చూపిస్తారు.

## సింహం (జూలై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)



వేడుకలు, విద్యావిషయాలు, సమావేశాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో సినీ, రాజకీయ రంగాలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. 1, 2 తేదీల్లో ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ప్రయాణాలకు అనుకూలం. 3, 4 తేదీల్లో వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. ఇంటికి అవసరమైన వస్తువులు కొనుగోలు చేస్తారు. బదిలీలకు అనుకూలం.

## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)



పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలు, బదిలీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. వేడుకల్లో పాల్గొంటారు. స్నేహానుబంధాలు విస్తరిస్తాయి. సమావేశాలు, బృందకార్యక్రమాల్లో కీలకపాత్ర పోషిస్తారు. 1, 2 తేదీల్లో పెట్టుబడుల్లో నష్టం సంభవం. ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 3, 4 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. చర్చలు, ప్రయాణాలకు అనుకూలం. విద్యా సంస్థలతో పనులు పూర్తవుతాయి.

## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)



వృత్తి, వ్యాపారాలు, ఇంటర్వ్యూలు, ఆర్థిక విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వాయిదా పడుతున్న పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. గౌరవ పదవులు లభిస్తాయి. రాజకీయ, సినీరంగాలవారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. 1, 2 తేదీల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. కొత్తపనుల ప్రారంభానికి తగిన సమయం కాదు. వృత్తి, వ్యాపారాల్లో ఒత్తిడి అధికం. 3, 4 తేదీల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. ఉద్యోగ, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. పెద్దల సహకారంతో ఆర్థిక లక్ష్యాలు సాధిస్తారు.

## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)



విద్య, పెట్టుబడులు, ప్రయాణాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 1, 2 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 3, 4 తేదీల్లో సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం.

## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)



ఆర్థిక వ్యవహారాలు, వేడుకలు, క్రయవిక్రయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆర్థికంగా ప్రోత్సాహకరం. గత అనుభవంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. పెన్షన్, పన్నుల వ్యవహారాలకు అనుకూలం. 1, 2 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతారు. 3, 4 తేదీల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. రాజకీయ, సినీరంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది.

## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)



కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమావేశాలు లాభిస్తాయి. న్యాయ, బోధన, రక్షణరంగాల వారికి ప్రోత్సాహకరం. 1, 2 తేదీల్లో గౌరవ మర్యాదలకు భంగం కలిగే ప్రమాదం ఉంది. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 3, 4 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్నేహానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. .

## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)



ఇంటర్వ్యూలు, సమావేశాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో వైద్యం, పరిశ్రమల రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. గత అనుభవంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 1, 2 తేదీల్లో సంకల్ప సిద్ధి కోసం అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది. వృత్తిపరమైన ప్రయాణాలు ఫలిస్తాయి. 3, 4 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది.

## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)



చిన్నారులు, పొదుపు పథకాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ప్రేమానుబంధాలు బలపడతాయి. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 1, 2 తేదీల్లో ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువులు కోల్పోయే ప్రమాదం ఉంది. 3, 4 తేదీల్లో సాంకేతిక విద్యకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ప్రియతములతో చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. విద్యార్థులకు శుభప్రదం.

నవ్య






## అతిలోక సుందరికి అంత అవసరమా?

గతంలో ఆ హీరోయిన్ అందగత్తే! అతిలోక సుందరి అంటూ అందరూ ఆమెను ఆకాశానికి ఎత్తేసిన వారే! దశాబ్దాలు గడిచాయి. వయస్సు మీద పడింది. వృద్ధాప్య ఛాయలు కనపడ్డం మొదలెట్టాయి. అయినా ఇప్పటికీ నేను అతిలోక సుందరినే అంటూ పోజులిస్తూ ఉంటుందా మాజీ హీరోయిన్. ఇంతకీ ఆ హీరోయిన్ ఎవరో అర్థమయ్యే ఉంటుంది. ఇంకెవరు...అందరి చేతా అతిలోక సుందరి అని పిలిపించుకున్న శ్రీదేవి. ఇప్పటికీ కూతుళ్ళతో కలిసి కుర్ర వేషాలు వేయడం శ్రీదేవికి అలవాటే! ఆ అలవాటుతోనే ఓ మ్యాగజైన్ కవర్ పేజీకి హాట్ హాట్ ఫోజులిచ్చింది శ్రీదేవి. ఇందుకుగానూ దాదాపు ఇరవై మంది మేకప్ ఆర్టిస్టులు గంటల తరబడి కష్టపడి ఆమె వయస్సు కనపడనీయకుండా మేకప్ చేశారట! అంతే కాదు ఫోటోషాప్‌లో కూడా ఆమెను కుర్ర హీరోయిన్‌గా చూపించడానికి కష్టపడ్డారు. ఇంత కష్టం చూసి అందరూ 'శ్రీదేవికి అంత అవసరమా? ఉన్న బిరుదును అలాగే ఉండనీయకుండా చీప్ వేషాలు వేసి పాడుచేసుకుంటోంది' అంటున్నారు. ఈ మాటలు శ్రీదేవి చెవిన పడ్డాయో లేదో కానీ, ఇప్పటికైనా శ్రీదేవి తన వేషాలు కట్టిపెడితే మంచిదని బాలీవుడ్ జనాలు ఆమెకు సలహా ఇస్తున్నారు.

## కాపీ కొట్టానంటున్న సంపత్‌నంది

సాధారణంగా దర్శకులు ఏ కథనైనా కాపీ కొట్టామని చెప్పుకోరు. కానీ సంపత్‌నంది మాత్రం తను ఓ వజ్రాల వ్యాపారి ఆలోచనను కాపీ కొట్టానని చెబుతున్నాడు. గతంలో కోట్లకు పడగలెత్తిన ఓ వజ్రాల వ్యాపారి తన కొడుకుకు జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాలు తెలియాలన్న ఉద్దేశంతో కేరళ పంపి అక్కడి పేదవారితో కలిసి జీవించమంటాడు. ఈ వార్త అందరికీ తెలిసిందే! అప్పట్లో సంచలనంగా మారిన ఈ వార్తను కథాంశంగా తీసుకొని తన స్టయిల్లో 'గౌతమ్‌నంద' సినిమాను గోపీచంద్‌తో తీసినట్టు చెప్పుకొచ్చాడు సంపత్ నంది. ఆలోచన ఒక్కటే వజ్రాల వ్యాపారిదనీ, మిగతా అంతా తనదే అంటున్నాడు ఈ దర్శకుడు.





## బోయపాటికి భారీ ఆఫర్

మాస్ కథల్ని హ్యాండిల్ చేయడంలో బోయపాటి తరువాతే ఎవరైనా అంటూ ఉంటారు. తన మాస్ సినిమాల ద్వారా ఎంతో మందికి మాస్ ఇమేజ్ తెచ్చి పెట్టాడు. అలాంటి వ్యక్తి నాగచైతన్యతో త్వరలోనే ఓ మాస్ సినిమా చేయబోతున్నాడని అంటున్నారు. ఇప్పటి వరకూ మాస్ ఇమేజ్‌కి దూరంగా ఉన్న నాగచైతన్యకి ఇక మాస్‌లో కూడా చెప్పలేనంత పాపులారిటీ రావడం గ్యారెంటీ అనే మాటలు వినపడుతున్నాయి. ఈ సినిమా కోసం బోయపాటికి భారీ రెమ్యునరేషన్ దక్కనుందని సమాచారం.

## వాళ్ళిద్దరినీ పిలవలేదట!

ఫిలింఫేర్ అవార్డుల్లో మెరిసి మురిసిపోవాలని చాలామంది సినీ నటీనటులు తహతహలాడుతుంటారు. ఆ వేడుకలో పాల్గొనడం, తమ సినిమా నామినేట్ కావడం ఓ గౌరవంగా భావించే ఆర్టిస్టులు చాలా మందే ఉన్నారు. అయితే ఓ ఇద్దరు ఆర్టిస్టులు మాత్రం ఈసారి ఫిలింఫేర్ అవార్డుల ఫంక్షన్ మీద తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు. ఆ అవార్డుకి తమ సినిమా నామినేట్ అయినా తమకు ఆహ్వానం అందలేదంటూ వాపోతున్నారు అనసూయ, అడవిశేషు. ఈ ఇద్దరూ నటించిన 'క్షణం' ఫిలింఫేర్ అవార్డులకి నామినేట్ అయింది. కానీ వీరిద్దరికీ మాత్రం ఆహ్వానం అందలేదట! చివరి నిమిషంలో జరిగిన పొరపాటు తెలుసుకుని అడవి శేషుకు ఆర్గనైజర్లు సారీ చెప్పారట కానీ, అనసూయకు అది కూడా లేదట! ఇదే తప్పు మరే భాషవారికి జరిగినా పెద్ద గొడవ చేసేవారని అంటున్నారు టాలీవుడ్ జనాలు.



## జీవితంలో ఆ పని చేయనంటోంది

ఒకప్పటి హీరోయిన్ శోభన త్వరలోనే పెళ్ళిపీటలెక్కబోతోంది అన్న వార్త ఇటీవల బాగా హల్‌చల్ చేసింది. మొదట్లో ఈ వార్తను లైట్‌గానే తీసుకున్న శోభన ఆ తరువాత తీవ్రంగా స్పందించింది. జీవితంలో తనకు పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేదనీ, తన జీవితం నాట్యానికే అంకితం చేశానని చెప్పుకొచ్చింది. తన మీద ఎవరో లేనిపోని వార్తలు పుట్టిస్తున్నారంటూ ఆందోళన వ్యక్తం చేసింది. పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేకనే తానొక ఆడపిల్లను దత్తత తీసుకున్నాననీ, ఆ పిల్ల బాగోగులు తానే చూసుకుంటున్నాననీ చెప్పుకొచ్చింది. జీవితంలో పెళ్ళి మాట ఎత్తకూడదనుకునే ఆ విషయం పూర్తిగా మరచిపోయి ప్రశాంత జీవనం గడుపుతున్నానని కూడా చెప్పుకొచ్చింది.



# తనే లేకపోతే నేను లేను

## -నిక్కీ గల్రాని

**మూడు సంవత్సరాలు.... 25 సినిమాలు.... ఇదీ హీరోయిన్ నిక్కీ గల్రాని ట్రాక్ రికార్డు. అక్క సంజన అందదండలతో వెండితెరకు పరిచయమైన నిక్కీ గల్రాని తక్కువ కాలంలోనే ఎక్కువ పాపులారిటీ సంపాదించుకోగలిగింది. చాలామంది హీరోయిన్లలాగా స్కిన్ షోకీ, గ్లామర్‌కీ మాత్రమే పరిచయం కాకుండా విభిన్న మైన సినిమాలు చేస్తూ ప్రేక్షకుల మనసు దోచుకుంది. నిక్కీ తెలుగులో పెద్దగా సినిమాలు చేయకపోయినా, ఆమె సినిమా అంటే టాలీవుడ్‌లో ఓ క్రేజ్‌ను సృష్టించగలిగింది. తను సినిమాల్లో ఇంత మంచి పేరు తెచ్చుకోవడానికి ఓ వ్యక్తి కారణమనీ, ఆమె లేకపోతే తను లేనంటున్న నిక్కీగల్రానితో..**

**సినిమాల్లోకి రావాలని ఎందుకనిపించింది?**

నిజం చెప్పాలంటే మా అక్క సంజన ఎప్పటి నుంచో ఈ రంగంలో ఉంది. నన్ను డాక్టర్‌ని చేయాలన్నది మా పేరెంట్స్ ఆలోచన. కానీ నా ఆలోచనలు వేరేవిధంగా ఉండేవి. ప్లస్ టూ పూర్తి చేయగానే మోడలింగ్ వైపు అడుగులు వేశాను. చదువుకునే రోజుల నుంచీ మోడలింగ్ అంటే ఇష్టంగా ఉండేది. చివరకి నాకు ఇష్టమైన రంగంలోనే ప్రవేశించాను. నిలదొక్కుకోగలిగాను.

**వారి కోరిక కాదని సినిమాల్లోకి వస్తానంటే మీ పేరెంట్స్ ఏమనలేదా?**

మొదట్లో కొద్దిగా బాధపడ్డారు. కానీ నా అభిరుచి గమనించి మౌనంగా ఉండిపోయారు. ఇప్పుడు అక్కతో సహా అందరూ హ్యాపీ!

**సినిమాల విషయంలో మీ సిస్టర్ హెల్ప్ ఎంత వరకూ ఉంటుంది?**

తక్కువ సమయంలో ఇంత పేరు తెచ్చుకోగలిగానంటే ఓ వ్యక్తి గురించి కచ్చితంగా చెప్పుకోవాలి. ఆ వ్యక్తి ఎవరో కాదు, మా అక్కే. తను లేకపోతే నేను లేను. ప్రారంభంలో నాకు అవకాశాలు రావడానికి తన పరిచయాలు ఎంతగానో హెల్ప్ చేశాయి. లేకపోతే ఇంత కాంపిటీషన్‌లో నాకు అవకాశం రావడం గగనమైపోయేది. ఎవరిని అప్రోచ్ అయితే సరైన అవకాశాలు వస్తాయి? అన్నది తనకు బాగా తెలుసు. తన గైడెన్స్ ప్రకారమే నడుచుకున్నాను.

**ఇప్పటికీ మీ అక్క సలహా తీసుకుంటారా?**

కథలు నేనూ తనూ కలిసి వింటాం. నిర్ణయం మాత్రం నాదే! ఆ విషయంలో తను నాకు ఏమీ చెప్పదు. ఒకవేళ నా డెసిషన్ తప్పు అనిపిస్తే 'మరొకసారి ఆలోచించుకుని చెయ్' అని మాత్రం చెబుతుంది. ఈ మూడు సంవత్సరాలలో ఒక్క సినిమాకు మాత్రమే అలా చెప్పింది. తను అలా అనగానే ఆ సినిమా వదులుకున్నాను. వదులుకున్న సినిమా గురించి ఇప్పుడు మాట్లాడడం నాకు ఇష్టం ఉండదు. ఆ తరువాత ఆ సినిమా రిజల్ట్ చూశాక నేను చేసిన పని మంచిదని అనిపించింది.

**కథల ఎంపిక ఎలా చేసుకుంటారు?**

చెప్పానుగా. కథ డిఫరెంట్‌గా అనిపిస్తేనే ఒప్పుకుంటాను. లేకపోతే లేదు. ఖాళీగా కూర్చోవడానికి అయినా నేను రెడీ. ఇప్పటికే పాతిక సినిమాలు చేశాను. ఇంకా ఇంకా సినిమాలు చేయాలన్న తాపత్రయం లేదు. ఏ పాత్ర అయినా నిక్కీ బాగా చేసింది అని అప్పటికప్పుడు అనడం కాదు. కొన్ని సంవత్సరాల తరువాత కూడా ఆ పాత్ర ద్వారా నన్ను ప్రేక్షకులు గుర్తు పెట్టుకోవాలి.

**మీ అక్క సంజన సినిమాల్లో క్లిక్ కాకపోవడానికి కారణం?**

తనేమీ ఫ్లాప్ హీరోయిన్ కాదు. చాలా సినిమాలు చేసింది. ఆ అంకె నాకు సరిగ్గా గుర్తు లేదు. ఒకే రకమైన పాత్రలు వస్తుండడంతో తనంతట తానే సినిమాలను వదులుకుంది తప్ప దర్శకనిర్మాతలు



తనను వద్దనుకోలేదు. ఇప్పటికీ ప్రతిరోజూ కథ వినమంటూ ఎంతో మంది వచ్చిపోతుంటారు. తనకే ఏ కథలోనూ పూర్తి సంతృప్తి దొరక్క చేయడం లేదు.

**మీ దగ్గరకి వచ్చిన కథ ఏదైనా తనకు నచ్చి చేసిన సందర్భాలు?**

ఇప్పటి వరకూ లేదు. నన్ను దృష్టిలో పెట్టుకుని కథలు చెబుతారు కానీ, ఇద్దరిలో ఎవరో ఒకరు చేస్తారులే అని కథలు చెప్పరు కదా!

**తెలుగులో నేరుగా సినిమాలు చేయక పోవడానికి కారణం?**

'కృష్ణాష్టమి' తరువాత మిగతా భాషలలో బిజీ అయిపోయాను. తెలుగులో నేరుగా సినిమా చేయాలని ఎప్పటికప్పుడు అనుకుంటున్నా సరైన సమయం రాలేదు. త్వరలోనే తెలుగులో ఓ మంచి కథతో మీ ముందుకు వస్తాను. అయినా ఇతర భాషలలో నా సినిమాలన్నీ తెలుగులోకి డబ్ అవుతున్నాయి కనుక తెలుగువారికి ఎప్పుడూ దూరంగా లేను.

**తెలుగు బాగా వచ్చినట్టేనా?**

మాట్లాడడం వరకూ బాగా వచ్చింది. డబ్బింగ్ చెప్పుకోలేను.

**మీతో 'మరకతమణి'లో చేసిన ఆది గురించి....**

తనతో నాది రెండవ సినిమా. తను చూడడానికి సీరియస్‌గా కనిపిస్తాడు కానీ, చాలా ఫ్రెండ్లీ నేచర్. కోస్టార్స్‌కి చాలా హెల్ప్‌ఫుల్‌గా ఉంటాడు. ప్రేక్షకులకు కొత్తదనాన్ని అందించాలని ఆరాటపడే నటుడు. తన సినిమాలు చూస్తే ఈ విషయం అర్థమైపోతుంది. తను ఓ పెద్ద సినిమా కుటుంబం నుంచి వచ్చినా ఆ గర్వం ఎక్కడా కనిపించదు.

**మూడు సంవత్సరాల కాలంలో ఇబ్బంది పడిన సందర్భం?**

లారెన్స్‌గారితో 'మొట్ట శివ కెట్ట శివ' అనే తమిళ సినిమా చేశాను. ఆ సినిమాలో ఆయనతో కలిసి డ్యాన్స్ చేయడం చాలా కష్టమనిపించింది. సెట్స్ మీదకి వచ్చేవరకూ ముందు రోజు ఇంట్లో డ్యాన్స్ బాగా ప్రాక్టీస్ చేసేదాన్ని. అయినా ఆయనతో కలిసి చేస్తుంటే కాళ్ళు తడబడేవి. నేను సరిగా చేయలేకపోయినా లారెన్స్‌గారు ఏమీ అనేవారు కాదు. ఒకటికి పదిసార్లు సెట్ మీదే నాతో ప్రాక్టీస్ చేయించేవారు. ఆయన డ్యాన్సింగ్ స్కిల్స్‌ని అందుకోవడం నాకు ఈ జన్మలో కుదరదేమో అనిపిస్తుంది. ఈ ఒక్క సినిమా అనే కాదు. ప్రతి సినిమాలోనూ కొత్త కొత్త విషయాలను నేర్చుకుంటూనే ఉన్నాను. ఓ విధంగా చెప్పాలంటే నేను నిత్య విద్యార్థినిని.

**మీ దృష్టిలో గ్లామరంటే....**

గ్లామర్ అంటే నా దృష్టిలో అందం. అందానికీ, అందాల ఆరబోతకీ మధ్యలో సన్నని గీత ఉంటుంది. తెర మీద అందంగా కనిపించడానికి నాకెలాంటి అభ్యంతరమూ లేదు. అవసరానికి మించి అందాల ఆరబోత చేయవలసిన అవసరమూ లేదు. నా పరిధిలో నేను అందంగా కనిపిస్తున్నాను. ఇది నేను చెబుతున్న మాట కాదు. ప్రేక్షకుల అభిప్రాయం. లిప్‌లాక్‌లూ, బికినీలూ నాకు సరిపడవు. ఇంత వరకూ వాటిని చేయలేదు. భవిష్యత్తులో కూడా చేయను. సన్నివేశం డిమాండ్ చేసిందని చేయడం నాకు నచ్చదు.

**కోలీవుడ్‌లో మీకు నచ్చిన హీరోలు...**

చాలామందే ఉన్నారు. ఒకరి గురించి చెప్పాలంటే కష్టం. విజయ్‌గారూ. సూర్యాగారు, అజిత్ గారూ ఇలా చాలా మంది అంటే ఇష్టం. వారితో చేయాలని ఉంది. ఎందరితో చేస్తానో తెలియదు. అసలు ఆ అవకాశం వస్తుందో లేదో కూడా తెలియదు. అభిమానం అనేది గుండెల్లో ఉండాలి కానీ, బయటకి చెప్పుకునేది కాదు.

**మరి టాలీవుడ్‌లో...**

ఇక్కడ కూడా చాలామంది మంచి నటులున్నారు. ఎవరి ప్రత్యేకత వారిది. విడివిడిగా చెప్పమంటే చాలా కష్టం. అందరూ మంచి డ్యాన్సర్లు. డ్యాన్సుల్లో వారి వేగం చూస్తుంటే భయం వేస్తుంటుంది.

**ఎలాంటి పాత్రలు చేయాలనుకుంటున్నారు?**

ఇప్పటి వరకూ ఏమీ అనుకోలేదు. ఇక ముందు కూడా అలాంటి ఆలోచన లేదు. మనసుకి మంచిది అనిపిస్తే చేయడం అంతే!

**చేస్తున్న సినిమాలు...**

కోలీవుడ్, మాలీవుడ్‌లలో కలిపి ఆరు సినిమాలు చేస్తున్నాను. తెలుగులో ఒక సినిమా ఒప్పుకునే అవకాశం ఉంది.

**బాలీవుడ్‌లో చేసే ఆలోచన ఉందా?**

చాలా మంది ఇలాగే అడుగుతున్నారు. అవకాశం వస్తే ఎందుకు చేయను? నాకేమీ భాషా భేదం లేదు. నటిగా ఏ భాషలోనైనా చేస్తాను.

**దెయ్యాలు, జాతకాలను నమ్ముతారా?**

లేదు. మా మదర్ నమ్ముతారు. ఆమె నమ్మకాన్ని గౌరవిస్తాను తప్ప అనుసరించను.

**ప్రేమ, పెళ్ళి గురించి...**

దానికి ఇంకా సమయం ఉంది. ప్రేమ పెళ్ళి చేసుకుంటానా? పెద్దలు కుదిర్చిన పెళ్ళా అనేది ఇప్పుడే చెప్పడం కష్టం. ఎప్పుడో జరగబోయే వాటి గురించి ఇప్పుడు మాట్లాడడం అనవసరం. అప్పటి పరిస్థితులను బట్టి పెళ్ళి విషయంలో నా నిర్ణయం ఉంటుంది.

–స్పందన రెడ్డి



# ట్రెండ్ మారిందంతే

## -కె.ఆర్.విజయ

ఇంటర్వ్యూ

**నిండైన రూపం గల గొప్ప నటి కె.ఆర్.విజయ. దక్షిణాది భాషలతోపాటు  హిందీలో కూడా నటించారు. ఎన్.టి.ఆర్, ఏఎన్నార్ సహా దక్షిణాదిన ఎందరో నటదిగ్గజాలతో  నటించారు. ఆదిపరాశక్తిగా ఎన్నో దేవతామూర్తి పాత్రల్లో ప్రేక్షకుల హృదయాల్లో నిలిచి పోయారు. ట్రెండ్ మారింది తప్ప సినిమాలు నాడు నేడు దేనికదే సాటి. అన్నీ తీసిపోని చిత్రాలే అంటున్న 400 చిత్రాల నటి కె.ఆర్.విజయ ఇంటర్వ్యూ.**

కేరళరాష్ట్రం ట్రావెంకూర్‌లో జన్మించాను. మా నాన్నగారు రామచంద్రన్. అమ్మ కల్యాణి. ఆరుగురు సంతానంలో నేనే పెద్దదాన్ని. నాన్నగారు ఆర్మీలో పని చేసేవారు. అసలు మా నాన్నగారి ఊరు చిత్తూరు. అమ్మది కేరళ త్రిస్సూర్. మా అమ్మానాన్నలది ప్రేమ వివాహం. మా స్వంత ఇల్లు చిత్తూరులో ఉండేది. ప్రముఖ నటుడు చిత్తూరు నాగయ్యగారి ఇల్లు మా ఇల్లు పక్క పక్కనే కావడం ఒక ప్రత్యేక విశేషం. నేను పుట్టింది కేరళలో అయినాగానీ ఎక్కువగా చిత్తూరులో మా ఇంట్లోనే ఉండేదాన్ని. మా కుటుంబంతో నాగయ్యగారు ఎంతో ఆప్యాయంగా కలిసిమెలిసి ఉండేవారు. నాకు ఊహ తెలిసిన రోజుల్లో నాగయ్యగారు నన్ను ఎత్తుకుని ఆడించడం ఇప్పటికీ నాకు గుర్తే. మా అమ్మ మలయాళీ.

### ఆడపిల్ల బయటకొస్తే అదోలా చూసేవారు

మా తాతయ్య, తాతమ్మల సంరక్షణలో ఉండేదాన్ని. నన్ను ఒంటరిగా ఎక్కడికీ పంపేవారు కాదు. ఆడపిల్లల్ని చాలా స్ట్రిక్టుగా పెంచేవారు. అమ్మానాన్న మాత్రం చూసీచూడనట్టు ఉండేవారు. నేను సినిమాల్లోకి వెళ్ళడం మా తాతమ్మగారికి అస్సలు ఇష్టం లేదు. నాన్నగారికి మాత్రం చాలా ఇష్టంగా ఉండేది.

### టెన్త్‌లోనే సినిమాల్లోకి

పదో తరగతిలో ఉన్నప్పుడే  నాకు సినిమాల్లో ఆఫర్లు రావడం ప్రారంభమైంది. దాంతో చదువు అర్ధాంతరంగా ముగించి సినిమారంగంలోకి ప్రవేశించాను. తమిళ చిత్రం ద్వారా సినీరంగ ప్రవేశం చేశాను. నా మొదటి చిత్రం 'కర్పగం'. పూర్తి ఫ్యామిలీ డ్రామాతో నడిచే ఈ చిత్రం 1963లో విడుదలైంది. ఈ చిత్ర నిర్మాత కె.ఎస్.గోపాలకృష్ణన్. జెమినీగణేశన్, సావిత్రి, ముత్తురామన్, ఎస్వీ రంగారావు, షీల తదితరులు నటించారు. ముఖ్యవిశేషం ఏమిటంటే ఒకప్పుడు నన్ను ఎత్తుకుని ఆడించిన నాగయ్యగారు ఈ చిత్రంలో కలెక్టర్ పాత్ర పోషించడం. ఈ చిత్రం సూపర్‌హిట్ కావడంతో నా దశ తిరిగింది. తెలుగులో ఈ చిత్రాన్ని ఎన్.టి.ఆర్ గారితో ఆదుర్తి సుబ్బారావుగారు తోడు-నీడగా రీమేక్ చేశారు.

### అసలుపేరు దేవనాయకి

ప్రముఖ తమిళ దర్శకుడు, రాజకీయ నాయకుడు ఎం.ఆర్.రాధగారు నా పేరును కె.ఆర్.విజయగా మార్చారు. ప్రముఖ నటీమణి రాధిక తండ్రి ఆయన. అమ్మానాన్నా నాకు పెట్టిన పేరు దేవనాయకి. ఆయన సినిమా షూటింగ్ ప్రారంభోత్సవంరోజు 'నీపేరేంటమ్మా' అని అడిగారు. దేవనాయకి అని చెప్పగానే, అదేం పేరమ్మా, ఎవరో వృద్ధురాలు పేరులాగా ఉంది, నీ పేరు నేను మారుస్తాను ఒప్పుకుంటావా? అని అడిగారు. సరే అన్నాను. మీ నాన్నగారి పేరులో మొదటి అక్షరం ఆర్. మీ అమ్మగారి పేరులో మొదటి అక్షరం కె ఈ రెండూ కలిసివచ్చేలాగా నీపేరు పెడతాను. నా చిత్రాలన్నీ విజయవంతం కావాలికాబట్టి విజయం నీ వైపు ఉండాలి. సో.... నీ పేరు కె.ఆర్.విజయ సరేనా అని డిసైడ్ చేశారు. అందుకు అందరూ అంగీకరించారు. అలా నేను ఆయన చలవతో విజయవంతంగా నా సినీ కెరీర్ కొనసాగించడం నా అదృష్టం.

### శ్రీకృష్ణపాండవీయం

తెలుగులో నా తొలి చిత్రం శ్రీకృష్ణపాండవీయం. రుక్మిణి పాత్ర. ఎన్.టి.ఆర్ నన్ను ప్రత్యేకంగా పిలిచి రుక్మిణి పాత్ర నువ్వే చెయ్యాలని గట్టిగా చెప్పారు. నాకు తెలుగు సరిగ్గా రాదు అని చెప్పాను. అవన్నీ నేను చూసుకుంటాను, ఆ పాత్రలో నువ్వు బాగా రాణిస్తావు అని నచ్చజెప్పారు. ఆయన అన్నట్టుగానే జరిగింది. తర్వాత నాకు ఎన్నో ఆఫర్లు రావడంతో, జానపద, పౌరాణిక, సాంఘిక చిత్రాలెన్నింటిలోనో నటించాను. ఎన్.టి.ఆర్ క్రమశిక్షణ ఏమిటో తెలుగు చిత్ర

పరిశ్రమ మొత్తానికి తెలుసు. ఆయన మనసెంతో మంచిది. అలాగే మర్యాద ఇచ్చి పుచ్చుకుంటారాయన. పరమానందయ్య శిష్యుల కథ, లక్ష్మీకటాక్షం, ఏకవీర, భలేతమ్ముడు, మేలుకొలుపు...ఇలా ఎన్.టి.ఆర్‌తో ఎన్నో చిత్రాలు చేశాను.

### భలే తమ్ముడు

ఎన్.టి.ఆర్ గారితో నేను నటించిన సూపర్‌హిట్ సాంఘిక చిత్రం భలేతమ్ముడు. ఆ షూటింగ్ సమయంలో వారి అబ్బాయి బాలకృష్ణ చాలా చిన్నపిల్లాడు. షూటింగ్ చూడాలనే కుతూహలంతో ఎన్.టి.ఆర్‌గారిని అడగకుండా, ఇంట్లో కూడా చెప్పకుండా వచ్చాడు. దాంతో రామారావుగారికి కోపం వచ్చింది. కొంచెం అరుస్తూ, అదిగో వెళ్ళు ట్రైన్ సీన్ షూటింగ్ జరుగుతోంది, వెళ్ళి దాంట్లో కూర్చో ఎక్కడా తిరగొద్దు అని గట్టిగా వార్నింగ్ ఇచ్చారు. ఆయన క్రమశిక్షణ అలాంటిది. ఆ తర్వాత నేను బాలకృష్ణ తల్లిగా ఎన్నో చిత్రాల్లో చేశాను. భైరవద్వీపం, శ్రీరామరాజ్యం..ఇలా తండ్రీ కొడుకులు ఇద్దరితో నటించడం నాకు ఎంతో సంతోషాన్ని కలిగించింది.

### దర్శకులు, నటులు

తెలుగులో సి.ఎస్.రావు, పుల్లయ్య, బి. విఠలాచార్య, పుండరీకాక్షయ్య, ఎన్.టి.ఆర్, దాసరినారాయణరావు, కె.విశ్వనాథ్, కోడి రామకృష్ణ వంటి దర్శక దిగ్గజాల చిత్రాల్లో నటించాను. ఎన్టీఆర్, ఏఎన్నార్, శోభన్‌బాబు, కృష్ణంరాజు, ఎం.జి.రామచంద్రన్, శివాజీగణేశన్, జయశంకర్, ఆర్.ముత్తురామన్, పద్మిని, సావిత్రి, వైజయంతిమాల, బి.సరోజాదేవి లాంటి వారందరితో నేను నటించడం నా అదృష్టం. నేను వాళ్ళ ఫ్యాన్‌ని. తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ చిత్రాల్లో ఆదిపరాశక్తి, పార్వతి, లక్ష్మీదేవి వంటి దేవతల పాత్రలు చేశాను. ప్రేక్షకులు ఎంతగానో ఆదరించారు.

### అక్కినేనితో

అక్కినేనిగారి 'సిపాయి చిన్నయ్య'లో నటించాను. ఆ చిత్రంలో నాతోపాటు భారతి కూడా నటించింది. డి.రామానాయుడుగారు నిర్మించిన ఈ చిత్రం 1969లో విడుదలైంది. అక్కినేనిగారితో నటించిన సూత్రధారులు మరువలేని చిత్రం. ముత్తురామన్‌తో నటించిన భలేపాప చిత్రం కూడా మరపురానిది. సూత్రధారులు, ఇద్దరూ ఇద్దరే, రాజావిక్రమార్క, జగన్మాత, విశ్వనాథనాయకుడు, శ్రీదేవి, శ్రీవినాయక విజయం, మామంచి అక్కయ్య, దుర్గ, సింహ, శ్రీరామరాజ్యం, 100% లవ్ లాంటి ఇంకా ఎన్నెన్నో చిత్రాల్లో నటించాను.





భర్త వేలాయుధన్‌తో...

### అందరికంటే ముందు ఏఎన్నార్‌గారే

తెలుగుచిత్ర పరిశ్రమ ఈనాడు హైదరాబాద్‌లో బాగా విస్తరించింది. చెప్పాలంటే మద్రాసు నుండి అందరికంటే ముందు అక్కినేని నాగేశ్వరరావుగారే హైదరాబాద్ తరలివచ్చారు. అలా మెల్లిమెల్లిగా వివిధ భాషల సినిమారంగాలు మద్రాసు నుండి సొంత రాష్ట్రాలకు తరలివెళ్ళిపోయాయి. దక్షిణాది చిత్రాలన్నీ మద్రాసులో నిర్మిస్తున్న సమయంలోనే నేను అన్ని భాషాచిత్రాల్లో నటించాను. తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ భాషల్లో దాదాపు 400 చిత్రాల్లో నటించాను.

### నాట్యం రాదు

భరతనాట్యం, కూచిపూడి నృత్యం ఏదీ నాకు రాదు. నేర్చుకోలేదు. చిన్నప్పుడు నాటకాల్లో నటించేదాన్ని. అవసరమైనప్పుడు ప్రేక్షకుల్ని ఆకట్టుకునేలా డాన్స్ చేసేదాన్ని. నాన్నగారికి మాత్రం నన్ను సినిమాల్లో చేర్పించాలని చాలా బలమైన కోరిక ఉండేది. కొన్నిసార్లు నాన్నగారు అనుకోకుండానే చిత్తూరు నుండి మద్రాసు సినిమాలు చూడటానికి తీసుకెళ్ళేవారు. సినిమాల్లో చేరాలని నాకు కూడా బాగా ఇష్టంగానే ఉండేది. నేను నటించిన కొన్ని చిత్రాల్లో నా డాన్స్ చూసి చాలా బాగుందని ప్రశంసించేవారు. నృత్యదర్శకుడు చెప్పినట్టు చేసేదాన్ని అంతే. ఆ క్రెడిట్ నృత్యదర్శకులదే.

### ఈ రెండు చిత్రాలూ ప్రత్యేకం

నా మొదటి చిత్రం కర్పగం, 100వ చిత్రం నత్తయిల్ ముత్తు. ఈ రెండు చిత్రాలకు ఒక ప్రత్యేకత ఉంది. ఈ రెండూ శతదినోత్సవ చిత్రాలే. కర్పగం చిత్రంలో అవకాశమిచ్చి నన్నెంతో ఉన్నతస్థితికి తీసుకువచ్చారు గోపాలకృష్ణన్‌గారు. అదేవిధంగా నిర్మాత, దర్శకునిగా మావారు వేలాయుధన్‌గారు నా విజయానికి ముఖ్యకారకులు. నా శతచిత్ర శతదినోత్సవ సంబరాల్లో మహానటులు ఎం.జి.ఆర్, శివాజీగణేశన్, రాజ్‌కుమార్, ఎ.వి.మియప్ప చెట్టియార్‌లాంటి దిగ్గజాలెందరో పాల్గొన్నారు. అది ఎన్నటికీ మరువలేను. నా చిత్రాలన్నీ ప్రేక్షకాదరణ పొందినవే. ప్రభుత్వాల నుండి ఎన్నో సంస్థల నుండి అవార్డులు పొందాను.

### టీవీ సీరియల్స్

ఎన్నో తమిళ టీవీ సీరియల్స్‌లో నటించాను. మడిసారుమామి, ఆదిపరాశక్తి, కుడుంబం, రాజరాజేశ్వరి, ఆనందం, శ్రీకృష్ణలీల, సత్యం శివం సుందరం లాంటి తమిళ, మలయాళ సీరియల్స్‌లో నటించడమే కాదు, వాటిని ప్రొడ్యూస్ చేయడం, దర్శకత్వం వహించడం గొప్ప సాహసమే. అవన్నీ ప్రేక్షకాదరణ పొందాయి.

### ఆ రోజులు తిరిగిరావు

ఆనాటి రోజులు తిరిగిరావు. అదంతా స్వర్ణయుగం. అనాటి నటీనటులు, వాళ్ళ మనసులు కూడా నిజంగా బంగారమే. మమతలతో కలిసిమెలసి ఉండేవాళ్ళం. కాలం మారింది. పరిశ్రమ మారింది. అందుకు అనుగుణంగానే నటులు నటిస్తున్నారు. కొత్త టెక్నాలజీ, కొత్త ప్రయోగాలు చేస్తున్నారు. దానికదే, దీనికిదే. అన్నీ తీసిపోని చిత్రాలే. కాకపోతే ట్రెండ్ మారింది.

### కుటుంబం

మావారిపేరు వేలాయుధన్. మాది ప్రేమ వివాహం. మాకు ఒక కుమార్తె. పేరు హేమలత. అల్లుడు వ్యాపారవేత్త. మా వారు చిత్ర నిర్మాత, దర్శకులు. దాదాపు అన్ని భాషలలోనూ సుమారు 56 చిత్రాలు ప్రొడ్యూస్ చేశారు. ఆయన నిర్మాతగా ఉన్నప్పుడే నాకు పరిచయమయ్యారు. అది ప్రేమగా మారింది. ఆ విధంగా పెద్దల అంగీకారంతో పెళ్ళి చేసుకున్నాం. సినిమా రంగమే మా ఇద్దరినీ కలిపిందన్నమాట. ఆనాటి సినీరంగ ప్రముఖులు ఎందరో మా వివాహ వేడుకలకు హాజరయ్యారు.

బాలకృష్ణ నటించిన అన్నదమ్ముల అనుబంధం, మా ఇంటి ఇలవేల్పు... ఇలా దాదాపు 15 తెలుగు సినిమాలను ఆయన నిర్మించారు. శివాజీ గణేశన్, ఎన్.టి.ఆర్ చిత్రాలకు ఆయనే ప్రొడ్యూసర్. అక్కినేని గారు మావారికి మంచి మిత్రులు. సిపాయి చిన్నయ్య నిర్మాణ సమయంలోనే వారికి స్నేహం ఏర్పడింది. ఆ విధంగా మేం ఫ్యామిలీ ఫ్రెండ్స్ కావడం నాకెంతో సంతోషదాయకం. ఇదేకాకుండా ఇతరత్రా కూడా ఆయన ఆరితేరిన వ్యాపారవేత్త. షిప్పింగ్ ఎగుమతి దిగుమతి వ్యాపారం, సుదర్శన్ చిట్‌ఫండ్స్, తెలంగాణ, ఆంధ్రా రాష్ట్రాల్లో ఎంతో పేరు సంపాదించింది. అదేవిధంగా రాజమండ్రిలో బ్రిక్స్ ఫ్యాక్టరీ స్వయంగా చూసుకునేవారు. గత ఏడాది ఆయన దివంగతులయ్యారు. దాంతో ఆ బాధ్యతలన్నీ నాపైన పడటం, వాటిని చూసుకునే కార్యక్రమంలో బిజీగా ఉండటం వల్ల సినిమా రంగానికి దూరంగా ఉన్నాను.

—కె.హరనాథ్, సెల్ 9703542598

# ఇవన్నీ నిజాలే!

## ఉరిశిక్షల్లోనూ అగ్రస్థానమే

- ఉరిశిక్షల అమలులోనూ చైనాదే అగ్రస్థానం. 2016లో ఆ దేశంలో 1000 మందిని ఉరితీశారు. రెండవస్థానం ఇరాన్‌దే. అక్కడ 567 మందిని, సౌదీ అరేబియాలో 154 మందిని, పాకిస్థాన్‌లో 87 మందిని గత ఏడాది ఉరితీశారు.
- కొందరికి మెదడులో ఒక భాగమే పనిచేయడాన్ని హెమీ నెగ్లెక్ట్ లేదా హెమీ స్పేషియల్ నెగ్లెక్ట్ అంటారు. వీళ్ళకి శరీరం ఎడమవైపు అనుభూతి ఉండదు. కంచంలో అన్నంపెడితే కుడివైపున్న భాగాన్నే తింటారు. కుడివైపే షేవింగ్ చేసుకుంటారు!
- విమానాల్లో ఆహారం అంత రుచిగా ఉండదు, కారణం మనకు వాసన చూసే శక్తి, రుచి చూసే శక్తి 20 నుండి 50 శాతం మేరకు తగ్గిపోతుంది.
- ఒక అంచనా ప్రకారం, ప్రస్తుతం భూమ్మీద సజీవంగా ఉన్న జనాభాలో ఐదు కోట్ల 40 లక్షల మంది 12 నెలల వ్యవధిలో మరణిస్తారు.
- మనిషిని మనిషి కరిచే అలవాటు పాతదే. కానీ న్యూయార్క్ నగరంలో ఏటా కనీసం 1600 మంది ఈ బారిన పడుతున్నారు.
- చాసోగా ప్రసిద్ధి చెందిన రచయిత చాగంటి సోమయాజులుకు కన్నవారు పెట్టిన పేరు కానుకొలను నరసింహారావు.
- మరాఠీ భాషలో మొట్టమొదట పుస్తకంగా వెలువడిన దళితుని ఆత్మకథ 'బాలుటా'.
- భూమ్మీద బతికే మొత్తం చీమల బరువు మనుషుల బరువుకంటే ఎక్కువ.
- దోమకు 47 పళ్ళు ఉంటాయి.
- ఒక తల్లి కవలల్ని ప్రసవించింది. అయితే రెండోబిడ్డ ప్రసవం జరగడానికి 87 రోజులు ఆలస్యం జరిగింది.
- ప్రస్తుతం భూమ్మీద మనిషికి ఆకలిబాధకంటే ఒబేసిటీ బాధే చాలా ఎక్కువగా ఉంది –సర్వే
- శబ్దగ్రహణం, కంటిచూపు, శరీరస్పర్శ, వాసన, రుచి చూడటంతో సహా మనిషికి మరో 15 స్పర్శాజ్ఞానాలు కూడా ఉన్నాయట. వాటిల్లో బ్యాలన్స్, పెయిన్, వేడిని గ్రహించడం, నొప్పి, కాలాన్ని తెలుసుకోవడంతోపాటు శరీరంలో అంతర్గతంగా ఉక్కబోత, దాహం, ఊపిరి ఆడకపోవడం లాంటి జ్ఞానాలు చాలా ఉన్నాయట!
- 1518లో జర్మనీకి డాన్సింగ్ మేనియా పట్టింది. అక్కడి ప్రజలు నెల రోజులు విశ్రాంతి లేకుండా నాట్యాలు చేశారట. దీనిని Dancing Plague అంటారు.
- ప్రయరీ కుక్కలు (Prairie dogs) ప్రతిరోజూ పరస్పరం ముద్దులు పెట్టుకుని పలకరించుకుంటాయి.

## మన అంచనా తప్పేనా?

- కెనడా పురాతన సముద్రనేలలపై లభించిన 380 కోట్ల సంవత్సరాల క్రితంనాటి తాజా శిలాజ సూక్ష్మజీవుల ఆధారాల ప్రకారం, భూమ్మీద అనుకున్నదానికంటే ముందుగానే జీవం ఆవిర్భవించి ఉంటుందని శాస్త్రవేత్తలు ఊహిస్తున్నారు. ఇదే నిజమైతే అంగారక గ్రహంపై జీవం ఉండే అవకాశాన్ని వారు తోసిపుచ్చడంలేదు.

–చిన్నారి

## సుధామ పదగారడి-320

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ❖ | 4 | | 5 | |
| ❖ | h | ❖ | | ❖ | | ❖ | h | ❖ |
| 6 | | 7 | ❖ | 8 | ❖ | 9 | | 10 |
| | ❖ | 11 | | | | ❖ | ❖ | |
| 12 | 11 | | ❖ | ❖ | ❖ | 13 | | h |
| | ❖ | 15 ❖ | 14 | 15 h | | h | ❖ | |
| 16 | 17 | | ❖ | | ❖ | 18 | 19 h | |
| ❖ h | | ❖ | 20 | ❖ | 21 | ❖ | h | ❖ |
| 22 | | | | ❖ | 23 | | | |

### ఆధారాలు

**అడ్డం**

1. విష్ణువు (4)
4. రాణిగా అనిరుద్ధుని భార్య (4)
6. రెలిజియన్ (3)
9. చలనము లేనిది (3)
11. పలుకుబడి, మాట చమత్కారము (4)
12. బంగారం అమ్మేప్పుడు దీనికీ లెక్క కడతారు (3)
13. కామెర్ల రోగికి లోకమంతా.... (3)
14. అస్మదీయులు (4)
16. పిల్లలపట్ల తల్లితండ్రులకు వుండేదే ఇదీను (3)
18. ఆలయం పై భాగపు పొడుగాటి కట్టడం (3)
22. దారి నడుచువాడు (4)
23. ఉరుకులు తోడివి (4)

**నిలువు**

2. కొత్తదనం (3)
3. ఇచ్ఛ, కోరిక, నిమిషము (2)
4. పలుకు, మాట (2)
5. రాజహంస (3)
6. భూమి (5)
7. అడుగు, మునకవేయు (3)
8. హిందీలో మోసము (2)
10. రావణుడి పట్టణం (5)
13. ...పరుగు (ఒకటే పరుగు అని!) (3)
15. హాసము (2)
17. సన్నని పుల్ల (3)
19. కీటకము (3)
20. లక్ష్యము, వేటగాడు బాణం ఎక్కుపెట్టి చూసేది (2)
21. ఇల్లు (2)

### పదగారడి-319 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 గు | 2 రు | కు | 3 ల | ము | | 4 దా | 5 వా |
| 6 స్త్రీ | | వి | | వ | | 7 క | | చ |
| 8 వి | త్తు | | 9 పో | ల | ర | మ్మ | | క |
| ద్య | | 10 ప | | శం | | 11 ద | ట్ట | ము |
| | | 12 ర | తి | | 13 ము | న | | |
| 14 వి | వ | క్ష | | 15 గ | | ము | | 16 ఫ |
| వా | | 17 కో | దం | డ | ము | | 18 ఉ | లి |
| హ | | సం | | గ | | 19 గ | | తం |
| 20 ము | ఖ్యం | | 21 అం | దా | శ | య | ము | |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

# రానా నటన నచ్చింది -రియా చక్రవర్తి

**చా**లామంది హీరోయిన్లు దక్షిణాదిన స్టార్ అనిపించుకున్న తరువాత ఉత్తరాది వైపు దృష్టిపెడతారు. రియా చక్రవర్తి మాత్రం ఉత్తరాదిన భేష్ అనిపించుకున్న తరువాతే టాలీవుడ్‌లో సత్తా చాటాలనుకుంది. గతంలో తెలుగులో ఒకే ఒక్క సినిమా చేసి బాలీవుడ్‌కి వెళ్ళిందీ బ్యూటీ. తిరిగి తెలుగులో తనను తాను ప్రూవ్ చేసుకునేందుకు సిద్ధమయ్యాను అంటున్న రియా చక్రవర్తితో....



**మీ గురించి....**

స్టడీ పూర్తవుతూనే టీవీ యాంకర్‌గా చేరాను. అప్పుడే సినిమాల్లో అవకాశం వచ్చింది. తెలుగులో 'తూనీగ తూనీగ' సినిమా చేసినా పెద్దగా గుర్తింపురాలేదు. ఆ సమయంలోనే బాలీవుడ్‌లో అవకాశాలు రావడంతో అక్కడ దృష్టిపెట్టాను. ఇటీవలే తెలుగులో ఓ యంగ్ హీరో పక్కన చేసే ఛాన్స్ వచ్చింది. కథ నచ్చడంతో సినిమాకు ఓకే చెప్పాను. కాకపోతే దీని వివరాలు ఇప్పుడే చెప్పడం కుదరదు. ఇక నుంచి తెలుగు మీద ఎక్కువ ఫోకస్ పెట్టాలని నిర్ణయించుకున్నాను. ఇందుకోసం తెలుగు కూడా నేర్చుకుంటున్నాను.

**హైదరాబాద్‌కి మొదటిసారి వచ్చారా?**

గతంలో ఒకసారి వచ్చాను. ఇప్పుడు ఇక్కడే కొన్ని రోజులు ఉండాలని అనుకుంటున్నాను. ఇక్కడే ఉంటే తెలుగు దర్శకనిర్మాతలకు అందుబాటులో ఉండడానికి వీలుంటుంది.

**కథల ఎంపికలో మీ ప్రయార్టీ?**

పాత్ర నచ్చితేనే ఓకే చెబుతాను. గతంలో చాలా అవకాశాలు వచ్చాయి. కథలు నచ్చలేదు. అందుకే ఆ సినిమాలు రిజెక్ట్ చేశాను. ఎన్ని సినిమాలు చేశాము అనేదాని కన్నా ఎంత మంచి సినిమా చేశాను అన్నదే నాకు ముఖ్యం. ఇలాంటి పాత్రలే చేయాలన్న నిబంధనలేవీ పెట్టుకోలేదు. ఎలాంటి పాత్ర అయినా సరే ముందు నా మనసుకు నచ్చాలి.

**కన్నడ అమ్మాయి అయి ఉండి దక్షిణాదిలో సినిమాలు చేయకపోవడానికి కారణం?**

ముందు ఓ విషయం స్పష్టం చేయాలి. నేను బెంగుళూరు అమ్మాయిని కాను. మా మదర్‌ది మంగళూరు, ఫాదర్‌ది బెంగాల్. నేను పుట్టింది పూణెలో. ముందు నేను చేసింది తెలుగులోనే. ఇక దక్షిణాదిన సినిమాలు చేయలేదు అన్నదాంట్లో అర్థం లేదు. నటిగా ఎక్కడ అవకాశాలు వస్తే అక్కడ చేయాలి. బాలీవుడ్‌లో అవకాశాలు ఎక్కువ వచ్చాయి. అక్కడ చేశాను. అక్కడ సినిమాలు పూర్తి చేసి టాలీవుడ్‌కి వచ్చాను. దక్షిణాదిలో అతి పెద్ద పరిశ్రమ ఇదే! అలాంటప్పుడు తెలుగును ఎందుకు నిర్లక్ష్యం చేస్తాను?

**టాలీవుడ్‌లో బిజీ అవుతానంటున్నారు కదా? తెలుగు సినిమాలు చూశారా?**

'మనం', 'బాహుబలి', మరికొన్ని సినిమాలు చూశాను. నా దృష్టిలో 'బాహుబలి' తెలుగు సినిమానే కాదు. అంతర్జాతీయ సినిమా. అంత గొప్పగా ఉంది ఆ సినిమా.




**ఈ సినిమాలో మీకు ప్రభాస్ నటన నచ్చిందా? రానా నటన నచ్చిందా?**

రానా నటన. ఎందుకంటే...రానా నాకు మంచి ఫ్రెండ్. ప్రతి విషయంలోనూ తన గైడెన్స్ నాకు ఉంటుంది. అందుకే నా స్నేహితుడి నటన నాకు బాగా నచ్చింది. ప్రభాస్ నటన నచ్చలేదని కాదు. తను కూడా బాగా చేశారు. రానా నా ఫ్రెండ్ కనుక నా ఓటు తనకే!

**హీరోయిన్లు గ్లామర్‌కు, పాటలకు మాత్రమే పరిమితం... ఈ విషయంతో మీరు ఏకీభవిస్తారా?**

అస్సలు ఏకీభవించను. కొద్ది సంవత్సరాలుగా హీరోయిన్ల క్యారెక్టర్లలో చాలా మార్పులు వచ్చాయి. వస్తున్నాయి. గతంలో వారిని కేవలం పాటలకు డ్యాన్సులకు మాత్రమే పరిమితం చేసి ఉండవచ్చు. ఇప్పుడా పరిస్థితి లేదు. చాలా మంది హీరోయిన్లు పవర్‌ఫుల్ పాత్రలు చేస్తున్నారు. ఈ విషయంలో విద్యాబాలన్, అనుష్కశర్మలే నాకు ఆదర్శం.

**ఆదిత్యారాయ్‌తో మీ రిలేషన్ గురించి....**

అది గతం. ఇప్పుడు తనతో ఎలాంటి రిలేషన్ షిప్ లేదు. నా దృష్టంతా కెరీర్ మీదే పెట్టాను. ముఖ్యంగా టాలీవుడ్ మీద ఫోకస్ చేస్తున్నాను. ఇక్కడ మంచి పేరు తెచ్చుకోవాలి.

—బికె.

